# దైవదాత
# దివ్యజీవన సంధాత
# వారి పరిమళ జీవనం



శ్రీ దేవానంద చిన్నస్వాముల వారి
షష్ట్యబ్ది పూర్తి మహోత్సవ సంచిక



# దైవదూత - దివ్యజీవన సంధాత వారి పరిమళ జీవనం



శ్రీ దేవానంద - చిన్న స్వాములవారి
షష్ట్యబ్ది పూర్తి మహోత్సవ సంచిక
**16 జూన్ 1997**



శ్రీ శివానంద సందేశ ప్రచార సేవా సమితివారి సమర్పణ
ఆనంద కుటీర్, ఋషికేష్,
హిమాలయాస్.

# స్వామి దేవానంద - జీవిత విశేషములు

* జన్మస్థలం : విశాఖపట్టణం జిల్లా, చోడవరం తాలూకా కొత్తపెంట గ్రామము.
* తలిదండ్రులు : శ్రీ గుత్తపూడి రామస్వామిగారు, శ్రీమతి పింహాచలమ్మగారు.
* జననము : ఈశ్వరనామ సంవత్సర జ్యేష్ఠ శుక్లపక్ష ఏకాదశి 19-6-1937
* నామకరణం : సన్నిబాబు అని పిలచేవారు (పితామహుని పేరు సన్యాసయ్య)
* విద్య : 1943 నుండి 1950 వరకు ప్రాథమిక పాఠశాలలో.
* బ్రహ్మానందాశ్రమ ప్రవేశం : 1951 మహాశివరాత్రి అనంతరం.
* శ్రీ బ్రహ్మానంద స్వాములవారి నుండి మంత్రదీక్ష : 1951 శ్రీరామనవమి.
* బ్రహ్మానందాశ్రమంలో (గురు) సేవ : 1951-54.
* శ్రీ వ్యాసాశ్రమములో చేరుట : 1955 - వినాయక చవితి.
* బ్రహ్మానందాశ్రమమునకు తిరిగి రాక 1955 డిశంబరు.
* కాశీక్షేత్రము మీదుగా ఋషికేష్ చేరుట 1956 జూన్.
* శ్రీ శివానందాశ్రమములో ప్రవేశం 1956 - గంగాదశరా తరువాత.
* వత్తిడి వలన శ్రీ బ్రహ్మానందాశ్రమమునకు తిరిగి వెళ్ళుట 1957 జులై
* శ్రీ సద్గురు మళయాళ స్వాములవారిచే రాజమండ్రిలో నిర్వహింపబడిన చాతుర్మాస్య మహావ్రతములో స్వచ్ఛంద సేవకునిగా 1958 లో
* శ్రీ వ్యాసాశ్రమములో గురుపూజలో పాల్గొనుట 1959, ఫిబ్రవరి.
* వీరఘట్టములో శ్రీ మళయాళ స్వాములవారిచే జరుపబడిన సనాతన వేదాన్త జ్ఞాన సభలలో పాల్గొనుట. 1959 మార్చి
* శ్రీ శివానందాశ్రమములో పునః ప్రవేశము 1959, ఏప్రిల్.
* 1959 ఏప్రిల్ నుండి 1963లో జగద్గురు శ్రీ శివానంద స్వాములవారు మహాసమాధిలో ప్రవేశించు వరకు వారి చరణసేవలో సపర్యలుచేయుట.
* శ్రీశ్రీశ్రీ చిదానంద స్వాములవారి ఆజ్ఞానుసారము వారివెంట తణుకులో 1964లో జరిగిన దివ్యజీవన సంఘ సభలలో పాల్గొనుట.
* 1964 సెప్టెంబరు నుండి 1965 మే నెల ఆఖరు వరకు అఖిల భారతదేశయాత్ర.
* 1968లో **Thought Power** అను గురుదేవుల ఆంగ్లగ్రంధాన్ని "మానసికశక్తి" అను పేరు ప్రథమంగా ఆంధ్రీకరించుట.
* 1987లో **Jnana Yoga** అను గురుదేవుల ఆంగ్ల గ్రంధాన్ని "జ్ఞాన యోగము" అను పేరు ఆంధ్రీకరించుట. శ్రీ దేవానంద స్వాములవారు ఆంధ్రీకరించిన గురుదేవుల ఆంగ్ల గ్రంథములలో ఇది ఇరువదవ గ్రంథము.




శ్రీశ్రీశ్రీ స్వామి శివానంద సరస్వతీ మహరాజ్

ఓం

ఓం నమోభగవతే శివానందాయ

# సాదర సమర్పణ

వాత్సల్యతతో పరివ్రాజక ప్రముఖులు, అభినందనలతో
సోదరపరివ్రాజకులు, ఆదరముతో మహనీయులు, అనురాగముతో
పెద్దలు, అభిమానముతో మిత్రులు, శ్రద్ధతో సహచరులు,
భక్తిప్రపత్తులతో అనుచరులు సమధికోత్సాహముతో
అభినందించుచు విడివిడిగా అందించిన సుగంధభరిత
పుష్పములను మాలగా సమకూర్చి

**శ్రీ దేవానంద - చిన్నస్వామి** గారికి

వారి షష్ఠ్యబ్దపూర్తి ఉత్సవ జయన్తీ శుభసమయమున
సగౌరవముగా సమర్పించుకొనుచున్నాము.

ఇట్లు - విన్నవించు

**షష్ఠ్యబ్దపూర్తి నిర్వహణాసమితి**

స్వస్తిశ్రీ ఈశ్వరనామ సంవత్సర
జ్యేష్ఠ శుక్ల పక్ష ఏకాదశి (నిర్జల ఏకాదశి)
16 జూన్ 1997

# Ac - knowledgement (కృతజ్ఞతలు)

ముఖ్యముగా యీ షష్ఠ్యబ్దపూర్తి మహోత్సవ సంచిక తయారు కావడము కేవలము పూజ్యశ్రీ స్వామి అసంగానంద స్వాములవారి సంకల్ప బలమనేది నిర్వివాదాంశము. దాదాపు ఇందులోవున్న మెటీరియల్ అంతా గూడ వారు అహర్నిశము శ్రమించి, అడుగడుగున ఆటంకాలను, అభ్యంతరాలను, ఆక్షేపములను అనవరతము ఎదుర్కొంటూ సుదీర్ఘమైన పోరాటంతో సాధించి సమకూర్చినదే.

రెండవది ముఖ్యంగావున్న మ్యాటరంతా వారికి సమయమున్నా లేకపోయినా అస్తవ్యస్తంగా వ్రాసి పంపించిన వ్యాసాలను, పద్యాలను, కీర్తనలను సరిగ్గా తీర్చిదిద్దిన ఘనత పూజ్య శ్రీ హంసానందుల వారికి దక్కవలసిందే.

అన్నిటికన్నా ప్రధానమైనది శ్రీ శివానంద సందేశ సమితివారి అభ్యర్ధనను చివరి నిమషంలోనైనా మన్నించి, యీ సంచిక ముద్రణకు అంగీకరించనిచో చాలామంది భక్తులకు నిరాశ కల్గియుండెడిది. ఈవిధంగా భక్తులకు ఆనందాన్ని ప్రసాదించినందులకు పూజ్య శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారికి వినమ్ర కృతజ్ఞతలు.

ఈసంచికను సర్వాంగసుందరంగా తీర్చిదిద్దడానికి శ్రీ రత్నా ప్రింటర్సు వారికి అవకాశమిచ్చిన రవి ప్రింటర్సు వారికి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఇట్లు

శ్రీ శివానంద సందేశ ప్రచార సేవాసమితి





# విశ్వప్రార్థన

ఓ ! పూజ్యప్రభూ ! క్షమా పరిపూర్ణ ! ప్రేమమయా !

నీకు నమస్కృతులు, సాష్టాంగ ప్రణామములు.

నీవు సచ్చిదానందుడవు, సర్వాంతర్యామిని.

సర్వశక్తిమయుడవు. సర్వజ్ఞుడవు.

సర్వజీవ హృదయాంతర్వాసివి.

కరుణార్ద్ర హృదయము, సమదృష్టి. స్థిరమనస్సు.

భక్తి, విశ్వాస జ్ఞానములు మాకు ప్రసాదింపుము.

ఆకర్షణలణగద్రొక్కి చిత్తవృత్తుల నరికట్టుటకు,

మాకు వలయు అంతరాధ్యాత్మిక శక్తి నొసంగుము.

కామ, లోభ, ద్వేషముల బారినుండి మమ్ము తప్పింపుము.

మా హృదయ ఫలకములను సద్గుణములతో నింపివేయుము.

ఈ సర్వనామ రూపములలో నిన్ను తిలకింపనిమ్ము.

ఈ సర్వనామ రూపములలో నిన్ను సేవింపనిమ్ము.

నిన్ను సదా స్మరించుకొననిమ్ము.

నీ లీలలు సదా గానము చేయనిమ్ము.

నీ నామము సదా మా పెదిమలపై నుండనిమ్ము,

నీలో సదా మమ్ము వసింపనిమ్ము.





శ్రీ దేవానందస్వామిని
దగ్గర దీసి సన్యాస
దీక్షను ప్రసాదించిన
శ్రీ బ్రహ్మానంద
భారతీస్వాములవారు
(1951లో)



శ్రీ దేవానందజీ
(1956లో)



రాజమండ్రిలో జరిగిన
చాతుర్మాస్య మహావ్రత
సందర్భములో సద్గురు
మహర్షి మళయాళస్వాముల
వారితో దేవానందస్వామి
(1958 లో)



జగద్గురు శ్రీ శివానంద
సరస్వతీ స్వాములవారి
పాదసన్నిధిలో
శ్రీ దేవానంద చిన్నస్వామి
(1960 లో)



శ్రీ దేవానంద
చిన్నస్వాములవారు
1961లో చాతుర్మాస్య
వ్రతాచరణ సందర్భంలో



జగద్గురు శ్రీ శివానందస్వాములవారి సేవలో శ్రీ దేవానంద చిన్నస్వామి
(1961లో)



శ్రీ దేవానంద
చిన్నస్వామి
(1962లో)



గురుదేవుల ఆదేశానుసారము భారత దేశాధ్యక్షులగు డాక్టర్ సర్వేపల్లి
రాధాకృష్ణన్‌గారికి ఫల పుష్పాలు సమర్పిస్తున్న
శ్రీ దేవానంద చిన్నస్వామి (1963 లో)



తమ పూర్వాశ్రమ మాతాపితరులతో శ్రీ దేవానంద చిన్నస్వామిగారు ఎడమవైపున మొదట ఉన్నవారు వారి మేనమామగారగు శ్రీ స్వామి శాన్తానంద భారతిగారు (1963)



శ్రీ దేవానంద చిన్నస్వామిగారు తమ పూర్వాశ్రమ సమగ్ర పరివారంతో 1968లో



ఉపన్యాస వేదికపై
శ్రీ దేవానంద
చిన్నస్వామిగారు



శ్రీ కృష్ణానంద స్వాముల
వారితో శ్రీ దేవానంద
చిన్నస్వాములవారు
(1968 లో)



ఉపన్యసిస్తున్న
శ్రీ దేవానంద
చిన్నస్వామివారు
(1972లో)



శ్రీ దేవానంద
చిన్నస్వాములవారు
(1973లో)



ఆశ్రమాధినేతలతో (1977లో) (1) శ్రీ దేవానంద చిన్నస్వామీజీ (2) శ్రీ కృష్ణానందస్వామీజీ మహరాజ్ (3) శ్రీ దయానందస్వామీజీ మహరాజ్ (4) శ్రీ ప్రేమానందస్వామీజీ మహరాజ్ (5) శ్రీ చిదానంద స్వామీజీ మహరాజ్ (6) శ్రీ మాధవానందస్వామీజీ మహరాజ్



శ్రీ హంసానంద స్వామివారితో శ్రీ దేవానంద చిన్నస్వామివారు
(1982లో)



ప్రసన్న వదనంతో శ్రీ దెవానంద చిన్న స్వామిగారు



1986లో విజయవాడ శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆలయంలో
ఆర్యవైశ్య సమాజపరంగా శ్రీ సర్దార్ బయ్యన
వీరరాఘవరావుగారు శ్రీ దేవానంద చిన్న
స్వాములవారిని సన్మానించుట.



రాజమండ్రి శ్రీ రత్నా ప్రింటర్స్ ప్రొప్రైటర్
కె. శ్రీరామచంద్రమూర్తిగారిని
శ్రీ చిన్న స్వాములవారు సన్మానించినారు.



1987 మార్చి 14వ తేదీన లోనావాలాలో జరుపబడిన స్వర్ణోత్సవ సభలో
తమకు గావించిన సన్మానమునకు శ్రీ దేవానంద స్వాములవారు
కృతజ్ఞతలు తెలియజేస్తూ ఉన్నారు.



8-6-1987 ప్రాతఃకాలంలో శ్రీ విశ్వనాథ మందిరములో అర్చనలు
జరుపుతూ ఉన్నట్టి శ్రీ దేవానంద స్వాములవారు



# దివ్యశ్రీ స్వామి దేవానందజీ

శ్రీశ్రీశ్రీ స్వామి చిదానందజీ మహరాజ్
అధ్యక్షులు, దివ్యజీవన సంఘము,
అంతర్జాతీయ ప్రధాన కార్యాలయము, ఋషీకేశ్.



(పరమపూజ్య శ్రీశ్రీశ్రీ చిదానంద స్వాములవారు దయతో శ్రీ దేవానంద చిన్నస్వామిగారిని గూర్చి అభినందనలతో, ఆశీర్వాద పూర్వకంగా అనుగ్రహించిన ఆంగ్ల సందేశమును శ్రీ హంసానంద స్వాములవారు ఆంధ్రీకరించి అందించినారు, ఇక చదవండి. - సంపాదకుడు.)



దివ్యమైన విశ్వపురుషునికి విధేయతలు సద్గురు శ్రీ శివానంద స్వాముల వారికి సాష్టాంగ ప్రణామములు ఈ పవిత్ర భరత భూమియందున్న బ్రహ్మవిద్యా గురువు లందరికీ వందనములు.

దైవీ సంపదతోను మరియు అరుదైన, అమూల్యమైన దివ్యజీవన మనెడి ఆభరణముతోను అలంకృతులై యున్న పూజ్యులు మరియు ప్రియులైన శ్రీ దేవానందస్వాములవారిపై దైవానుగ్రహము, గురుకృప మరియు ఆదినారాయణుడు మొదలుకొని ఆధునిక మహాత్ములైన బ్రహ్మ విద్యా గురువులందరియొక్క అమోఘమైన ఆశీస్సులు ప్రసరింపబడునుగాక! ప్రియతములును, పూజ్యతములునగు శ్రీ స్వామి శివానంద గురుదేవుల వారి అభిప్రాయాను సారముగా శ్రీ దేవానందస్వాముల వారొక దివ్యమైన వ్యక్తి మరియు దివ్యమైన సన్న్యాసి యనుట నిర్వివాదాంశమై యున్నది.

గురుదేవుల పవిత్రమైన ఆధ్యాత్మిక సంస్థ మఱియు దివ్యజీవన సంఘము యొక్క ఆధ్యాత్మిక జాగృతి మఱియు ఆధ్యాత్మిక పునరుద్ధరణ కార్యమునందు శ్రీ దేవానందస్వాములవారొక అపూర్వమైన మఱియు అమూల్యమైన రత్నమువంటివారు. ఉభయులున్నూ శక్తివంతులు మఱియు శక్తిసంభరితులై యున్నారు గురుదేవులైన శ్రీ శివానందస్వాముల వారి జ్ఞాన యజ్ఞము మరియు దివ్యజీవన ప్రచారములను జరుపునప్పుడు వారికిగల ఔత్సుక్యము, గాంభీర్యము మఱియు మనోదార్ఢ్యములు సంపూజ్యులను, సమ్మాన్యులనగు గురుదేవులవారిని పోలియుండును శ్రీ దేవానంద స్వాములవారి సంకీర్తన మఱియు ఉపన్యాసములు అనేక అంశములలో గురుదేవుల వారి పంథా మఱియు పద్ధతిని అనుసరించి యుండును. శ్రీ గురుదేవులు మఱియు శ్రీ దేవానందస్వాములవారి మధ్య నిశ్చయముగా పూర్వజన్మలలో కొంత సంబంధము మఱియు బంధుత్వముండి యుండును. ఏది ఎట్లయినను ఈ విషయమునందెట్టి సందేహములేదు. నాకీ విషయమునందు దృఢమైన విశ్వాసమున్నది. ఏలననగా శ్రీ గురుదేవులవారు తమ ప్రస్తుతావతారము నందు తమ పూర్వజన్మలలోని అంతర్నిహితమై యున్న సన్న్యాస సంస్కారములు మరియు వాసనలుగల అసంఖ్యాకులగు జీవాత్మలను తమపైపులకర్షించుకొనిరి. మన దేవానందస్వాములవారు పూర్వజన్మయందు వారు నిశ్చయముగా సన్న్యాసియై యుండిరి. ఉపనిషదధ్యయన మొనర్చి వేదజ్ఞానము నార్జించు నిమిత్తమై సంస్కృతభాష నభ్యసించుటకుగాను 17 సంవత్సరముల బాలుడై యున్నప్పుడే శ్రీ దేవానందులు కాషాయవస్త్రధారియై శ్రీ వ్యాసాశ్రమ సంస్థాపకులును, మహర్షియు, తపస్వియునగు శ్రీ శ్రీ మలయాళస్వాములవారి దరిజేరిరి.

ఆశ్చర్యకరమైన విషయమేమనగా వారు జన్మించినప్పుడు తల్లిదండ్రులు వారికి పెట్టినపేరు "సన్న్యాసి".

తమకు 20 సంవత్సరములు నిండిన మరునాడే శ్రీ దేవానందస్వాములవారు ఋషికేశ్‌లోని శివానందాశ్రమమునందు ప్రవేశించి, గురుదేవుల వారిని సేవించి శ్రీవారి అనుగ్రహమును మఱియు బ్రహ్మజ్ఞానము నార్జించుటకు తమకుగల కుతూహలమును వెలిబుచ్చిరి. శ్రీ గురుదేవులు ఏ వ్యక్తిపై తమ దృష్టిని సారించినను, వెంటనే ఆ వ్యక్తియందున్న ఆధ్యాత్మిక స్తోమతను గుర్తెఱుంగునట్టి ఆశ్చర్యకరమగు అంతర్జ్ఞానము కలవారై యుండిరి. ఈ విధముగా దక్షిణదేశము నుండి ఏతెంచినట్టి ఈ పొట్టి

యైన గట్టి సాధకుని ఆధ్యాత్మికస్థాయిని గమనించినవారై శ్రీవారు వెంటనే శ్రీ దేవానందస్వాములవారిని తమ ఆధ్యాత్మిక వ్యూహమునందు ప్రవేశించుట కనుజ్ఞ నొసంగిరి శ్రీవారు ఈ పిన్నవయస్సు నందున్న ముముక్షువును కర్మయోగ సేవా కార్యమునందు శిక్షణ యొసంగుటద్వారా నూతన ఆశ్రమ జీవితమునందేతెంచు కఠినత్వ ములను సహించుట, సర్దుకొనుట, సరిపుచ్చుకొనుట, సరిదిద్దుకొనుట యను పాఠము లను ప్రబోధించిరి. శ్రీ దేవానందస్వాములవారీ పరీక్షయందు నెగ్గినవారై పై భాగము నుండి పుస్తక ప్యాకెట్లను క్రిందనున్న గ్రంథ విక్రయశాలవరకు మోసికొని వచ్చుటను కూడా కాదనక కఠిన వ్రతనిష్ఠా గరిష్ఠులై ఆశ్రమ సేవను సంతోషస్వాం తులై యొనర్చిరి. దీనిని వారు ఒక కూలీపనిగా పరిగణింపలేదు. సరికదా విశ్వ కళ్యాణమునకై ఒక మహా పురుషుడొనర్చుచున్న లోక సంగ్రహ కార్యమునందు పాల్గొను సదవకాశము లభించినందుకు హృదయాహ్లాదము నొందిరి. వారి ఆధ్యాత్మిక సద్భావము, ఆశ్రమ జీవిత పరిజ్ఞానము మఱియు ఆధ్యాత్మిక క్రమశిక్షణయందుగల నిష్ఠ గట్టిదై యుండెను. ఇటువంటి సద్భావము, ఉన్నతాధ్యాత్మిక దృష్టికోణము మఱియు ఆశ్రమ కార్యక్రమములయందున్న శ్రద్ధ, విశ్వాసముల కారణముచే వారు ఒనదిన వికాసము నొంది, శ్రీ శివానంద గురుదేవుల ప్రత్యేక అనుగ్రహమును ఆర్జింపగలిగిరి. అనంతరము వారు పవిత్రగంగాతీరమునందున్న గురుదేవులవారి కుటీరం నందు గురుదేవుల వ్యక్తిగత సేవ చేయుటకై ఆజ్ఞాపింపబడిరి. ప్రత్యక్ష పరమాత్మ స్వరూపుడైన శ్రీ గురుదేవుల వారి వ్యక్తిగత సేవ కారణముచే అదృష్టశాలియైన శ్రీ దేవానందస్వాములవారి జీవిత వికాసము బంగారమునకు తావి అబ్బినట్లయ్యెను. శ్రీ దేవానందస్వాములవారు శ్రీ గురుదేవులవారి శక్తివంతమగు ముఖవర్చస్సుచే ఆకర్షింపబడుట సంభవించెను. ఈ యువకుడైన సాధకుని మాయ స్పృశింపజాలకుం డెను. ఒక విశ్వసనీయుడైన సాధకుడు, తితిక్షువు, త్యాగి, నిస్స్వార్థ విరక్తాత్మ మఱియు వేదాంతిగా పరిణమించినను వారు తమ నైజస్వభావమైన "భక్తి భావము"ను విడువక అంటిపట్టుకొని యుండిరి. శ్రీ గురుదేవులవారి నుండి సముద్భూతమైన వైరా గ్యాగ్నిచే శ్రీ దేవానందస్వాములవారొక నియమ నిష్ఠాగరిష్ఠుడైన సాధువు మఱియు యతిశ్రేష్ఠుడుగా పరిణమించిరి. ఇప్పుడు వీరు దివ్యజీవనము మఱియు ఆధ్యాత్మిక జీవనమునందు స్థిరప్రతిష్ఠితులై ప్రకాశింప దొడగిరి. ఇట్టి అదృష్టశాలియైన జీవాత్మ మరియు శ్రేష్ఠ సన్యాసియొక్క అరువదివత్సరములు లేక షష్ట్యబ్ధిపూర్తిజయంత్యు త్సవ సందర్భమునందు వారికి నా హృదయ పూర్వక అభినందలను, శుభాకాంక్షలను తెలుపుకొను సదవకాశము నాకు లభించినది.

---

ఆధునిక యుగమునందు తమ దివ్యకార్యమునకు ఒక ఉపకరణముగను మఱియు ప్రేరణ దాయకములగు ఆధ్యాత్మిక, నైతిక ప్రబోధములకు అపరజిహ్వాగను పూజ్యతములు మఱియు ప్రియతములైన శ్రీ స్వామి శివానందగురుదేవులు శ్రీ దేవానందస్వాముల వారిని పరిణమింప జేసిరి. శ్రీ దేవానందులు గురుదేవ్ శ్రీ శివానందుల వారికి శక్తివంతుడైన మఱియు ప్రేరణదాయకుడైన ఆధ్యాత్మిక సందేశ వాహకుడయ్యెను. భారతదేశములోని అగణ్యములగు దివ్యజీవన సంఘశాఖల యందొనర్చిన నిర్విరామమగు కృషిచే శ్రీ దేవానందులు భారతదేశమునందున్న అసంఖ్యాకభక్తులు, ధార్మికవర్తనులు మఱియు ఆధ్యాత్మికాసక్త చిత్తులగు ప్రజలందఱికి ప్రేమపాత్రులైరి. వారందఱు గురుదేవునివైపు, శ్రీ శివానందాశ్రమమువైపు శ్రీవారి ఆధ్యాత్మిక దివ్యజీవన సంస్థవైపు ఆకర్షింపబడి శ్రద్ధ మఱియు ఆసక్తి కలవారైరి. కొన్ని సమయములలో విశ్రాంతి మఱియు ఆహారమునుగూడా సరకుగొనక, శ్రీ దేవానందస్వాముల వారు విసుగులేకుండా ఒనర్చిన సేవయే దీనికంతటికి కారణమై యున్నది. ఈ విధముగా మనదేశమంతటికి అత్యావశ్యకమైయున్న గురుదేవులవారి దివ్యజీవన సందేశ ప్రచారమునకు యోగవేదాంతము గూర్చిన ఆచరణాత్మకమగు ప్రబోధ కార్యమునకు మరియు దివ్యజీవన సంస్థకు వారు అమూల్యమైన ఆస్తివంటివారై యున్నారు. సుదూరమునందును, ఉత్తర దిశయందును ఉన్న ఋషికేశ్‌కు ప్రజలందఱు ప్రయాణమొనర్పజాలరు, ఆంగ్లభాషా విరచితములగుటచే ప్రజలందఱు గురుదేవులవారి గ్రంథములను పఠింపజాలరు. ఆంగ్లభాషను పఠింపగలిగినను, ఆర్థిక పరిస్థితుల కారణముచే జనులందఱును వాటిని కొనజాలరు. పైతెలుపబడిన కారణములచే పారమార్థిక లాభమునుబడయుట కవకాశములేని విశ్వసనీయులైన భక్తులు మఱియు ఆధ్యాత్మిక జిజ్ఞాస గల ప్రజల గృహములకు వెళ్ళి భారతదేశమునందంతట పర్యటించుచు గురుసేవాభావముతో దివ్యజీవన సందేశములను మఱియు గురుదేవులవారి అనుష్ఠానాత్మకములగు పవిత్ర ప్రబోధములను ప్రజల కందించుచు ప్రచార మొనర్చుచున్న శ్రీ దేవానందస్వాములవారి ప్రాముఖ్యతను మఱియు అమూల్యమగు స్వభావమును మనమర్థమొనర్చుకొనవచ్చును. 1936 లో శ్రీ గురుదేవులవారు తమ ఆధ్యాత్మిక ప్రబోధము, యోగవేదాంత విజ్ఞానము మఱియు కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన, మార్గసూచనలను అత్యధిక ప్రజల కందించి ప్రచార మొనర్చుటకై స్థాపించిన దివ్యజీవనసంఘ

---

Be patient with others but impatient with yourself.

—*Swami Sivananda*

లక్ష్యములను మఱియు ఉద్దేశ్యములను నెఱవేర్చుటకై శ్రీ దేవానందులవారు ప్రతి సంవత్సర మొనర్చుచున్న పర్యటనలు ప్రముఖస్థానమును సముపార్జించుకొన్నవి. ప్రస్తుతము జరుగుచున్న శ్రీగురుదేవుల శతజయంత్యుత్సవ సందర్భమునందు శ్రీ దేవానందులు గావించుచున్న కార్యముయొక్క ప్రాముఖ్యతకూడా ఎన్నదగినదైయున్నది. నేడు శ్రీ దేవానందస్వాములవారు గురుదేవులవారికి ఆధ్యాత్మిక సందేశవాహకులై శ్రీవారి ప్రబోధములలో ప్రముఖస్థాన మాక్రమించుకొనిన "సేవించుము, ప్రేమించుము, ధ్యానించుము. సాక్షాత్కరించుకొనుము. మఱియు మంచివాడవగుము, మంచి పనులు చేయుము, దయగలిగియుండుము, కరుణాళువై యుండుము"నెడి ఆదేశములను ప్రజల ముందుంచుచు తమనిశ్చయాత్మకమైన నిర్విరామ కృషిచే అనేకవేల గురుబంధువులకు సుపరిచితులైరి.

గురుదేవులు సంస్థాపించిన శివానందాశ్రమముపై మఱియు శ్రీవారి సంస్థపై శ్రీ దేవానందస్వాముల వారికిగల దృఢవిశ్వాసము మరియొక ఎన్నదగిన సద్గుణమై యున్నది. ఆశ్రమము మఱియు దివ్యజీవన సంఘముయొక్క ప్రస్తుత యోగక్షేమము మఱియు భవిష్యద్వికాశము గూర్చి వారు మిక్కిలి అభిరుచిని మఱియు శ్రద్ధను చూపుచుందురు. ఈ సద్భావన కారణము చేతనే తన వ్యక్తిగత బాధలు మఱియు కష్టములను లెక్కచేయకుండా ఆయా సమయములలో ఆయా కార్యముల నొసంగినప్పుడు హృదయ పూర్వకముగా అంగీకరించి, ఏలాటి విసుగులేనివారై శ్రద్ధాభక్తులతో నిర్వహించుచుందురు. వారు తమ గురుసేవాకాలములో గురుదేవుల వారి "అనుసరించుము, సర్దుకొనుము, సరిపుచ్చుకొనుము" అనెడి సూత్రముల నభ్యసించిరి మఱియు "అవమానమును సహించుము" అను సాధన నసుష్ఠించిరి. ఆయా కార్యరంగములలో వారు ఒక క్రమపద్ధతిని మరియు సక్రమ విధానమును పాటించుట కిష్టపడుదురు. కావున వారు తమ కర్తవ్య నిర్వహణ యందు క్రమశిక్షణను, క్రమపద్ధతిని, సక్రమ విధానమును విజయవంతముగా చొప్పించగలిగిరి.

శ్రీ దేవానందులవారు బాలుర యందణగి యుండు ఆధ్యాత్మిక సంస్కారములను విశ్వసించినవారై, పిన్నవయస్సునందే వారికి ఆధ్యాత్మిక మార్గము మరియు సదాచారముల నుపదేశించి ప్రోత్సహించుటలో మిక్కిలి శ్రద్ధను చూపుదురు. కావున బాలురకొఱకై వారు ప్రత్యేక సాప్తాహిక సత్సంగమును నిర్వహించుచుందురు. ఈ

---

A sage's look is spiritual fire that burns the impurities.
—*Swami Sivananda*

విధముగా "భవిష్య భారతి"గా పరిణమించనున్న "బాలభారతి" యందు వారు సత్సం స్కారములను మరియు శుభవాసనలను చొప్పింతురు. శ్రీ దేవానంద స్వాములవారు శివానందాశ్రమమునందున్నప్పుడెల్ల గురుదేవుల వారి సమాధి మందిర సాన్నిధ్యము నందు ప్రతి నిత్యము ప్రాతఃకాలమునందు విజయవంతముగా విఫలత ఎఱుగని ధ్యాన - ప్రార్థనా తరగతులను నిర్వహించు చుందురు. కొన్ని సంవత్సరముల క్రితము నావిన్నపము నాలకించి వారీ బ్రహ్మముహూర్త ధ్యాన తరగతులను నిర్వహించుటకు మాట ఇచ్చి, తదను సారముగా క్రమము తప్పక సత్యసంధులై నడుపుచున్నారు. ఇది నిశ్చయముగా స్తుతిపాత్రమైన విషయము వారి ఈ యద్భుతమైన సహకారము మరియు సహయోగమునకు నేనెంతయో కృతజ్ఞుడనై యున్నాను.

శ్రీ గురుదేవుల నిర్యాణానంతరము దివ్యజీవన సంఘశాఖలు మరియు గురు దేవుల వారి భక్తుల ఆవశ్యకమగు అభ్యర్థన ననుసరించి ఆధ్యాత్మిక సందేశ ప్రచార మనెడి సుడిగుండములో నేను త్రోయబడితిని. గురుదేవులవారు మహాసమాధి నొందిన సంవత్సరమే న్యూఢిల్లీ దివ్యజీవన సంఘశాఖకు అధ్యక్షులైయున్న సుప్రీం కోర్టు జడ్జిగారైన శ్రీ **R. D.** మధోల్కర్ అభ్యర్థనపై స్వామి శివానంద కల్చరల్ అసోసి యేషన్‌నందు భారతదేశమునకు ఆ కాలములో రాష్ట్రపతియైయున్న డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి ఆధ్వర్యములో నిర్వహింపబడిన సభలో నేను పాల్గొనవలసి వచ్చెను. ఇట్టి క్లిష్ట పరిస్థితిలో 1964 నుండి (30 సంవత్సరములకు పైగా) ఈ యాధ్యాత్మిక జాగృతియనెడి సేవాకార్యమునందు శ్రీ దేవానందస్వాములవారు నాకెంతయో భార మును తగ్గించి సహాయమొనర్చిరి. భారతదేశమునందంతటను ముఖ్యముగా ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక ప్రాంతములయందున్న దివ్యజీవనసంఘ శాఖల అభ్యర్థనను పురస్కరించుకొని శ్రీ దేవానందస్వాములవారు పర్యటించుచు, దివ్యజీవన సందేశ ప్రచార కార్యమును తగు సామర్థ్యముతో నిర్వహించుచున్నారు. ఈ రాష్ట్రములలో గురుదేవులవారి ప్రబోధమును మరియు దివ్యజీవన ఆధ్యాత్మిక సందేశమును వేలాది ప్రజలకు వితరణ చేయుటలో శ్రీ దేవానందస్వాములవారు కడుంగడు పరిశ్రమ యొనర్చిరి. ఇంతే కాకుండా బొంబాయి, కలకత్తా, రాయపూర్ మున్నగు పట్టణముల లోని దివ్యజీవన సంఘశాఖలలో వారొక సుప్రసిద్ధ మహాత్ములుగా పరిగణింప బడు చున్నారు. వారిద్వారా అనేకములగు దివ్యజీవనసంఘశాఖలు నూతనముగా ప్రారంభింప

---

The ghost of mind dances in the theatre of the world to the tune of sense organs.

—*Swami Sivananda*

బడెను. శ్రీ దేవానందస్వాములవారి వ్యక్తిగత ప్రయత్నముచే తెలుగు భాషయందు ప్రచురింపబడిన గురుదేవులవారి గ్రంథములు గొప్ప ఉరవడితో స్వీకరింపబడుచున్నవి.

పై తెలుపబడిన కార్యములను సాధించుటతోపాటు వారెల్లప్పుడొక నిస్సంగులైన సన్యాసిగా శేషించి యుండుట కిచ్ఛగింతురు. వారు తపశ్చర్య వ్రతావలంబులు, వాంఛారహితులు మరియు సరళస్వభావులై సాధుజీవనమును గడుపుచుందురు. ఖాదీ గుడ్డయగు సామాన్యమైన ధోవతి మరియు పైన కప్పుకొనుట కొక పెద్ద తువ్వాలయే వారి వస్త్రధారణావిధానమైయున్నది "తీవ్రముముక్షత్వము" మరియు "మహాపురుషసంశ్రయము"నెడి సద్గుణములచే వారెల్లప్పుడు శోభించుచుందురు. చిన్నవయస్సునందే తపోధనులు మరియు సన్యాసులతో వారికిగల సంసర్గమనెడి సౌభాగ్యముచే శ్రీ దేవానంద స్వాములవారికి త్యాగము, వైరాగ్యము, తితిక్ష, తపస్సు అనెడి సద్గుణములలవడినవి. నిజమైన ఆధ్యాత్మిక వ్యక్తికి సరళత్వము, మౌనము, ఏకాంతవాసము, ఐహిక విషయములయందనాసక్తి యనునవి గీటురాళ్ళ వంటివి. వీటన్నింటిని శ్రీ దేవానంద స్వాములవారి దైనిక జీవితమునందు మనము గాంచగలుగుదుము. కావున వారు శ్రీ శివానందాశ్రమమునందొక గౌరవనీయులైన సన్న్యాసియై యున్నారు. వారి దయగల స్వభావము, ఆగంతుకులగు భక్తులకొనర్చు సహాయ సంపత్తులు మరియు ప్రేమ కరుణలచే గురుదేవులు మరియు దివ్యజీవన సంఘముయొక్క కీర్తిప్రతిష్ఠలు ఇనుమడించినవనుట నిస్సందేహము. వారు తమ భావోద్రేకములగు భక్తి సంకీర్తనలచే వేలాది ప్రజలను భావావేశ పరవశులుగా నొనర్చిరి. గురుదేవులవారి ఆశ్రమములోని వివిధ కార్యరంగములలో వారు నిత్యసంసిద్ధులై అమూల్యములగు సేవా సహకారముల నొనర్చిరి.

1985-86 లో దివ్యజీవన సంఘ ప్రధాన కార్యాలయముద్వారా ప్రారంభింపబడిన ఇతః పూర్వము చేపట్టని అఖిలభారత శతజయంతి ప్రచార యాత్రయందు నాయకత్వము వహించి శ్రీ దేవానంద స్వాములవారు నిర్వహించిన పాత్ర అనన్య సామాన్యము.

షష్ట్యబ్ది పూర్తి జయంతి ప్రత్యేక సంచికకై ఈ వాక్యములను వ్రాయుటద్వారా వారిపై నాకుగల సద్భావమును మరియు కృతజ్ఞతను తెలుపుకొనగలుగుచున్నందుకు నాకెంతయో ముదావహముగా నున్నది. నేను వారి దీర్ఘజీవనము, ఆయురారోగ్యము, విజయము మరియు పరమేశ్వరానుగ్రహము కొఱకై ప్రార్థించుచున్నాను.

శ్రీ

శ్రీశ్రీ స్వామీ సర్వేశ్వరానంద స్వాములవారు
సర్వేస్వర సదనమ్,
బొమ్మక్కపల్లి - 515 867,
రాయదుర్గం తాలూకా. (అనంతపురం జిల్లా.)

తేది 24-10-96

ఆయుష్మాన్ భవ—

పరమపూజ్య శ్రీ శ్రీ శ్రీ స్వామీజీ—

తమరు దేవానందులు - దేవానందము - మానుషానందములకన్నా గంధర్వానందములకన్నా, చాలా గొప్పది. అట్టి ఆనందము-తాము నిరతము అనుభవిస్తూ - ఆశ్రితులకు ఆ ఆనందమును పంచుతూ - శతాధికవర్షములు భారతావనియందు శ్రేయఃకాములై-యశోవిరాజితులరై-ఆయుష్మంతులరై వర్ధిల్లాలని - జగన్మాతను ప్రార్థించుచున్నాడను.

తమగుణగణములు చాలా గొప్పవి-

విద్యావినయసంపదగల విజ్ఞమూర్తివి-

పాలజ్ఞుడవు, మీదు మిక్కిలి గురుకృపా పాత్రుడవు-

ఇట్టి మీ సాంగత్యము మా జీవితమునకు క్రొత్త శోభను ప్రసాదించుతూ ఉంటుంది. తమ షష్ట్యబ్ధిపూర్తి ఉత్సవ వేడుకలు యావద్భారతావనియందు ఉజ్జ్వలమై సాగుగాత-

శ్రీ గురుదేవులదయ నిండు వజ్రకవచంగా మీ శరీరమనః ప్రాణములకు రక్షగా నిలుచుగాత-

---

Go beyond all that causes duality. —*Swami Sivananda*

ఓం

# అనంతమగు వారి కార్యదీక్ష ప్రశంసనీయము

శ్రీ బాబా బ్రహ్మచారిణిగారు
శ్రీ నిత్యానందాశ్రమము,
రేవెళ్ళపాలెము, శ్రీకాకుళంజిల్లా.

శ్రీ దేవానంద స్వాములవారు ఉత్తమ సంస్కారములుగల కుటుంబములో జన్మించినారు. సద్గురు వర్యులగు పూజ్యశ్రీ నిత్యానంద భారతీ స్వాములవారి పూర్వాశ్రమ సోదరులగు శ్రీ బ్రహ్మానంద భారతీ స్వాములవారిచే ఆకర్షింపబడిన శ్రీ దేవానంద చిన్నస్వామి అతి పిన్న వయస్సులో గృహ పరిత్యాగము గావించి సన్న్యసించినారు. దీక్షా గురువులగు శ్రీ బ్రహ్మానంద భారతీస్వాములవారి వద్ద కొంతకాలము సేవజేసిన అనంతరం శ్రీ శివానంద స్వాములవారి ప్రబోధములచే ప్రభావితులై, మాతృభాష తప్ప మరే ఇతర భాషలు తెలియకపోయినను ధైర్యోత్సాహములతో ఋషీకేశ్ చేరి జగద్గురు శ్రీ శివానంద స్వాములవారి పదసన్నిధిలో ప్రవేశించి విసుగును. విరామమును ఎరుగని సేవల ద్వారా శ్రీ శివానంద స్వాములవారి అపార కృపకు పాత్రులైనారు దివ్యాత్ములై విలసిల్లినారు. ధన్యతను సముపార్జించుకొనినారు.

ప్రతి సంవత్సరము వీరు ఆంధ్రలో విధిగా పర్యటించుచూ శ్రీ శివానంద సందేశములను పండిత, పామరులకు అందించుచుందురు. మా ఆశ్రమమునకే గాక తదితర ఆశ్రమములను, దివ్యజీవన సంఘశాఖలను, భక్త బృందములను దర్శించుచూ దివ్యజీవన సందేశ ప్రబోధములను వ్యాప్తి చేయుచుందురు.

వారియొక్క సదాచారము, సత్ప్రవర్తన, నియమనిష్ఠలు, ప్రబోధ ప్రచారములు. స్తుతి పాత్రములు. అనంతమగు వారి కార్యదీక్ష ప్రశంసనీయము. మనమెల్లరము వారి ఆశయపూరిత సువిశాల భావ సంపుటిని గుర్తించి, గ్రహించి మన ఆచరణయందుంచు కొనుటయే మన కర్తవ్యము.

గురుదేవులు వారికి ఆయురారోగ్యములను ప్రసాదించి వారిద్వారా అనంతమగు ఆధ్యాత్మిక విద్యా ప్రచారమును విరివిగా జరుగునట్లు అనుగ్రహించి ఆశీర్వదింతురు గాక!

---

Be patient with others but impatient with yourself.
—*Swami Sivananda*



# శ్రీ చిన్నస్వామిగారు నియమ నిష్ఠాగరిష్ఠులు

శ్రీ హంసానంద స్వామీజీ మహరాజ్
శివానందాశ్రమము, ఋషికేశ్.



1965 ఆగష్టు నెలాఖరులో ప్రప్రథమంగా నేను పూజ్యశ్రీ దేవానంద-చిన్న స్వామిగారిని శివానందాశ్రమములోని గురుదేవ్ కుటీరమునందు సందర్శించితిని. నాకు వారు నిజమైన సాధకునివలెను, వాస్తవమైన జిజ్ఞాసువువలెను, యదార్థమైన ముముక్షువు వలెను, నియమనిష్ఠలుగల సన్న్యాసివలెను గోచరించిరి. గంగా హిమాలయములను దర్శించి వెంటనే తిరిగి వెళ్ళదలచిన నేను శ్రీ దేవానంద స్వాములవారి అనుగ్రహము వలన శివానందాశ్రమమున స్థిరపడి శ్రీ గురుదేవులవారి కుటీరమునందే నివసించు భాగ్యమును పొందగల్గితిని.

శ్రీ దేవానంద స్వాములవారు దృఢకాయులు, దృఢగాత్రులు మరియు దృఢ సంకల్పులు. వారి నియమనిష్ఠలు, ఆహార నియమములు, సమయపాలన ఆదర్శవంత ములు. ఉదయము పాలు, మధ్యాహ్నము అతి స్వల్పముగా ఉప్పు-కారము ఉపయో గించినటి సాత్త్వికాహారము, రాత్రికి పండ్లు, పాలు. వారు ఎట్టి పరిస్థితులలో కూడా కాఫీ - టీలను సేవించరు ఏకాదశీ వ్రతమును, శివరాత్రి, శ్రీకృష్ణ జన్మాష్ట మొదలగు పర్వదిన వ్రతములను ఖచ్చితముగా నియమబద్ధముగా ఆచరించుచుందురు. కఠినమైన ఆహార నియమములచేతనే వారు మనోనిగ్రహమును సాధించగల్గినారు.

శ్రీ చిన్నస్వామిగారి గాత్రము అతి గంభీరము. వారి సంకీర్తన మధురము, వారి సంభాషణలు మృదుమధురములు. వారి సంకీర్తనలలో ఒకపరి పాల్గొనినవారు మరల మరల పాల్గొనుటకు ప్రయత్నించుచుందురు. అనుదినము సాయంకాలము గురు దేవ్ కుటీరమునందు 6-00 గంటల నుండి 7-00 గంటల వరకు జరుపబడుచుండు సంకీర్తనయందు పాల్గొన్న భక్తులు తన్మయత్వమును పొందుచుందురు. చిన్నచిన్న పిల్లలుకూడా ఈ సమయంలో భక్తిశ్రద్ధలతో పాల్గొనుచుండుట ప్రశంసనీయము. అది వారి భావి జీవితములకు చక్కటి పునాది కాగలదు.

---

Have a burning thirst for God-realization. —*Swami Sivananda*

1981లో సద్గురు శ్రీ శివానంద స్వాములవారి ఆంగ్ల గ్రంథములను ఆంధ్రీకరించి ఆంగ్లభాషతో పరిచయములేని ఆంధ్ర ప్రజలకు శ్రీవారి దివ్య సందేశములను అందించుటకై శ్రీ చిన్నస్వామిగారు సంకల్పించి తాము స్వయముగా కొన్నిటిని అనువదించి, మాబోటివారిచే మరికొన్నింటిని అనువాదమును చేయించి శ్రీ శివానంద శత జయంతీ మాలలో నూట ఎనిమిది జ్ఞాన పుష్పములను (శివానంద గ్రంథములను) ప్రచురించి, ముముక్షువులకందించి అందరి మన్ననలందుకొనిరి. వీటికి పూర్వమే వారు ఆధ్యాత్మిక ప్రబోధము, భగవత్ప్రీతికరములైన అష్టవిధ పుష్పములు. ధ్యాన సాధనల వంటి గ్రంథములను స్వయముగా రచియించి సాధకులకు ఆధ్యాత్మిక సామగ్రిని అందించి అందరికీ ఆదర్శప్రాయులైరి.

శ్రీ చిన్నస్వాములవారు ప్రతి సంవత్సరం విజయదశమి రోజున బయలుదేరి భారతదేశమున వివిధ రాష్ట్రములలో పర్యటించుచూ శ్రీ గురుదేవుల సందేశ వ్యాప్తికి అపార కృషిని సల్పి ఉగాది పండుగ దాటిన తర్వాత తిరిగి శివానందాశ్రమము చేరుకొనుచుందురు. వారు సందర్శించిన ప్రతి రాష్ట్రములోను ఉన్నత పాఠశాలలను, కళాశాలలను దర్శించుచూ గురుదేవుల సమగ్ర బోధను సంక్షిప్తముగ అందించు "గాడ్ ఈజ్ ట్రూత్ గోవిందా ! గాడ్ ఈజ్ బ్లిస్ గోవిందా॥"(**God is truth Govinda- God is bliss Govinda**)అను ఆంగ్ల గీతమును అతి శ్రావ్యముగా గానము చేసి విద్యార్థుల హృదయములకే గాక అధ్యాపకుల హృదయములకు, ప్రాధ్యాపకుల హృదయములకు చక్కటి ప్రబోధమును అందించుచుందురు.

1985 విజయదశమి నుండి 1986 జూన్ 15వ తేదీ వరకు శ్రీ శివానంద శత జయన్తి ప్రచారయాత్రా సంఘమునకు నాయకునిగా ఆశ్రమ కార్యవర్గము వారిచే శ్రీ దేవానంద - చిన్నస్వామిగారు నియమితులై శ్రీ శివానంద స్వాములవారి అమర సందేశ బీజములను దేశమున నలుదిశలలో మూల మూలల యందు వెదజల్లి ముముక్షు జనులయొక్క క్షుత్పిపాసలను తీర్చుటకై భారతదేశమును సస్యశ్యామల మొనర్చిరి.

శ్రీ శివానంద శతజయన్తి ప్రచారయాత్ర విజయవంతముగా ముగించుకొని తిరిగివచ్చిన యనంతరము 1986 జూన్ 1వ తేదీన దివ్యజీవన సంఘ ప్రధాన కార్యదర్శిగారగు పూజ్యపాద శ్రీ కృష్ణానంద స్వాములవారిని దర్శించుటకు వెళ్ళిన శ్రీ దేవానంద స్వాములవారిని అభినందించుచూ "యువర్ టూర్ విల్ బి రిటెన్ ఇన్ గోల్డెన్

లెటర్స్ ఇన్ ది హిస్టరీ ఆఫ్ డివైన్ లైఫ్ సొసైటీ" (**Your tour will be written in golden letters in the History of Divine Life Society**) అని పలికిరి.

1968 నుండి వరుసగా మూడు సంవత్సరములు శ్రీ చిదానంద స్వాములవారు విదేశములలో పర్యటించుచుండినపుడు మన దేశమునందు శ్రీ దేవానంద స్వాములవారు వివిధ ప్రదేశములలో పర్యటించుచూ తన సహజ సంకీర్తనలకు తోడుగా ధ్యానాభ్యాసములను గూర్చియు, భక్తి ప్రపత్తులను గూర్చియు, జ్ఞాన సాధనలను గూర్చియు ప్రవచనములను గావించుచూ, సాధనా సప్తాహములయందును, అఖిలభారత దివ్యజీవన సభలయందును, ఆంధ్రప్రదేశ్ దివ్యజీవన సభలయందును, అఖిలాంధ్ర సాధుపరిషత్ వార్షికోత్సవ సభలయందును ఉపన్యాసములు గావించి ఆ కాలములో శ్రీ చిదానంద స్వాములవారు భారతదేశములో లేని లోటు తీర్చిరి. ఈ విషయమును స్వయముగా పరమపూజ్య శ్రీ చిదానంద స్వాములవారే ఒక సమావేశమున నుడువుచుండగా నేను స్వయముగా శ్రవణముచేసి పరమానందభరితుడనైతిని.

శ్రీ చిన్నస్వాములవారి అనుచర బృందములు, భక్త సంఘములు ఆంధ్రలో విరివిగా ఉన్నవి. వాటిలో మరువాడ కొత్తవలస - సిరిపూర్ కాగజ్‌నగర్ - బిట్రగుంట మొదలగునవి ప్రసిద్ధములు. శ్రీ దేవానంద స్వాములవారి యెడల వారికిగల భక్తి ప్రపత్తులు అనుపమానములు.

శ్రీ చిన్నస్వామిగారు ఇప్పుడు వైభవోపేతముగా జరుపుకొనుచున్న షష్ట్యబ్ది పూర్తి మహోత్సవము వలెనే శతాభిషేక మహోత్సవమును మరియు శతజయన్తి మహోత్సవమును మహద్వైభవముగ జరుపుకొని సాధకులకు సముచితమైన ఆదర్శవంతమగు ఆధ్యాత్మిక మార్గమును నిర్దేశింతురుగాక !

గురుదేవుడు శ్రీ చిన్నస్వామిగారికి పరిపూర్ణమగు ఆయుర్దాయమును, అపారమగు మేధా సంపత్తిని అసాధారణమగు తపస్సంపదను సమకూర్తురు గాక !

ఓం తత్సత్

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

---

Renounce all your belongings and surrender yourself unto God.

—*Swami Sivananda*



# జయీభవ ! విజయీభవ !! దిగ్విజయీభవ !!!

శ్రీ స్వామి అసంగానంద సరస్వతి
గురునివాస్, శివానందనగర్, ఋషీకేశ్,

త్రిమూర్తుల దివ్యానుగ్రహంతో అనసూయ-అత్రిమహర్షి దంపతులకు దివ్యత్వంతో దత్తాత్రేయుడు జన్మించినాడు. సింహాచలమ్మ-రామస్వామి దంపతులకు జన్మించిన దేవానందజీ (చిన్నప్పటి పేరు సన్యాసయ్య) ముగ్గురు గురువుల అనుగ్రహానికి, ఆశీర్వాదాలకు పాత్రుడై దివ్యత్వాన్ని సంతరించుకున్నాడు.

మొదటి గురువగు (దీక్షాగురువగు) శ్రీ బ్రహ్మానంద స్వాములవారి బోధల నుంచి మానవ జీవితానికి మంచినితెచ్చే "సత్యం వద - ధర్మం చర" అనబడే వేద వాక్కులను రెండింటినీ గ్రహించినాడు. రెండవ గురువగు (ఆదర్శ గురువగు) సద్గురు మహర్షి శ్రీ మలయాళ స్వాములవారి బోధలనుంచి జీవిత వికాసానికి మరింత వన్నెను తెచ్చే "సత్యం - శాన్తం - దయ" అనబడే త్రిసూత్రాలను సంపాదించుకున్నారు. మూడవ గురువగు (శిక్షాగురువగు) జగద్గురు శ్రీ శివానంద స్వాములవారి నుంచి సర్వ్-లవ్-గివ్-మెడిటేట్ - రియలైజ్ (Serve - Love - Give - Meditate - Realize) అనబడే పంచ సూక్తులను (పాణాహుతులను) స్వీకరించినారు. రెండూ + మూడు + ఐదు = మొత్తం పది సూక్తులను పదిలంగా తన హృదయంలో దాచుకున్నారు. శ్రద్ధాభక్తులతో మననం చేసినారు. నిత్యజీవితంలో అమల్లో పెట్టినారు దివ్యత్వాన్ని సాధించుకున్నారు.

ఉపనిషత్తులలో ఉత్తమమైనవి ప్రముఖమైనవి పది ఉపనిషత్తులని (దశోపనిషత్తులు) వేదాన్తులఆదేశం. బైబిల్‌లో ప్రధానమైన ఆదేశాలు పది (TEN COMMENDMENTS టెన్ కమెండ్‌మెంట్స్) అని క్రైస్తవ సోదరులు అంటూ ఉంటారు.

అన్యలోహాలతో మిశ్రితమైన సువర్ణము తేజాపుతో శుద్ధి చేసినపుడు నిర్మాల్య రహితమై, అకళంకమై, స్వచ్ఛమైన అపరంజిగా శోభిల్లినట్లు ఆ ముగ్గురు గురువుల నుండి (గురువు, సద్గురువు - జగద్గురువుల నుండి) తాను పొందిన ఆ పది దివ్యోపదేశాలు ఆచరణలో పెట్టడంతో వారకు సౌరభమచ్చిన రీతిగా శ్రీ దేవానంద స్వామి

---

Entertain Akarta and Sakshi Bhav. —*Swami Sivananda*

గారి జీవితాన్ని సుగంధభరితం చేసింది. వారు శ్రమించి సముపార్జించుకొనిన అమూల్యమైన ఆధ్యాత్మిక సంపదను బీదసాధకులకు (ఆరంభ దశలో మొగ్గలవలె ఉండిన ప్రాథమిక సాధకులకు) పంచిపెడుతూ వారిలో జ్ఞాన పిపాసను రేకెత్తించి ధ్యానాధ్యయన అర్చన జపాద్యనుష్ఠానాలలో వారిని ప్రవేశపెడుతూ - ఆ సాధకుల మానసిక వికాసానికి, బుద్ధి వికాసానికి నిరంతరం కృషిచేస్తూ - తమ కృషిలో విజయాన్ని సాధిస్తూ ఉన్నారు

స్నేహ సౌజన్యమూర్తిగా, అవసరాలకు ఆదుకొనే ఆప్తబంధువుగా, గురువుగా, మిత్రునిగా, అనుచరునిగా, సహచరునిగా, సేవకునిగా యథోచితంగా వ్యవహరిస్తూ సహోత్సాహంతో గురుదేవుల సందేశాన్ని నలువైపులా పంచిపెడుతూ ఉండే ఆ నిరాడంబరమూర్తి నిజంగా ధన్యుడు. చరితార్థుడు ఆయన గుణగణాలను, సౌజన్య-సౌశీల్య సంపదలను సమగ్రంగా వర్ణించాలంటే అది సాధ్యమయ్యే పనికాదు. సంక్షిప్తంగా చెప్పాలంటే ఛందోబద్ధంగా ఇలా చెప్పవచ్చునని కవి అంటాడు :-

గరువంబా దరిరాదు మాటవెడలన్ కాఠిన్యమేలేదు. ఓ
గిరమా జిహ్వకు బుద్ధిసెప్పు వలువల్ కిమ్మత్తువాకావు మై
మరపా స్వప్నమునందునున్ గనడు సామాన్యుండుగాడారదే
వరలున్ విచ్చలు భాగ్యశాలియన దేవానంద మ్ముమ్మాటికిన్

ఐదారు మాటల్లో వర్ణించే ఈ వర్ణన శ్రీ దేవానంద స్వాములవారి సమగ్ర స్వరూపాన్ని అందించలేవు అందుకనే గురుదేవుడు ఒకేఒక వాక్యంలో, ఎంతగా వర్ణించినా తనివి దీరని వాక్యంలో ఇలా అన్నారు :-

## "మా దేవానంద బంగారు బిడ్డ"

ప్రపంచంలో ఉండే శ్రేష్టమయిన వస్తు సముదాయంలో బంగారము శ్రేష్టతమమైంది. దాని ఆధిక్యతను వర్ణించటానికి మాటలులేవు ఉన్న మాటలు చాలవు. శ్రేష్టతమమైన బంగారముతో ఏ వస్తువు చేయబడినా అది శిరోధార్యమే, ధన్యుడవయ్యా దేవానందా ! నీ జీవితం ధన్యతరమైంది. నీ కృషి ధన్యతమమైంది.

మీకు మీ అభిమానబృందము ద్వారా జరుపబడుతూ ఉండే ఈ షష్ట్యబ్ధిపూర్తి మహోత్సవాన్ని ఆనందంతో తిలకిస్తూ - మీరు గావిస్తూ ఉండే ప్రచార ప్రబోధాలకు తమ తమ హర్షామోదాలను వ్యక్తంచేస్తూ మీ ముగ్గురు గురువులు అనుగ్రహంతో ఆశీర్వదిస్తూ ఉంటారు. ముకుళిత హస్తాలతో నతమస్తకుడవై స్వీకరించు స్వామీ !

జయీభవ ! విజయీభవ !! దిగ్విజయీభవ !!!



# వారిబోధ నాలో త్వరితగతి సత్ప్రవర్తన కల్గించినది

స్వామి శ్రీనివాసానంద



నేను 1960 నుండి కంట్రాక్టర్‌ను. నేను చేయని చెడ్డపని అంటూ లేదు. ఐనను దైవభక్తిని కలిగియుండెడివాడను. గుడికి వెళ్ళి మహాను భావుల హరికథలను, ప్రవచనములను వినెడివాడను. నేను బాధ గురువు లను, బోధగురువులను ఎందరినో చూచినాను. వారి ప్రవర్తన నాకు నచ్చ లేదు. 1976లో మొట్టమొదటిసారిగా శ్రీ శ్రీ శ్రీ దేవానందస్వామిగారు మా ఊరు వచ్చినారు. గుడిలో ప్రవచనము చెప్పినారు. ప్రవచనమంతయు హిందీలోనేచెప్పి. ఆ తర్వాత గుడిముందుకువచ్చి ఎవరితోనో తెలుగులో మాట్లాడసాగిరి. నేను కోపముతో వారితో ఇట్లంటిని. "అయ్యా! తమరు తెలుగుగడ్డపై జన్మించి, హిందీలో ప్రవచనము చెప్పితిరేల ? యని గట్టిగా మాట్లాడితిని. శ్రోతలకోరికపై హిందీలో చెప్పవలసివచ్చినదని బహుశాంత ముగా, చిరునవ్వుతో జవాబుచెప్పిరి.

రెండవసారి 1979లో శ్రీ చిదానంద స్వాములవారు, శ్రీ దేవానంద స్వాములవారు ఇద్దఱు కలిసి వచ్చి 3 రోజులు చాల పెద్దఎత్తున ప్రవచ నము చేసిరి. ఐనను మంత్రదీక్షకు నా మనస్సు ఒప్పుకొనలేదు. కాని శ్రీ దేవానందస్వాములవారిని చూచినది మొదలు నా మనస్సులో ఒక విధ మైన ఆనంద ముదయించెను. తుదకు ఋషీకేశ్ వెళ్ళినప్పుడు 23-9-1982వ తేదీన వారివద్ద సతీపతులిద్దరము మంత్రదీక్షను తీసుకొంటిమి. అనంతరము మాలో త్వరత్వరగ ఎన్నియో మార్పులు వచ్చెను. నాలోనున్న చెడుగుణా లెన్నో పోయినవి. నేను నా గత జీవితమును గుర్తుకు తెచ్చుకొని అస

హ్యించుకొంటిని. నేను మంత్రదీక్ష తీసుకున్న తర్వాత ఇక్కడి ప్రజలు నన్ను హేళన చేయసాగిరి. అట్టివారే ఇప్పుడు నన్ను మిక్కిలి ఆదరించు చున్నారు. నాలో అంతటి సత్ప్రవర్తన కల్గుటకు మద్గురువరేణ్యులగు శ్రీ దేవానంద స్వాములవారి దివ్యానుగ్రహమే కారణము.

శ్రీ దేవానంద స్వాములవారి సుగుణములను వర్ణించుటకు అసాధ్యము. ఇంతకుముందు నాకు కవిత్వమంటే తెలియదు. ప్రస్తుతము మా గురువుగారిపై 130 పేజీల స్తోత్రమంజరి, ఒక చిన్న బుఱ్ఱకథ వ్రాసి ముద్రించగలిగితిని. నాకు ఆరుగురు కూతుర్లు, ఒక కుమారుడు, ఏడుగురు మనుమలు. అయిదుగురు మనుమరాండ్రు ఉన్నారు. మా కుటుంబసభ్యులందరూ శ్రీ దేవానంద స్వాములవారిని దేవునిలాగా చూస్తారు పెద్ద కుటుంబమైనా ఏలాటి చీకుచింతలులేవు. అంతా గురుదేవుని దయ. మా భార్యాభర్తల మనస్సులలో వేరే ఎంతపెద్దగురువుగారికైనా స్థానములేదు. మనోవాక్కాయ కర్మములచే మేము మా గురువుగారగు శ్రీ దేవానంద స్వాములవారియెడల అచంచలమగు భక్తివిశ్వాసములను కల్గియున్నాము. వారి దయవల్లనే ఇంతటి మార్పువచ్చింది. నేను కీర్తన చేస్తుంటే గంతులువేస్తాను. కాని నాకు ఏలాటి ఆయాసము కలుగదు. అంతా గురుదేవుని దయ. నేను ముందు "ఓం నమో భగవతే శ్రీ దేవానందాయా" రాసిన తరువాత వ్రాత ప్రారంభించెదను.

శ్రీ స్వాములవారు నిరాడంబరజీవి. ఆయన పాదస్పర్శయే నన్ను ఈ విధముగా మార్చినదని నా గట్టి నమ్మకము.



Never be attached to anything or anybody.

—*Swami Sivananda*



**Dr. M. K. GOEL** (PADMA SHRI)
M.S. (SURGERY), M. S. (ORTH), F.A.C.S., F.I.C.S., F.A.M.S.
**B-2/2, River Bank Colony**
**Lucknow-226 018**

Date. 14-2-97

Revered SRI DEVANANDAJI

Prostrations and Salutations

Our heartiest Felicitations and Salutations on the Auspicious occasion of your Diamond Jubilee Celebrations. May God grant you long life, Prosperity and Happiness. Parama Gurudev's Blessings and his Supreme Grace is always on you.

I remember very well how you have served him well with great dedication and devotion and still living on his ideals and teachings.

I have seen in you a true disciple.

With great regards
Yours in Gurudev's Service
**Dr. M. K. GOEL**

---

Great events arise out of small beginnings.
—*Swami Sivananda*



*Dr. Prasanna Kumar Padhy,* M.D.
Asst. Professor of Medicine
MKCG Medical College,
BERHAMPUR.

Residence :
Park Street,
BERHAMPUR-760 002
(Ganjam)

**Date 21-11-96**

*I always feel your Blessings with me and your letters always a source of inspiration for me. Whenever in trouble, I feel your un seen hands and God is helping me to overcome the trouble. My son and daughter are doing well due to your blessings.*

*My heartiest felicitations on the auspicious occasion of your Diamond Jubilee Celebration.*

*May God bestow on you long life and sound health.*

*Yours sincerly*

**P. K. PADHY**

---

Replace self-consciousness by God-consciousness through the attainment of wisdom.

—*Swami Sivananda*



Pujya Swamiji Maharaj,

Om Namo Narayanaya
Pranams and regards

I am very happy to know that H. H. Swami Devananda Swamiji Maharaj's Diamond Jubilee is going to be celebrated in a befitting manner. Poojya Swamiji Maharaj is a source of great inspiration to all of us. Whenever, he visits Bhilai Nagar (Steel City), he some how manages to find time to accept our invitation and spend a few minutes in Prayer and Bhajan at our humble home. he has sanctified our house with his holy feet. Poojya Swamiji Maharaj is a real tyagi, a true sanyasi and a great devotee of God and Guru.

When my daughter's marriage was delayed and we approached swamiji maharaj to bless the girl,Swamiji kindly gave mantra - initiation and as a result of Swamiji's blessings, she got married and is leading a happy married life. When my son apprised Swamiji of the happy event of my daughter's marriage, Swamiji with his child like simplicity, asked him 'where are the marriage sweets.'

Swamiji never refuses any request, he never complains of any discomfort, and dis-regarding his own health visits the homes of countless devotees-whenever Swamiji visits this place. There is no difference of poor or rich in the heart of Swamiji Maharaj. He gives same love to one and all. Great is the enthusiasm in the hearts of devotees when Swamiji comes to this place.

---

Have great patiance and presence. —*Swami Sivananda*

His soul stiring Bhajans and Kirtans are ever memorable. He wears a simple geru cloth and upper part of the body is almost exposed most of the time. Like Mahatma Gandhi, he is happy with lion cloth. He remember us often and sends sweets, books etc. He never fails or delays in answering letters.

Swamiji always thinks of bringing peace and joy to as many as possible. He always carries bags containing books, sweets, fruits to distribute to the poor, children and devotees. Countless are the persons in whose heart Swamiji has lit the lamp of hope and joy.

On the auspicious occasion of Poojya Swamiji Maharaj's Diamond Jubilee Celebrations I and all my family members send warmest greetings and pray to God Almighty to bless Swamiji Maharaj with long life, sound health.

With humble pranams at your holy feet.

Yours respectfully,

**B. L. SONI**
Qtr. No. 15/A St. No. 36
Sector No. 4
Bhilai Nagar
Dt. Durg (MP)

---

The world of change implice a changeless being behind it That changeless being is God. —*Swami Sivananda*

ॐ

# Shashtyabdhi Poorthi ceremony

## of his holiness Sri Swami
## DEVANANDAJI MAHARAJ



Song of Divinity, Longivity and
Peaceful Prosperity.



Submission by
Guru Bhakti Ratna Prachara pravina
K. ANANTHA SWAMY,
Bangalore



Devudu dayachesi vachinadu Devanandulu roopamutho

Eswarudu tana tapassuni nilipi ongi tongi choostunnadu

Vishnu paramatmudu vaikuntamununchi vastunnadu

Anjaneyudu akashamununchi nagunaguto digutunnadu

Naradulu tamburani meetutu patalu padutu dayachestunnaru

Ammagaru anugrahamu tappaka chestunnaru

Nayana-nayana antu Devatalandaru gumpu-gumputo kalasinaru

Dada-Dada antu Sikhulu Mahammadeeyulu padutunnaru

Anandam Anandam Devanandulu Chaturmukha Brahma Devude
Kadaa !!

---

The base for perfection is purity of heart. The zenith of perfection is knowledge of the Self. —*Swami Sivananda*



# శ్రీ దేవానందసరస్వతి స్వాములవారి షష్ఠి పూర్తి మహోత్సవ సందర్భములో సమర్పించిన

# సన్మాన పత్రము

శ్రీ 108 స్వామి శంకరానంద సరస్వతి
(వేదాంతాచార్య)



శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యులు, శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠులైన శ్రీ స్వాములవారు అరవైయవ సంవత్సరములో ప్రవేశించి, ఉత్తర జీవనము సర్వసంగ పరిత్యాగులై, పరోపకారపరాయణులై గడుపుదు రని మనందఱి దివ్యసంకల్పము.

శ్రీ స్వాములవారు దివ్యజీవన సంఘ సంస్థాపకులు బ్రహ్మలీన శ్రీ 108 శివానంద సరస్వతి స్వాములవారి సేవాపరాయణులై వారి శుభాశీస్సుల వల్ల స్వాములవారు ఆంధ్ర దేశములోనేకాక, సంపూర్ణ భారత వర్షములో భక్తి - జ్ఞాన - వైరాగ్య ప్రబోధములను చేయుచు చిన్నస్వామి యనెడి బిరుదుతో ప్రసిద్ధి నొందిరి.

శ్రీ స్వాములవారి సంపర్కము సుమారు 1960 సంవత్సరమునుండి ఈనాటివరకు నేను కలిగియున్నాను. వారు నాకు చిరపరిచితులు మఱియు అందరికి ఆదర్శ పురుషులైయున్నారు. శ్రీ స్వాములవారి భగీరథ ప్రయత్నముచే శ్రీ శివానందాశ్రమ (ఋషీకేశము) పరమాధ్యక్షులైన శ్రీ 108

Enquire 'What is life ?' 'Whence is man ?' 'What is his end ?'
—*Swami Sivananda*

చిదానంద సరస్వతి స్వాములవారిచే మాకు సన్న్యాసదీక్ష 14-7-1971 లో ఇప్పించి మాకు జీవన దానమును ప్రసాదించిరి.

శ్రీ స్వాములవారు వామనావతారము నొంది, ఈ యుగములో భక్తులకు భక్తి - జ్ఞాన - వైరాగ్యములను ప్రసాదించి ధన్యులగావించిరి. శ్రీ స్వాములవారి భావిజీవనము దివ్యజీవన యాపన చేయుచు, లోకోపకార పరాయణులై, తపోసంపన్నులై, దీర్ఘాయుష్కులై యుందురు గాక ! యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.



---

## జ్ఞాన గుళికలు

నేను ఉత్తమ పతివ్రతను, మంచి యిల్లాలను అని ఆ యిల్లాలు చెప్పకూడదు. ఇరుగు పొరుగు వారు చెప్పాలి లేక తన భర్త చెప్పాలి. అపుడామె పాతివ్రత్యమున కెంతయో శ్రేష్ఠత్వముండును. నేను చాల మంచి అధికారిని, నిజాయితీ పరుడనని ఆ యధికారి చెప్పుకోకూడదు. తన తోటివారు, ప్రజలు, దొరతనము వారు చెప్పాలి. అపుడా యధికారి కెంత యైనను ఘనతయున్నట్లే. అలాగుననే మనపేరు ప్రఖ్యాతులను, ఘనతలను మనము పదేపదే పొగడుకొనకూడదు. మన ఆచరణనుబట్టి, మన ప్రవర్తనను బట్టి ఇతరులు చెప్పుకోవాలి. అటులనే మన భక్తిశ్రద్ధలను, మన బిరుదులను మనము చెప్పుకోకూడదు. భక్తోత్తములు చెప్పాలి. లేదా భగవంతుడు చెప్పాలి. మనభక్తి శ్రద్ధలను చూచి మనకు బిరుదులొసంగ వలయునంటే మనము భగవంతునికి ప్రీతికరములైన సత్కర్మల నొనర్పవలయును. లేదా భగవాదేశములను పాలింపవలయును.

(దేవానంద-చిన్నస్వాములవారి ఆధ్యాత్మిక ప్రపాఠములను)
స్వతంత్ర రచనా గ్రంధమునుండి)

---

Just as a heated iron-bal gets heat and redness from fire, so also the intellect, because of its nearness, gets light from the Atman, the lights. —*Swami Sivanando*



# యతిరాజులు చిన్నస్వామి శ్రీ దేవానంద సరస్వతి

శ్రీ స్వామి మేధానందపురీజీ
శ్రీ కైలాసాశ్రమము

శ్రీమత్ స్వామి దేవానందులవారి హీరకజయంతి ఉత్సవ సందర్భముగా వారిపై కొన్ని వాక్యములు వ్రాయునప్పుడు మా మనస్సు అత్యంత సంతోషముతో నిండు చున్నది. దేశపురాజు దేవతల స్వరూపమని భాగవత మతము, ఆదే గ్రంధములో సన్న్యాసి శివ స్వరూపమని వర్ణింపబడినది. శివ స్వరూపులైన శ్రీ దేవానంద స్వాముల వారి గుణములను వర్ణించు సౌభాగ్యము మాకు లభ్యమైనది. జగద్గురువులైన శ్రీ శివా నంద స్వాములవారు స్థాపించిన "దివ్యజీవన సంఘము" యొక్క కార్యక్రమములనెడి సౌధమునకు మన స్వామివారు ఒక ఆధార స్తంభము వంటివారనినచో అతిశయోక్తికాదు.

వీరు శ్రీ గుత్తపూడి రామస్వామిగారు మఱియు శ్రీమతి సింహాచలమ్మగారు అను పుణ్యదంపతులకు విజయనగరం జిల్లాలోని కొత్తపెంట అను గ్రామములో 1937వ సంవత్సరమున నిర్జల ఏకాదశి పుణ్యతిథియందు జన్మించిరి.

చిన్నతనములో బడిలో చదువుచు, గురుసేవ చేయుచు రామాయణ, భారత, భాగవత కథలను వినుచుండెడివారు. ఒకసారి గురువుగారితో "నేను గృహమునకు వెళ్ళను. ఇక్కడనే ఉండెద"ననిరి. అప్పుడు గురువుగారు మందలించి, ఇంటికి పంపిరి కాని మరల మరల ఆశ్రమమునందే ఉండుట తల్లియో, తండ్రియో, బంధువులో వచ్చి తిరిగి ఇంటికి తీసికొనిపోవుట జరిగెడిది. కాని ఆ చిన్నవయస్సులోనే (సుమారు 12 సంవత్సరములు) పూర్ణ వైరాగ్యముతో, పట్టుదలతో "నేను ఇంక ఇంటికి రాను" అని చెప్పివేసి ఆశ్రమములోనే ఉండిపోయిరి. వీరి దృఢ వైరాగ్యము చూచి గురువు గారు 17వ ఏటనే వీరికి సన్న్యాస దీక్ష యొసంగిరి. శ్రీ శివానందులు వ్రాసిన "ఇరువది ఆధ్యాత్మిక సూత్రములు" అను పట్టికను చదివి, గురుదేవులచే ప్రేరితులై 19వ ఏటనే హృషీకేశ్‌కు వచ్చి హిమాలయములలోనే స్థిరపడిరి.

---

Charge the vision with Wisdom and see the whole world as God.
—*Swami Sivananda*

వీరి కార్యకుశలత, భక్తిభావము, సంకీర్తన, కరుణ, స్వ ఆశ్రమ ధర్మపాలన, గురుభక్తి, గ్రంథరచన, భక్తుల ప్రేరణ మొదలుగా గల గుణములు వీరిని జీవన్ముక్తులను గావించెను. చిన్నతనములోనే దివ్యజీవన సంఘమునకు వచ్చుటచే వీరికి గ్రంథములను మోయుపని ఇవ్వబడెను. పుస్తకముల కట్టలను క్రిందినుండి కొండపైకి తీసుకొని పోవుచు ఆ విరాట్ స్వరూపుని సేవ చేయుచున్నట్లు భావించెడివారు. అట్లే ప్రతి చిన్న పనిని ఈశ్వరసేవ అనే దృష్టితోనే చేసెడివారు.

వీరి భక్తి అత్యంత శ్లాఘనీయము. విశ్వనాథ మందిరములో పూజలు, అన్యత్ర హోమములు, హారతులు, నిత్యము గంగామతల్లికి హారతి చేయునప్పుడు సాక్షాత్ పరమేశ్వరుడే వారి పూజలను అందుకొనునట్లు అనుభవము కలుగును. వీరుచేయు నిత్య సంకీర్తనలు దేశములోని ఎందరో భక్తులను పరవశము గావించి, వారిని ఆధ్యాత్మిక మార్గములోనికి తీసికొని వచ్చెను. వీరుచేయు నగర సంకీర్తనలు, ఊరేగింపునందు చేయు సంకీర్తనలు చూచువారినే పరవశింపజేయును. అట్లైన వీరు ఎంత తన్మయత్వముతో కీర్తనలు చేయుదురో, మీరే అంచనా వేయండి.

వీరి కరుణా హృదయ స్పందనను అనుభవించనివారు ఉండరు. వీరి సాంగత్యము లోనికి వచ్చిన వారందరు ఆనంద సాగరమునందు మునకలిడుచుందురు. సుదూరమగు ఆంధ్రదేశము నుండి తీసుకొని వచ్చిన పిండివంటలను కైలాసాశ్రమ సాధువులకు కూడా ఉదారదృష్టితో పంచిపెట్టుచుందురు ఎట్టి కష్టమునందున్నవారైనను వీరి తేనె పలుకులు విని, తమ దుఃఖమును మరచి సాధనయందు ప్రవృత్తులగుచుందురు.

స్వ ఆశ్రమ ధర్మపాలన వీరియందు నిండియున్నది. ఎవరైనను ఒకరోజు వేదాంతము వినినచో 80 కృచ్ఛ్ర చాంద్రాయణ వ్రతములు చేసిన ఫలమును పొందును. అనగా 80 నెలలలో చేయు కర్మయొక్క ఫలమును ఒకేరోజులో పొందును. అట్లే ఒకసారి "నారాయణ"యని పిలచిన పతితుడైన అజామిళుడు వైకుంఠమును పొందెను వ్యాధితో పీడితుడై శయ్యపై పరుండి, కొడుకును సాధుపురుషులు పెట్టిన పేరుతో పిలిచి యమదూతల-దేవదూతల సంభాషణను విని, తన తప్పిదము తెలిసికొని వ్యాధి

Without suffering and struggle there is no enlightenment.

—*Swami Sivananda*

నయమైన తర్వార అన్నియు త్యజించి సంకీర్తనలో లీనమై వైకుంఠమును పొందెను. అట్లే ఆ జీవనము సంకీర్తనతో గడిపి భక్తులందటిని సంకీర్తనలో ముంచివేయు శ్రీ దేవానందుల జీవన్ముక్తిపై ఎవరు శంకింపగలరు?

వీరి గురుభక్తి వర్ణనాతీతము. వీరు పొట్టిమనిషి. గురుదేవులది పెద్ద శరీరము. ఐనను వారిని ప్రేమతో తల్లివలె చూచుచు సేవలు చేసెడివారు. తల్లి చంటిబిడ్డకుచేయు సపర్యలే మన స్వామి గురుదేవులకు చేసెడివారు, వీరి సేవ ఎంతగొప్పదో, గురుదేవులే స్వయముగా పలికిన వాక్యము ప్రమాణము. "మా దేవానంద బంగారు బిడ్డ" అని వచ్చిన భక్తులందరితో చెప్పెడివారు. గురుదేవులు తమ శక్తిని వీరియందు ప్రవేశింపజేసి వీరినికూడా తమవలె పెద్ద గురువులనుచేసి మాయాజాలమునుండి తప్పించిరి.

వీరి గ్రంథ రచన, వ్యాస రచనాశైలి అత్యద్భుతము. చిన్నపిల్లలకు ఎట్లు బోధింపవలయునో వీరినుండే తెలిసికొన వలయును. వీరు శ్రీ శివానందవాణి అను పత్రిక ద్వారా అనేక ఆంధ్ర ప్రజలకు లాభమును కలిగించుచున్నారు. వీరు పల్లెపల్లెకు ఇంటింటికి తిరిగి గురుదేవుల సందేశమును దేశములోని నలుమూలల వ్యాపింపజేసిరి. దూర ప్రయాణము చేయలేని భక్తులు వీరివల్ల గొప్ప దైవానుగ్రహమును బడసిరి.

వీరి వైరాగ్యము, ఆత్మనిష్ఠ దినదినాభివృద్ధిని పొందుచుండుట వలన వీరు "యతీనాం రాజా యతిరాజః" అనగా యతిరాజులైరి ఇటువంటి దివ్యమైన సన్న్యాసి ఈ దేశమునకు ఆంధ్రుల కానుక. వీరివంటి దివ్యాత్మలు కొంతమంది చేరినచో ఆంధ్రదేశమే కాక, యావత్ భారతదేశము ఆధ్యాత్మిక పురోభివృద్ధి నొందుననుట అతిశయోక్తి కాదు. వీరిజన్మ దేశగౌరవమును పెంపొందించుచున్నది. వీరికి ఈ హీరక జయంతి (షష్ట్యబ్దిపూర్తి) సందర్భమునందు కనీసము రెండవ షష్ట్యబ్ది వరకు (120 సంలు) ఆయురారోగ్యముల నిచ్చి కాపాడవలయునని ఆ పరమేశ్వరుని ప్రార్థించుచు, స్వామి వారి పాదపద్మములకు ప్రణమిల్లి విరమించుచున్నాను.





ఓం నమో భగవతే శ్రీ మళయాళయంత్రాయ
సద్గురు శ్రీ శివానంద పరబ్రహ్మణే నమః

# అమృత హృదయులు శ్రీ దేవానందస్వాములవారు


శ్రీ రామేశ్వరానందగిరి స్వాములవారు
శ్రీ మలయాళస్వామి మఠము,
H. No. 670, గాంధినగర్, హైదరాబాద్-80


చాలకాలమునుండి, సుమారు 1970 కాలము నుండి, పూజ్యశ్రీ దేవానంద స్వాములతో పరిచయ భాగ్యము కలిగినది. వారు నిజముగ అమృతహృదయులు, ఎల్లప్పుడు నవ్వుతూ ఆనందముగ తనలోని ప్రేమామృతమును, నలుగురికి పంచిపెట్టడమే వారి స్వభావము. పసిపిల్లలకు పిప్పర్మెంట్సు, స్వీట్సుతో ఆనందముతో ఆశీర్వదిస్తూ పంచి పెట్టడము, పండ్లు ఫలాలు రెండుచేతులతో ఇవ్వడమే పరమానందము వారికి.

(చిన్నస్వామి) వీరు మొదట కొన్ని రోజులు శ్రీ వ్యాసాశ్రమమున శ్రీసద్గురు మహర్షి మళయాళ స్వాములవారి సన్నిధిచేరి వారి దివ్యానుగ్రహము బడసి, తర్వాత హృషికేశముచేరి పరమపూజ్య శ్రీ సద్గురు శివానందస్వాముల వారి కృపకు పాత్రులై దివ్యజీవన సంఘమునకు అతిముఖ్యులై ఆధ్యాత్మిక క్షేత్రములో మాణిక్యమువలె ప్రకాశించుచున్నారు.

వీరి ముఖములో దివ్యతేజస్సు, గళమునందు మాధుర్యము సంకీర్తనలో అమృతధార! శ్రీ నామదేవ్ తుకారాంను మరపిస్తారు.

మహామేధావి నిరంతరము నారద మహర్షివలె గాన మాధుర్యములో మునుగుచు, సత్సంగములు ప్రవచనాలు చేస్తూ కూడా "శ్రీ శివానందవాణి" మాస పత్రికను నడుపుట సామాన్యముకాదు. శ్రీ స్వామివారికి సంపూర్ణముగ శ్రీ సద్గురు శ్రీశ్రీశ్రీ శివానందస్వామి మహారాజ్‌గారి దివ్యానుగ్రహము యున్నదనుటకు సందేహము లేదు, అమృత హృదయులగు పూజ్యులు శ్రీ దేవానంద స్వామి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవము విజయవంతమై, వజ్రోత్సవము, శతజయన్తి కూడా జరుపుకొని. సంపూర్ణ ఆయురారోగ్యములతో విలసిల్లును గాక!

ఓం తత్సత్

God is love; Brahman is wisdom. —*Swami Sivananda*

ఓం నమో భగవతే శివానందాయ

సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం

# మహాత్ములు

శాంతా మహాన్తో నివసన్తి సన్తః
వసన్తీ వల్లోకహితం చరంతః
తీర్ణాః స్వయం భీమ భవార్ణవంజనా
నహేతు నాన్యానపి తారయంతః (వి.చూ)

మానవాళికి మహోపకారం చేసే వసంతంవలె జీవించే శాంత స్వభావులైన మహాత్ములున్నారు. పరిమితము భయంకరమైన ఈ భవసాగర జలధిని వారు స్వయం కృషితో దాటగలిగారు. తరించాలని ప్రయత్నించే వారికి అట్టివారు నిస్వార్థంగా జ్ఞానమనే చేయూతనిస్తారు.

ఆత్మానుభవాన్ని పొందిన మహాత్ముడు యిచ్ఛాధీనంగా హిమాలయ గుహలో నివసించ వచ్చును. నడిబజారులో నడువవచ్చును. అతని దృష్టిలో అన్నీ సమానమే. అతని నుండి అనివార్యంగా అత్యంత సహజంగా జ్ఞానము, ఉత్సాహము, సంతోషము, శాంతి బహిర్గతమయి తన చుట్టు ఉన్నవారిని ప్రభావితులను చేస్తూనే వుంటాయి. అది అతని స్వభావము. అగ్ని వేడిని ఉత్పత్తి చేస్తోందని అనలేము. అగ్నికి వేడి అత్యంత సహజం. అదేవిధంగా మహాత్ములు కూడా సుఖశాంతులను, జ్ఞానానందాలను సహజాభరణాలుగా ధరిస్తారు.

మహాత్ములను వసంతంతో పోల్చడంలో ఎంతో మేధాశక్తిని ప్రదర్శించారు. వసంతం వచ్చి ప్రతీ వృక్షాన్ని చిగురించమని కోరదు, పుష్పించేలా చేయదు. వసంతాగమనంతో వసంతపు సన్నిధిలో సర్వసృష్టి పులకించిపోతుంది. అట్టి వాతావరణంలో ఎవరయినా సరే ఆనంద పరవశులు కాకతప్పదు. ఇదేవిధంగా మహాత్ముల సన్నిధిలో

---

Why God has created the world ? This is his Svabhava or nature.
—*Swami Sivananda*

వాతావరణం పవిత్ర స్థలంగా, తీర్థ స్థలంగా మారుతుంది. మహాత్ములు ఎచ్చటవుంటే అదే తీర్థ స్థలము, దివ్యక్షేత్రము.

వసంతము, ప్రకృతీ పరస్పరాధారంగా కనిపించే ఏకత్వపు భిన్నరూపాలు. ఇదే విధంగా సద్గురువు, అధికారి అయిన శిష్యుడు, దైవత్వపు వ్యక్తరూపానికి విభిన్న దృక్పథాలు పదము-అర్థము-భావం వలె అవినాభావంగా, విభిన్నంగా ప్రభావితులౌతారు. పరిమితులతో నిండిన అజ్ఞాన హృదయాలను ఆదర్శమూర్తులుగా తీర్చిదిద్దుతారు.

కవిత్వపు సరళిలో చిత్రించినప్పటికీ ఇచ్చట సూచించినది ఏమిటి అంటే ఆత్మానుభవం పొందిన మహాపురుషుడు (పురుషుడు అంటే ఉత్సాహము, ధైర్య సాహసములు కలిగి, శాంతస్వరూపము కలిగినవాడే పురుషుడు) అత్యంత సహజంగా అపార ప్రేమతో తన దరిచేరి శరణన్నవారలకు ఈ భవసాగరం నుండి దాటించడానికి జ్ఞాననౌకగా సహాయపడతారు. గురువులలో బాధాగురువులు, బోధగురువులు వుంటారు. బాధాగురువులను ఆశ్రయించకుండా బోధగురువులైన మన దేవానంద స్వామీజీవారిని చేరి శరణుకోరి శాశ్వతమైన జ్ఞానాన్ని అర్థించడం భగవద్దత్తమయిన మహావరంగా అభయహస్తంగా భావించవచ్చును

కర్కశమయిన సూర్యతాపంచే భూమిని చంద్రుడు ఏవిధంగా కరుణతో చల్ల బరుస్తాడో అదేవిధంగా మన శ్రీ దేవానంద స్వామీజీవారు సాటివారి కష్టాలను, బాధ లను తొలగిస్తారు. కోరికలతో, మమతానురాగ బంధాలతో దహింపబడే మన హృద యాలను ఎంతో సహనంతో చంద్రునిలాగ శాంతింపజేస్తారు. ఎన్ని కష్టములలో, బాధలలో వున్నవారయినాసరే స్వామీజీవారి దర్శన, సంభాషణతో వారి మనస్సు పుల కింపజేస్తారు. ఎవరితోను చెప్పలేని ఆంతరంగిక బాధలను స్వామీజీవారి దగ్గర చెప్పు కొని దుఃఖనివృత్తి చేసుకుని వారి జీవితాన్ని ఆనందమయంగా తీర్చిదిద్దుకోవడానికి తగిన మార్గాన్ని చూపించి వసంతంలాగ వారి జీవితాన్ని ఉత్సాహపూరితంగా పులకింప జేస్తారు. వారి పేరు తెలియనివారు వుండరు. ఒరిస్సా, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళ నాడు, అన్ని రాష్ట్రాలలో, ప్రతీ జిల్లా, ప్రతీ పల్లెయందు వారి ప్రవచనాల ద్వారా, ఆచరణ ద్వారా ప్రజలకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను అందిస్తున్నారు. సముద్రములో

---

Love is joy. Love is bliss. Love is power. Love is God. Love is nector. —*Swami Sivananda*

అనంతమైన నీరు వుంటుంది. మనము తీసుకువెళ్లే పాత్రనుబట్టి నీరుగ్రహించగలు తాము. అదేవిధముగా స్వామీజీ వారి దగ్గర అనంతమైన భక్తి, జ్ఞాన, వైరాగ్యసంపద వున్నది. వారి దగ్గర మనము బాహ్యమైన కోరికలు కోరకుండా అజ్ఞానాన్ని తొలగించు టకు తగిన జ్ఞానాన్ని కోరుకుందాము.

శ్రీ దేవానంద స్వామిజీ వారు వసంతములాగ, చంద్రుని లాగ జ్ఞానముద్వారా మన తాపాలను శాంతింప చేస్తున్నారు. వారి మార్గాన్ని మనము అనుసరించినట్లయితే పరమ పురుషార్థాన్ని చేరుకోవడానికి పుష్పక విమానంలో పయనించినట్లే.

షష్టిపూర్తి సందర్భముగా ఈ దివ్యపుష్పమును స్వామిజీ వారి పాదపద్మము లందు సమర్పిస్తున్నాను. వారు శతసంవత్సరములు మనలాంటి అజ్ఞానులకు జ్ఞానాన్ని అందించగలరని భగవంతుని ప్రార్థిదాము.

ఓం నమో భగవతే వాసుదేవాయ.

ఇట్లు మీ పాదదాసి

బ్రహ్మచారిణి వినమ్రచైతన్య



---

## జ్ఞాన గుళికలు

"సాధ్నోతి పరకార్యమితి సాధుః" జాతిమత వివక్షణలు, స్త్రీ పురుష భేదములు వేషభాషలేమియు లేకుండా, ఎవరైననూ సరే, పారమార్థికము నకు పాటుపడకుండా ఉదరపోషణమునకై పాటుబడువారందరు స్వాధువులే, కుక్షింబరులే, అందుచేత ఈ స్వాధువుల చేతబడకుండా సాధకులు కడు జాగరూకతతో మెలగవలయును.

(దేవానంద - చిన్న స్వాములవారి ఆధ్యాత్మిక ప్రపాఠములను స్వతంత్ర రచనా గ్రంథము నుండి)

---

Investigation or Vichara is the seed capable of sprouting and flourishing as a great tree of happiness. —*Swami Sivananda*



# సత్సంగమనే అయస్కాంతీకరణ ప్రక్రియ

కలియుగ మానవాళి తరించటానికి సాధనపరంగా, ఆచరణాత్మకమైనది, అతి తేలిక అయిన మార్గం - "భాగవత మార్గం" గా చెప్పబడినది. ఇది సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడు మైత్రేయ మహర్షికి, నారదులు వ్యాసమహర్షికి అనుగ్రహించిన మార్గం. ఇందలి అతిముఖ్యమయిన ప్రక్రియ - "సత్సాంగత్యము" లేక "అయస్కాంతీ కరణ సిద్ధి".

సాధకుడు తన స్వభావమును (జన్మల సంస్కారం) తనకు తానుగా అధిగ మించ గల్గుట అనునది కేవలం భగవదనుగ్రహము వల్లనే సాధ్యమగును. దైవాను గ్రహం మానవ ప్రయత్నం మీద ఆధారపడి యుండును మానవుడు తన ప్రయ త్నంలో సఫలీకృతుడై, తన స్వభావమును తాను అధిగమించుట అనునది కేవలం సత్సంగముద్వారానే సాధ్యపడుననునది పెద్దలవాక్కు మరియు శాస్త్రసమ్మతము.

సైన్సు పరంగా - ఒక ఇనుపముక్కను కేవలం అయస్కాంతము (Magnet) సన్నిధిలో కొంతకాలము ఉంచుటవలన, తన స్వభావమును విసర్జించి, అయస్కాంత గుణగణాలను పొందుట మనకు తెలిసినదే. ఇందులో అయస్కాంతీ కరణ అను ప్రక్రియ అదృశ్యంగా, అప్రయత్నంగా జరుగుచున్నది.

అలాగుననే పాలయందు - మజ్జిగ తోడువేసిన కొంత సమయమునకు, పెరుగు వలె మారుట తెలిసినదే. పాలు, మజ్జిగల కలయికలో జరిగే ప్రక్రియ కూడ అప్ర యత్నంగా జరిగినదే.

సత్సంగమునందు కూడ, ఒక మహాత్ముని వెలుగులో, సన్నిధిలో, సాంగత్య ములో వసించి, సేవించి, తరించటం కూడ అయస్కాంతీకరణ ప్రక్రియేను, ఆత్మ సాక్షాత్కారం పొందిన మహనీయుల దృష్టి, వాక్కు, స్పర్శలు తమపరిధిలోకి వచ్చిన ప్రతిజీవిని స్పందింపజేసి, పవిత్రీకరించుటయే అయస్కాంతీకరణము. ఆ మహాత్ముని

---

Association with the wise is the root-cause for eradicating all misery.

—*Swami Sivananda*

వెలుగులో, తాదాత్మ్యం చెందిన ప్రతిజీవి శోభన చేయబడుట అనునది అనాదిగా జరుగుచున్న అనుభవ సత్యము శాస్త్రవిదితము.

చిన్నస్వామిగా, సంకీర్తన స్వామిగా, పరివ్రాజక స్వామిగా, లక్షలాది భక్తులకు ప్రేరణ యిచ్చిన మన దేవానంద స్వామి కూడ - పరమ గురువులు శ్రీ స్వామి శివానంద పాదసన్నిధిలో వసించి, సేవించి, మెప్పించి, తరించి, అయస్కాంతీకరణ సిద్ధిని పొందిన స్వామియే కదా! ఇప్పుడు తమ భక్తులకు, జిజ్ఞాసువులకు, ఆశ్రయించిన అతి సామాన్యునికి కూడ, తన సాన్నిధ్యమును, సాంగత్యమును అనుగ్రహించి, సంకీర్తన - నామ జపముల ద్వారా ప్రేరణ యిచ్చి పవిత్రీకరించి, అయస్కాంతీకరణ ప్రక్రియను సాగించుచున్నది కూడ మన చిన్న స్వామియే !

1994 సం॥లో పుణ్యహిమాలయ శ్రేణులలో హిమవంతుని పాదసన్నిధిన, పవిత్ర గంగమ్మ ఒడిలో పరమ గురువు శ్రీ స్వామి శివానందుల సాన్నిధ్యమునందు, పరమ ప్రేమమూర్తి శ్రీదేవానందుల చిన్నస్వామి వారి సత్ సాంగత్యములో, సాధన పరంగా రెండు నెలలు వసించి, పవిత్రీకరణ చెందే అవకాశము, అదృష్టము కలిగినది. అచ్చట ఆశ్రమదైనందిన కార్యక్రమములలో మన చిన్నస్వామివారి పాత్ర తనదైన శైలిలో, బహుముఖ ప్రజ్ఞలతోకూడిన విశ్వరూప దర్శనం లాంటిది. ఆశ్రమమునకు దేశ నలుమూలల నుండి వచ్చు భక్తులు శ్రీ స్వామిపరమప్రేమలో, ఆప్యాయతలో, సేవానిరతిలో, ఏవిధంగా స్పందించుదురో గమనిస్తే వారి వామన రూపంలో యిమిడివున్న విరాట్ స్వరూపము, బహుముఖ ప్రజ్ఞలు అవగాహన అగును.

శ్రీ దేవానందస్వామిని ఆశ్రమ కార్యకర్తగా, సంధానకర్తగా, సాధకుల సాధన సమస్యలకు పరిష్కారకర్తగా, శ్రీ శివానందవాణి వ్యవస్థాపకులుగా ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా ప్రేరణ, స్ఫూర్తి ప్రదాయకులుగా, సత్సంగమునందు సంకీర్తన ద్వారా అయస్కాంతీకరణ ప్రక్రియ, లౌకిక సమస్యలు గలవారికి ఉపదేశ, ఉపచారముల ద్వారా ఉపశమనం, యాత్రికుల వసతి, భోజన ఏర్పాట్లలో, ఆర్థిక యిబ్బంది లందు సహకరించుట, విద్యార్థులకు సంకీర్తన సలహాలద్వారా, విద్యా బుద్ధులను నేర్పుట, మొదలగునవి ఏన్నో గల్గిన బహుముఖ ప్రజ్ఞాశాలిగా దర్శించటం జరిగినది.

---

Brahman is the thread on which are strung all the wor'ds and all the beings.

—*Swami Sivananda*

సమస్త వేదసారమును, పరమ గురువులు శ్రీ శివానందస్వామి రెండువాక్యము లందు అందింపగా -

**Be Good - Do Good**

**Simple living - High thinking**

మన చిన్నస్వామి - పరమ ప్రేమమూర్తిగా, నిరాడంబరజీవిగా, మంచితనానికి మారుపేరుగా, తనజీవితమునే మలచి, ఆచరించి, ఆదర్శప్రాయంగా నిలచి, తోటి మానవాళిని తరింప జేస్తున్న భాగవత మూర్తులు. పెద్దస్వామి ప్రబోధములను అక్షరాల ఆచరించి, తన గురుదేవుల కీర్తిని దశదిశలలో వ్యాపింప జేసిన మన చిన్న స్వామి పరమ ధన్యజీవులు. వారి సమకాలికులుగా జన్మించి, దర్శన, స్పర్శ, సాన్నిధ్య సాంగత్యములను పొందిన మనందరం కూడ పుణ్యజీవులమే!

శ్రీ చిన్నస్వామి షష్టిపూర్తి సందర్భంగా - పరమ గురు పరంపర, సమస్త ఋషి పరంపర, 33 కోట్ల దేవతలు, అంతర్యామి, సర్వాంతర్యామి అయిన శ్రీమన్నా రాయణుడు, శ్రీ స్వామి వారికి పూర్ణాయుస్సును, సంపూర్ణ ఆరోగ్యమును, పరమా నంద ప్రాప్తిని, పరమ శాంతిని ప్రసాదించుగాక! వారి జీవితం మానవాళి ఆధ్యాత్మి కోన్నతికి అంకిత మగుగాక! శ్రీ స్వామిని సేవించిమనందరం కూడ తరింతుముగాక!

ఓం తత్ సత్

ఇట్లు భక్తి శ్రద్ధలతో

"అజ్ఞాత భక్తుడు"



The entire creation constantly moves towards the Divine.

—*Swami Sivananda*

ఓం

# చిన్నస్వాములవారి రైలు బోగీలో ప్రయాణిద్దాం

డా॥ శాంత, M.A., (Phd.)
సికింద్రాబాద్.

గురుదేవులు ఎండాకాలంలో పొద్దుట 7 నుండి 9 వరకు శీతాకాలంలో రాత్రి 7-30 నుండి 9-30 వరకు సత్సంగము చేసేవారు (ఉదయం సత్సంగము క్యాష్ ఆఫీసులో రొటీన్‌గా జరిగేది.) ఏ చిన్నపనికైనా గురుదేవులు దేవానంద స్వాములవారినే పిలిచేవారు. దేవానంద్ శాంతానంద్ పుఛుచ్చో, దేవానంద్ కళ్యాణానంద్ పుఛుచ్చో అని ఒక లక్ష పనులు గడగడ చెప్పేవారు. స్వామీజీ ఏ ఆర్డరులో చెప్పేవారో అనే ఆర్డరులో గబగబా పనులన్నీ చిన్నస్వామి చేసేవారు.

భగవంతునికి, గురుకృపకు సంపూర్ణ పాత్రులుగా గురుదేవులకు అత్యంత సేవ చేసి, వారు శరీరత్యాగాన్నిచేసే ముందురాత్రి వరకు నిరంతరం సేవచేసి తరించిన మహామనిషి చిన్నస్వాములవారు. అందుకే కాబోలు యిప్పుడు శ్రీ గురుదేవుల కుటీరంలో వుండే భాగ్యం ఆయనకే కలిగింది.

గురుదేవులలో వున్న అన్ని గుణాలను పుణికిపుచ్చుకున్నారు. గురుదేవులు చిన్నచిన్న మాటల్లో, పాటల్లో బ్రహ్మజ్ఞానాన్ని మన నిజతత్వాన్ని గూర్చి చెప్పారు. "సాంగ్ ఆఫ్ గోవిందా" "సాంగ్ ఆఫ్ రామ్" "సాంగ్ ఆఫ్ యైటీన్ ఐటాన్స్" జ్ఞానం ఏ యూనివర్శిటీలోను దొరకదు కాని గురుదేవుల వాక్యాన్ని మన నిత్య జీవితంలో ఆచరిస్తే మనం అమరత్వాన్ని పొందుతామన్నారు. అదేవిధంగా చిన్నస్వాములవారు దేశంలో ఏ ప్రాంతంలో పర్యటన చేసినా చిన్నచిన్న మాటల్లో భగవంతుని పరిచయం చేసి, భగవంతునిగా ప్రజలను, భక్తి ప్రేమలను, అశేష ప్రజానీకాన్నుండి అందుకుంటున్నారు.

అయస్కాంతానికి ఒక లక్షణముంది. ఇనుమును తనవద్దకు లాక్కోవడమే గాదు. దాని స్పర్శలో ఎక్కువసేపువుంటే ఇనుపముక్కగూడ అయస్కాంతముక్కగా మారిపోతుంది. అటువంటి పెద్ద అయస్కాంతమే గురువుగా దేవానందస్వాములవారు.

గురువును ఒక రైలుఇంజనుతో పోలుస్తారు. ఏ రైలుడబ్బాలు ఇంజనుకు తగిలించబడతాయో అవన్నీ గమ్యం చేరుకుంటాయి. అట్టి దేవానందస్వాములవారి రైలు డబ్బాల్లో ప్రవేశిస్తే మనం గమ్యం చేరుకుంటాము.

గురునామ్‌కీ గాడీమే మోక్షధామ్‌కు జాయేంగే
చెకింగ్‌హోగీ రాస్తామె దేవానంద్ టికెట్ దిఖాఇంగే



**J. Srirama Murthy,** B.Com., (Hons)
Retd. Deputy Superintendent of Police
BHIMADOLE-534 425.
Ph. (08829) 2123 W.G.Dt.

పూజ్య శ్రీశ్రీశ్రీ దేవానంద చిన్నస్వామి మహరాజ్ వారి చరణములకు శ్రీరామమూర్తి భక్తిపూర్వక ప్రణామములు.

స్వామిజీ

సద్గురు శ్రీశ్రీశ్రీ శివానందస్వామిజీ వారి అపారజ్ఞానసంపదను - వారి ఆంగ్ల రచనలను ఆంధ్రీకరించి రాష్ట్రములోని మారుమూల ముముక్షువులకు కూడ అందించి, తరింప జేస్తున్న తమ సేవను వినయ పూర్వకముగా కొనియాడుచున్నాను. అభినందిస్తున్నాను.

భక్తి జ్ఞాన ప్రపత్తులను అఖిలాంధ్ర ప్రజానీకానికే గాక దేశ వ్యాప్తంగా అందించడానికి పరమేశ్వరుడు తమకు పరిపూర్ణమైన ఆయుర్దాయమును ప్రసాదించుగాక అని ప్రార్థిస్తున్నాను. నాకు 77 ఏండ్లు నిండినవి. షష్ట్యబ్ది పూర్తి ఉత్సవమునకు వచ్చే అదృష్టము నాకులేదు.

భవదీయుడు

శ్రీరామమూర్తి



---

Never postpone a thing for tomorrow if it is possible for you to do it today.
—*Swami Sivananda*



శ్రీ మద్వేదాంత వేద్య నిగమాగమ సచ్చిదానంద స్వరూపులు
శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పరమ పవిత్ర
పూజ్యశ్రీ దేవానంద సరస్వతీ మహరాజ్ [ఋషికేశ్]
చిన్నస్వామి వారికి కొత్తపేట [స్వామీజీ జన్మస్థలము]
శ్రీ గురుదేవ భక్త సమాజము వారు శ్రీ దేవానంద స్వామివారికి
"షష్టిపూర్తి మహోత్సవము"
జరుపుచున్న శుభసందర్భమున సంఘ సభ్యులు
భక్తిపూర్వకముగా సమర్పించుకున్న

# సన్మాన ప్రసూనములు

శా॥ శ్రీ వేదాంత విచార సారధనమున్ చేపట్టి యీధాత్రిపై
నీవే భక్త జనాళికిన్ స్వయముగానే యందగాజేయుదో
దేవానందసరస్వతీ ! యతివరా ! దివ్యప్రభావోన్నతా !
మావైరాగ్య నమస్సుమమ్ము లివె ప్రేమన్ గొమ్ము శ్రద్ధనిన్

కం॥ అందర ముందర కూర్చొని
సందేహమ్ములను దీర్చు సద్గురు దేవా
నంద సరస్వతి మహరాజ్;
వందనములు గొనుము మేము భక్తి నొసంగన్

సీ॥ ఫాల భాగము నందు పరిఢ విల్లుచునున్న
భూతి రేఖల మధ్య బొట్టుతోడ

రుద్రాక్ష సరములు రూఢిగ మెడనుండ
చేతులలో రెండు చిరుత లమర
కాయమ్ము పైన కాషాయ వస్త్రములుండ
వడిలేక యుండిన నడక లలర
పూర్ణిమ చంద్రుని బోలు నెమ్మోమున
మిత భాషణము లలంకృతి రచింప

తే॥గీ॥ అపర వామన మూర్తివై యహమునణచ
నవతరించితి వవనిపై యతివరేణ్య !
సద్గురువర ! దేవానంద ! స్వామి ! నీదు
షష్టిపూర్తి మహోత్సవ సమయమందు
వందన ప్రసూనము లివే అందుకొనుమ !

చ॥ మృదుమధురోక్తులన్ పలుక మిక్కిలి ముచ్చటగొల్పు విన్నమా
హృదయములెల్ల పొంగగ మరేవియు గుర్తుకురాక, దైవమే
మెదలుచు నుండు ముందరనుమీ ! చినస్వామీ గురూత్తమోత్తమా
ఇదె గొను ! మా ప్రణామముల నెల్లను మాలగ గూర్చి మేమిడన్

శా॥ గోవిందా యను నామ కీర్తనము స్వామీ ! మీరు చేయంగ మీ
త్రోవన్ వచ్చుచు మేము పాడ విననెంతో సంతసంబౌ భువిన్
పోవున్ భక్తుల కల్మషంబులు, సదాపుణ్యమ్ము చేకూరు, శ్రీ
దేవానంద యతీంద్ర ! వందనములందింపంగ గైకొమ్మివే

రచయిత :
కవికుమార, మధురకవి, మధురశ్రీ
అధికార్ల నీలకంఠం
కణుగులవలస
వయా. ఆమదాలవలస-532 185.

సమర్పణ :
శ్రీ గురుదేవ భక్తసమాజ బృందం
కొత్తపెంట - 14-2-97.





శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య సద్గురు శ్రీ శివానంద
సరస్వతీ మహరాజ్ వారి పాదసేవకులు;

## శ్రీశ్రీశ్రీ సద్గురు దేవానంద స్వామివారి

దివ్య షష్ట్యబ్ద పూర్తి సందర్భముగ శ్రీ గురుదేవ భక్త బృందమువారు
అత్యంత భక్తి శ్రద్ధలతో సమర్పించు

# మహా సన్మాన పత్రము

"జయజయ శ్రీ దేవానంద సద్గురు సార్వభౌమా!
జయజయ శమదమాది గుణగణాన్వితా!
జయీభవ! దిగ్విజయీభవ!"

తాము కవిత్రయ - పోతనామాత్య-అన్నమాచార్య-క్షేత్రయ్య-భక్త రామదాసు వంటి మహా భక్తబృందము ఉద్భవించిన తెలుగు నేలయందు; ఆంధ్రుల సౌభాగ్య వశమున నారాయణుని కృపచే మీ జననీ జనకుల నోములపంటగా అవతరించినారు. యావద్భారతదేశము కీర్తించునట్లుగా నేడు హిమాలయ యోగీశ్వరులుగా మహిమాన్వితులై అరువదియవ సంవత్సరమున త్రివిక్రమావతారుని వలె కాలుమోపుట మహా సుకృతము గదా!

"జయజయ దివ్యగంగా తీరనివాస, దివ్య జీవన మార్గ
ప్రతిష్ఠాపనాచార్య శ్రీశ్రీశ్రీ శివానంద యోగేంద్ర హృదయ
సింహాసనాధిష్ఠిత! సచ్చరిత్రా! మహాపవిత్రా!
జయీభవ! దిగ్విజయీభవ!

---

Control your emotions by discrimination and Vairagya.
—*Swami Sivananda*

మహాత్మా తాము భగవానుని కృపచే; పూర్వజన్మ సంస్కారముచే దివ్యాత్మ ప్రేరితులై "శుచీనాం శ్రీమతాంగేహే" అని శ్రీకృష్ణపరమాత్మ వచనానుసారముగా కొత్తపెంట గ్రామమున జన్మనొంది చిన్నతనముననే నివృత్తి మార్గము ననుసరింపవలెనని; ఇంటిని వీడి బాలధృవునివలె తల్లిదండ్రులను, గ్రామమును, బంధువులను, బంధములను వీడ భారత పరిక్రమణ మొనరించి శ్రీ నారాయణ పాదోద్భవి, హరజటా జూటానుగ్రహపావన జాహ్నవీతీర నివాస మహర్షులు, ఋషీకేశ దివ్యధామ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్యులగు సద్గురు శ్రీ శివానంద సరస్వతీ యోగేశ్వరుని పాదసన్నిధి నాశ్రయించినారు.

కఠోరమగు ఆశ్రమ నియమములను ఆచరించి ఆ మహాపురుషునిచే "చిన్న స్వామీ" అని వాత్సల్యముగా పిలువబడి యావల్లోకమున చిన్నస్వామిగా సార్థక నామధేయులై; చిన్నచిన్న సాధకులకు కూడా అత్యంత చనువుగా నుండి గ్రామగ్రామములను దేశ దేశములను భాషా బేద - ప్రాంతీయ భేదము లేక పర్యటించుచూ దివ్య జీవన జ్యోతులను వెలిగించు ఓ పెద్దమనసున్న మహాపురుషా శ్రీ దేవానంద సద్గురు దేవా ! జయీభవ ! దిగ్విజయీభవ !

జయజయ ! నామ సంకీర్తన ప్రచారక ! జయ-గంగాతీర విహారా !
ఆశ్రిత దుఃఖహరా ! జయీభవ ! దిగ్విజయీభవ !

తమ రూపం - శ్రీ శివానంద రూపం; తమ గాత్రం - నారద వీణా నినాదం ! తమ భజనా విధానం - శ్రీ చైతన్య మహాప్రభువుల దివ్య నృత్య సమానం; తమ గోష్ఠి మధురం. తమ నాశ్రయించుటయే ధన్యాతి ధన్యం తమ మార్గమే దివ్యజీవనం. అదే నేటి ప్రజకు శరణ్యం.

జయజయ దైవీ గుణమయా ! తత్త్వదర్శీ ! మహాభక్తా !
నామప్రియా ! జయజయ శిష్టాగ్రగణ్యా ! వరేణ్యా ! జయీభవ !

శ్రీశ్రీశ్రీ శివానంద యోగేశ్వర హృదయాకాశ - ఉత్తుంగ - గంగా - ప్రవాహమును వాడ వాడలకు, పల్లె పల్లెలకు అతి సామాన్యుని గుడిసెలో కూడా ప్రవహింపజేసిన భక్తి గంగా ప్రవాహ భగీరథా ! అస్మత్ స్వామీ ! జయీభవ !

'జయజయ విద్యావినయ సంపన్నా ! సమదర్శీ !
స్థితప్రజ్ఞ ! జయీభవ !'

తాము అనేక కష్టనష్టముల కోర్చి తాపత్రయములనధిగమించి "సత్సంగత్వే - నిస్సంగత్వం - నిస్సంగత్వే - నిర్మోహత్వం । నిర్మోహత్వే - నిశ్చలతత్త్వంనిశ్చలతత్త్వే జీవన్ముక్తిః". అనునట్లు సదాసాధు సత్పురుష సాంగత్యమును మహాపురుష సంశ్రయ సేవను, ప్రజాసేవను, స్వాధ్యాయమును కఠినమగు సన్యాస నియమమును భగవద్భక్తిని కలిగిన వైరాగ్యధనులు.

శ్రీశ్రీశ్రీ శివానంద సద్గురు స్వాముల వారినే అనన్య భక్తితో ఉపాసించిన మరొక ఆంజనేయులు. ఆ మహాపురుషుని సేవయే తపస్సుగా, వారి మాటనే వేదముగా వారి ఆచరణనే దీనజనావళికి తరుణోపాయముగా భావించి తమ జీవితమునే పై ఆదర్శములకు ధారవోసిన త్యాగమూర్తివి. సద్గుణ చక్రవర్తివి. మీ దృఢ దీక్షకు - మీ నిష్ఠకు - మీ ఓర్పుకు - మీ నేర్పుకు - మీ త్యాగమునకు మీ నిరాడంబరమునకు - మీ సేవాదృక్పథమునకు మీ చిరునగవునకు మీ గోవింద భజనకు - మీ భక్తికి. మీ ప్రచారమునకు - మీ ప్రేమకు - మీ వాత్సల్యమునకు మంగళం ; శుభమంగళం. మీ నామమునకు మీ రూపమునకు నిత్య జయ మంగళం ॥

"స్వామీ! సద్గురూ" మీ పిలుపున "పరుగు పరుగున రావోయి" అనిన బాలకృష్ణుడు పరుగెత్తును "అనాథనాథా దీనబంధో" అనిన చాలును కరుణా సముద్రుడు దయచూపును. "జయగణేశ జయగణేశ" పాహిమాం అనిన గణనాథుడు ముందుగ అనుగ్రహించును. "ఓం శివాయ నమశ్శివాయ" అనిన చాలు కైలాసనాధుడు తాండవదర్శన మొసగును. మీ "శ్రీరాం - జయరాం - జయజయరామ్" అనెడి భజనలో హనుమానుడు నర్తనము జేయును. మీ నృత్యమున ఆ శ్యామసుందరుడు అందరిలో తానై నర్తించును. ఆహా ఎంతటి అనుభూతి, ఏమి సౌభాగ్యము ఏమి మహాపురుష సాంగత్యము, సద్గురు దేవా ; ఏమి ఈ ఆనందము ఆహాహా; ఏమి ఈ మధురానందము ; అందుకే తాము శ్రీదేవానందులై బ్రహ్మానందము ననుభవింప జేయుచున్నారు.

---

Be indifferent to things that do not concern you.

—*Swami Sivananda*

ఓ మహర్షీ ! తాము శ్రీ శివానందరూపులై సిద్ధపురుషులగు శ్రీశ్రీశ్రీ చిదానంద సరస్వతీ గురుదేవుల వారసులై శ్రీ శివానందాశ్రమయోగి ప్రతినిధులై సనాతన భారతదేశ దివ్యజ్ఞానవారసులై శ్రీ శివానందవాణి ప్రచారకులై చిదానందులై, మాధవానందులై, చిన్మయానందులై, వివేకానందులై, సచ్చిదానందులై, హంసానందులై, జీవన్ముక్తానందులై, ఆధ్యాత్మానందులై, కృష్ణానందులై, బ్రహ్మానంద సంభరిత గోవిందులై వర్ధిల్లెదరుగాక !

మీ కరకమలములచే ఈ ప్రాంతమున ప్రారంభించబడిన శ్రీ గురుదేవ భక్త సమాజము అంకురితమై, పల్లవితమై, కోరికితమై పుష్పితమై నేడు ఫలితమైనది. ఈ రాజేరు ప్రాంతము గంగా ప్రవాహమున మునకవేసి ధన్యమైనది.

మీ జీవనము సహస్రచంద్ర దర్శనమై పశ్యేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం భవామ శరదశ్శతం అను వేద సూక్తిని నిజము చేయుగాక ! యని మీ పాదముల ప్రణమిల్లుతూ భక్తి శ్రద్ధలతో ఈ మహా సన్మానపత్రమును సమర్పించుచున్నాము.

ఇట్లు
**శ్రీ గురుదేవ భక్త సమాజము**
బి. రాజేరు.





# Song of Govinda by Swami Sivananda

| | | | |
|---|---|---|---|
| Rama Krishna | Govinda | Serve the parents | Govind |
| Radhe Krishna | ,, | Nurse the sick | ,, |
| Gopala Krishna | ,, | Do charity | ,, |
| Krishna Krishna | ,, | Be kind, be pure | ,, |
| Govinda Govinda | ,, | Be good, do good | ,, |
| God is truth | ,, | Be cheerful | ,, |
| God is Bliss | ,, | Be courageous | ,, |
| God is Peace | ,, | Be tolerant | ,, |
| God is knowledge | ,, | Be patient | ,, |
| God is Love | ,, | Be forgiving | ,, |
| God is Light | ,, | Be liberal | ,, |
| Control the mind | ,, | Be moderate | ,, |
| Control the senses | ,, | In eating, drinking | ,, |
| Realise the Self | ,, | In everything | ,, |
| This is the teaching | ,, | Be regular | ,, |
| Of all the Vedas | ,, | Get up at 4 a.m. | ,, |
| Of all the scriptures | ,, | Brahmamuhurta | ,, |
| Of all the Saints | ,, | Enquire. who am I ? | ,, |
| Of all the Sages | ,, | Do Vichara | ,, |
| Goal of life | ,, | This is very important | ,, |
| Is God-realisation | ,, | To attain success | ,, |
| Never forget this | ,, | There is no pleasure | ,, |
| Attain this | ,, | In the sensual objects | ,, |
| Through faith devotion | ,, | This is the world | ,, |
| Through meditation | ,, | Of pain and death | ,, |
| Through Sravan Manan | ,, | Do not be duped | ,, |
| Through Tapas Yoga | ,, | By the mind and senses | ,, |
| Through Mantra writing | ,, | Do not study | ,, |
| Through Likhit Japa | ,, | Herbert Spencer | ,, |
| Through selfless service | ,, | This will make you | ,, |
| Through Vivek Vichar | ,, | An atheist | ,, |
| Practice Ahimsa | ,, | This will produce | ,, |
| Speak the truth | ,, | Wrong Samskaras | ,, |
| Control anger | ,, | Study daily | ,, |
| Through Kshama | ,, | Gita Upanishads | ,, |
| Observe Mouna | ,, | This will help you | ,, |
| Serve, love, give | ,, | To realise the self | ,, |
| Serve the poor | ,, | Do not smoke | ,, |

---

The base for perfection is purity of heart. The zenith of perfection is knowledge of the self. —*Swami Sivananda*

Do not drink Govinda
Do not speak ,,
Vulgar words ,,
Do not take bribes ,,
This is bad ,,
This is very bad ,,
This is very very bad ,,
It will spoil ,,
Your name character ,,
This will throw you ,,
In lower birth ,,
To have a bad name ,,
Is more than death ,,
It is very shameful ,,
It is disgraceful ,,
It if ignominous ,,

It is heaven closing Govinda
Time is precious ,,
Do not waste a second ,,
Utilise it ,,
In Japa, Kirtan ,,
In meditation ,,
This is the divine life ,,
Lead a Divine Life ,,
If you follow ,,
These instructions ,,
You will attain ,,
Eternal peace ,,
Eternal Bliss ,,
Eternal Joy ,,
So says Sivananda ,,
Rama Krishna Govinda ,,

---

## జ్ఞాన గుళికలు

సర్వసాధారణముగా చాలామంది గురుభక్తులు మాయందు గురుకరుణలేక గుర్వనుగ్రహము లేదనియు చెప్పుచుందురు. మరియు వారు తమతమ సద్గురువులను దర్శించునపుడు "స్వామీ తమకరుణను మాయందుంచండి. తమ అనుగ్రహ దృష్టిని మాయందు ప్రసరించండి"యని వేడుకొనుచుందురు. ఈ విషయములో మనము దీర్ఘముగా ఆలోచించినచో, గురుకరుణ మనయందు కలుగకపోవుటకు కారణము ఆ దోషము మనదే. కాని సద్గురువులదికాదు. సద్గురువులెల్లప్పుడు కరుణాప్రపూరితులు, దయామయులు, అనుగ్రహ స్వభావులై యుందురు. వారి యనుగ్రహమును సంపాదించుటకు తగిన ప్రయత్నమును మనమే చేయవలసియుండును. అయస్కాంతము తనసమీపమునందున్న ఇనుమునంతటిని ఆకర్షించును కాని ఆ ఇనుము చుట్టూ ప్లాస్టిక్‌కాగితము చుట్టియుండినచో, దానిని తొలగించనంతవరకు, ఆ అయస్కాంత ప్రభావము ఇనుముకు లభించదు. అనగా మనలోనున్న దుర్గుణములను, సంకుచిత భావములను నిర్మూలనమొనర్చి మనస్సును శుద్ధముగానుంచవలెను. అపుడు మాత్రమే మనయందు గురుకరుణలేక గుర్వనుగ్రహము సక్రమముగా ప్రసరించును.

---

Brahman is the thread on which are strung all the worlds and all the beings.

*—Swami Sivananda*

ఓం

చిన్నస్వామిని నేసన్నుతింతు

# పద్యరత్నములు

రచన : భావకవి, జ్యోతిషవే

దూసి కృష్ణమూర్తి

కం॥ ఆరవతరగతి వరకును
ధీరుడు నారాయణాఖ్య ధీనిధి చెంతన్
పారాయణ ఉత్తీర్ణత
సారమతిన్ బ్రహ్మానందా శ్రమమున జేరెన్

సీ॥ పుంభావ హరిభక్తి పూర్ణుడౌ ప్రహ్లాదు
డవతార మందిట్లరుగు దెంచె
వరుణపాశంబున వగి బలిగట్టిన వామనుండీ
తల్లిపై కోపించి తపముచేయగ వచ్చు
ధ్రువుడు ఈ రూపమున దోచె నొక్క
మకరిని ఖండించి మరలి వచ్చిన చక్రభావంబు
ఈతడై ప్రబల నొక్కొ

తే॥ అనుచు ఆశ్రమవాసులు అబ్బురపడ
వామనాకార భక్తియు ఒక్క యోగిని
పట్టుదలయును విజిగీష నెట్టకొనగ
వచ్చునతనిని జూచిరి వరుసతోడ.

సీ॥ నగరాజు నగజాలు హిమవాలు తటమున
సిద్ధిమీరిన మహాసిద్ధ మఠము
శిష్య ప్రశిష్యులు జేరి కొల్చెడివాని
వేదాంత చర్చల వెలయువాని
శ్రీ శివానందునా జెలగు నామము వాని
మహరాజ మకుటంబు మలయు వాని

---

Atman or the Self is the illuminating principal in the intellect the perceiving principle in the mind and the life principle in the body.

—*Swami Sivananda*

దరిజేరపదముల కెరగి సన్నుతి జేయ
కరుణించి శిష్యుల గలసి కొనిన
భక్తితో సత్కర్మ శక్తితో అనురాగరక్తితో
స్వామిని అనుసరించి

తే॥గీ॥ భావసారూప సంధాన భద్రతయును
శిష్యసంఘంబు లోపల శ్రేష్ఠుడనగ
దివ్యసంపన్న అసమానదీక్షనలరి
స్వామి బంగరు బిడ్డ నాసలిపె పేరు.

సీ॥ ధన్యుడై జగదేకవంద్యుడై సత్కర్మగణ్యుడై
అవధూత రమ్యుడగుచు
సౌమ్యుడై వినయైక రమ్యుడై, దాతృత్వ
గమ్యుడై. భక్తి వినమ్రుడగుచు
బోధియై సత్కర్మ వీధియై వినయాదిగాధియై
పూర్ణ సంధాది యగుచు
భాషియై బహుభాషవేషియై, శిష్యుల
తోషియై, పతితుల మాషి యగుచు

తే॥గీ॥ దేవనందనునకు దేవతలెల్లరు
ఆయురస్తు భవతు అధికమస్తు
ఆత్మబోధ యనుచు యాశీర్వదింపంగ
స్వస్తిరస్తు నీకు శుభము శుభము

షష్టి పూర్తినాడు స్వామికి అర్పించు
పద్య సుమము లివియె, పాపహరణ
దూసి కృష్ణమూర్తి దొసగుల మన్నించి
అభయ హస్తమిచ్చి ఆదుకొనుడు
"ఓం సర్వేషాం సుజ్ఞాన సిద్ధిర్భూయాత్"

---

Investigation or Vichara is the seed capable of sprouting and flourishing as a great tree of happiness. —*Swami Sivananda*

ఓం

# పద్యరత్న చతుష్టయం

రచన : S. రామరాజు
సెక్రటరీ, దివ్యజీవనసంఘం,
విజయనగరం.

1. మనమందున్ మకరందధార, వచనంబా, నందనోద్యాన చందన, మాహ్లాదకరంబు, భక్తిరసమాధ్యాత్మానంద, సంధాయ కంబని, శిష్యోత్తములెల్ల మెచ్చెదరు, దేవానందునిన్ గొల్చి చక్కని ఆధ్యాత్మిక సిద్ధిసాధనకు, మార్గంబున్ ప్రబోధించగన్.

2. అనురాగంబును, భక్తిశాంతము, మహాత్యాగంబు, వైరాగ్యమున్, గని శిష్యోత్తముగా గ్రహించిన శివానందార్యు లానంద, నందనమందునే విహరించునట్లతని పాదాబ్జత సేవారతిన్ ఘనశాస్త్రార్థ రహస్యవేత్తయగు చిన్నస్వామి కీర్తించెదన్

3. బదిలోనన్ చదువంతలేదు, చిరతప్రాయంబునన్ భీతిగొల్పెడు, శీతాద్రి విశాల, సానువులపై పెక్కేండ్లు సద్భక్తి యొక్కెడు దీక్షన్ గురుసేవ జేయుచు, హృషీ కేశంబునన్ మౌనియై కడుశ్రద్ధన్ పలుశాస్త్రములు చదివె సంస్కారంబు దహింపగన్.

4. అకలంకషచిత్తవృత్తి, పరమాత్మని గొల్చుచు, సర్వ జీవ, తారకమగు, శక్తియొక్కటి పరాత్పరుడొక్కడె యంబు, నమ్మియూరక, మతభేదముల్ పెనుగులాటలు కక్షలు పెంచకుండగన్, సకలమతాలసారము ప్రచారము చేతురు దివ్యజీవనుల్.

---

Navigate thy ship of life with the compass-needle of thy mind always pointing towards God. —*Swami Sivananda*



## నిండు చిరునవ్వుల స్వామికి చిరు నివేదన

రచన :

**D. A. మైనర్**

### ముచ్చటగా మూడు పద్యాలు

తే॥గీ॥ జన్మదిన శుభాకాంక్షలు, సంతసముతో
అమిత మగు ప్రేమ భక్తి వైరాగ్యములతో
తమకు పంపుచున్నాము ధన్యచరిత
సన్మునీంద్ర దేవానంద సద్గురీంద్ర!

క॥ అరువది సంవత్సరములు
నిరపాయముగా గతించె నిర్మలుడగను స
ద్గురు దేవానందులకున్
పరమాయుర్దాయమునకు ప్రార్థింతు శివున్.

తే॥గీ॥ మౌక్తి కోత్సవ మధురిమల్ మరువలేము
దివ్య స్వర్ణోత్సవముల ప్రతిష్ఠ మరువబోము
షష్ఠిపూర్తి మహోత్సవం శ్రేష్ఠమైన
యజ్ఞముగను భావింతుమో యతివరేణ్య

ఓం తత్సత్

---

Unite the heart with mind and mind with speech when you pray.
—*Swami Sivananda*



# పద్య రత్నం

మరుదు రంగారావు M. A.
ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘం
అలుదు - 532 426
శ్రీకాకుళం జిల్లా

నిస్వార్థ సేవయు, నిర్మల ప్రేమయు,
మానితమౌ గుప్త దానగుణము,
పరిపూత భావముల్, ప్రతిఫలరహితమౌ
సతతదైవ ధ్యాన చారునిష్ఠ
పరమ జీవన లక్ష్య భగవద్విశిష్ట సా
క్షాత్కృతికై యవిశ్రాంత కృషియు
భవసాగరమ్మున బడలెడు నరులకు
తరుణ మార్గములను తరచితరచి

బోధచేసిన నిరుపమ పుణ్యమూర్తి ।
భగవదనుభూతి పరిమళ ప్రథిత కీర్తి ॥
అతికఠోర తపోఽగ్ని దీక్షానువర్తి ।
ఆర్పవే ! నాదు దుఃఖ దావానలార్తి ॥



Make God your guide when you walk on the path of life.
—*Swami Sivananda*



# వారి దివ్యసన్నిధి ఆనందమయం

వి. కృష్ణమూర్తి,
దివ్యజీవన సంఘశాఖ
నందినీనగర్, మధ్యప్రదేశ్.

పూజ్యస్వామి దేవానందులవారి **Diamond Jubilee** అత్యంత వైభవముగా జరుపుటకు నిశ్చయించినారని విని చాలా సంతోషించినాము. పూజ్యస్వామి దేవానంద- చిన్నస్వాములవారు ప్రేమస్వరూపులు, భక్తి, జ్ఞాన, వైరాగ్యములచే సుశోభితులు. వారి భజనలు, కీర్తనలు, హృదయములను పులకింపజేయునవి. భారతదేశమందంతటనూ వారి దర్శనార్థము భక్తులు పువ్విళ్ళూరుచుందురు. వారి దర్శనమాత్రముచే హృదయము ఆనందముతో నిండిపోవును.

శ్రీవారు వారి ఆరోగ్యమునుకూడ లెక్కచేయక, భక్తుల హృదయములలో భజన,కీర్తనలు జరిగినసంఘటనలు ఎన్నియోగలవు. ఆర్తితో వారిని ఆశ్రయించిన అనేకమందికి శాంతిని ఆనందమును ప్రసాదించిరి. వారి దివ్య సన్నిధిలో అనేక సమయములలో ఆనందముతో గడిపినరోజులు ఎన్నటికి మరువరానివి. వారు అత్యంత వినమ్రులు. వారి ప్రేమ దివ్యప్రేమ. చిన్న స్వామి- స్వామి శివానందుల అత్యంత ప్రియశిష్యులలో ఒకరను విషయము నిర్వివాదాంశము.

శ్రీ సద్గురు దేవులు చిన్నస్వాములవారికి దీర్ఘాయువును, ఆరోగ్యమును ప్రసాదించవలెనని వారి షష్ట్యబ్ది పూర్తి మహోత్సవ సందర్భముగా ప్రార్థించుచున్నాను.

---

Every sacred Mantra has in itself the potency of the Spirit.
—*Swami Sivananda*



# దేవానందస్వామి దివ్యవాత్సల్యతండ్రి

నాకు దేహమిచ్చినతండ్రి నన్నొదిలినా, నాలోన, బయట నా వెన్నంటుకొని కనురెప్పవలె కాపాడుచున్న దివ్యవాత్సల్యపితరుడు శ్రీశ్రీశ్రీదేవానంద స్వాములవారే. వారి దివ్యప్రేమను ఆకట్టుకొన్న అన్నిజీవులు ధన్యజీవులే. వారి కరుణాకటాక్ష ధారా ప్రవాహమువలె, వారు ఎల్లప్పుడు సుదీర్ఘ ఆరోగ్య నిత్యోత్సాహముతో విరాజిల్లుతూ, సర్వజీవుల ప్రియజనకుడుగా వర్ధిల్లాలని భగవంతుని సదా ప్రార్థించుచున్నాను.

పి. ఎస్. రాములు, (టీచర్)
మలేషియా.



---

# లీలావతారుడు శ్రీ దేవానంద

ఆనాటి ద్వాపరయుగంలో శ్రీ కృష్ణభగవానుడు గొల్లకులంలో పుట్టి, గొల్ల చద్ది తింటూ, గోపబాలురతో కలసి తిరుగుతూ తనయొక్క లీలా విభూతులద్వారా పరమాత్మగా ప్రకాశించారు.

ఈనాటి కలియుగంలో శ్రీ దేవానంద గురువులు ప్రకృతి వశులమైన మనమధ్య అతిసాధారణముగా సంచరిస్తూ, తన తపోశక్తిని మనకు మనస్సుద్వారా, మాటలద్వారా, పాటలద్వారా, చేతలద్వారా ప్రేమతో పంచుతూ, తన లీలా విభూతులతో అందరి హృదయాలలో ఆధ్యాత్మిక వెలుగును నింపుతూ మనజీవితాలను బ్రహ్మానందమయం చేస్తున్న సద్గురు శ్రీ దేవానంద స్వామీజీ పరిపూర్ణ ఆయురారోగ్యాలతో ఉండాలని మనసారా నిండు హృదయాలతో పరమాత్మను ప్రార్థిస్తున్నాము.

ఇట్లు
దివ్యజీవన సంఘ సభ్యులు
బిట్రగుంటశాఖ.

---

The world of multiplicity is reduced to single unity when one attains wisdom. —*Swami Sivananda*



# "నా ఎరుకలో మా చిన్నస్వామి"

ఎస్. రామరాజు
కార్యదర్శి, దివ్యజీవన సంఘము,
విజయనగరం.

శ్రీశ్రీశ్రీ పూజ్య దేవానంద స్వామి వారిని తలంచినపుడల్లా నాకు వామనావతారం స్ఫురిస్తూంటుంది. వామనుడు బలిచక్రవర్తి నుండి దానం గ్రహించు నప్పుడు పొట్టివాడైన వటుడు చూస్తూండగానే విశ్వమంతా తానేయై భూ, నభోంతరాలు తన రెండడుగులతో నాక్రమించి మూడవ అడుగుకు చోటు చూపలేక తన శిరస్సును స్వామికి సమర్పించ వలసి వస్తుంది - బలిచక్రవర్తికి.

ప్రాథమిక దశలో భక్తుడు పరమాత్మని తాను పూజించే విగ్రహావతారంగానో, పటములోని ఆరాధనా రూపంగానో దర్శిస్తాడు. భగవత్తత్వం అవగాహనయ్యే కొలది అణువుకంటె చిన్నదిగాను, అంతటా నిండినదిగాను, అన్నింటా యున్నది. అన్నీ తనలో కలదిగాను గోచరించి భక్తుడు తన్మయుం చెందుతాడు. అదే విశ్వరూపదర్శనం.

ఇదే జరిగింది శ్రీ దేవానంద సరస్వతీ స్వాముల విషయంలో నాకు. ప్రథమంగా శ్రీవారిని 1977 నవంబరు నెలలో దర్శించేను. క్రొత్తవాళ్ళను చూసినపుడు బోసినవ్వుతో చేతులు చాపే చంటి పిల్లవానివలె నోరార చిరునవ్వుతో శ్రీవారి ఆ పలకరింపు సర్వసమ్మోహనం. ఏదో అనిర్వచనీయమైన ఆకర్షణ. అపుడే విజయనగరంలో దివ్యజీవన సంఘ బ్రాంచిని నెలకొల్పుటకు నిర్ణయించి 1978 సెప్టెంబరు 8 వ తేదీన బ్రాంచిని నెలకొల్పుతున్నాము. శ్రీవారి సువర్ణ హస్తాలతో. విజయనగరం రాజా సాహెబ్ స్వర్గీయ డా॥ పి. వి. జి. రాజుగారి అధ్యక్షతన ఘనంగా 28-1-79 తేదీన ప్రారంభించబడింది. ఆనాడు శ్రీ శంకర కళ్యాణ మండపంలో జరిగిన సత్సంగ సభకు విచ్చేసిన అశేషభక్త సందోహం చూడవలసిందే. ఆ ఫోటో మన సావనీరులో ఉంది.

---

The spirit in man is the spirit of the universe. That Thou Art. Realise this and be free. —*Swami Sivananda*

1979 సెప్టెంబరు దివ్యజీవన సంఘాల అఖిల భారత సమ్మేళనానికి సతీసమే తంగా హాజరయి 10 రోజులు శ్రీ దేవానందుల సన్నిధిలో ఉండే భాగ్యం కలిగింది. అపుడే శ్రీ చిన్నస్వామి మరోప్రక్క దర్శనం అయింది. తెల్లవారు ఝామున సాధనా కార్యక్రమాలు, వివిధరాష్ట్రాల నుండి వచ్చిన భక్తుల సందర్శనాలు, పేరుపేరున వారి వారి భాషలలో పలకరింపు, రానివారి స్నేహితుల కుటుంబసభ్యుల యోగక్షేమాలడగడం, వారి అభ్యాసంలో వచ్చే సందేహాలకు సమాధానాలూ, హిందీలో, ఒరియాలో, గుజ రాతీలో యింకా నాకు అర్థం కాని అనేకానేక భాషలలో సాగిపోతూన్న ఆ సంభాషణలు. అహో యీ అయిదడుగుల స్వామి, మన తెలుగువారు (తెలుగు వాడికి తెలుగు వారు పలకన) యిన్ని భాషలు ఎపుడు నేర్చారో! ఇంగ్లీషు నాకంటె ముచ్చటగ వ్రాస్తారు, మాట్లాడుతారు, "అన్నపూర్ణ భవనంలో వారు భక్తులకు ఉపహారాలు, సమారాధనలు క్రమశిక్షణతో బారులుతీర్పించి కూర్చున్న వారితో సంకీర్తనలు చేయింపడం, ఆ దృశ్యం చూడవలసిందే!

ఎందరెందరో ఆశ్రమస్వాములున్నా, పరమ గురు శ్రీ స్వామి శివానంద సర స్వతీ మహరాజ్ వారి గురు కుటీరము శ్రీ స్వామిదేవానందులకు సంక్రమించడం ఆ పెద్దస్వామి వారి తపస్సు వారిచేత నామకరణం చేయబడిన ఈ "చిన్నస్వామి" వారి ద్వారా కొనసాగుతూ ఉన్నదన్నమాట. అందుకే ఆ తేజస్సు! మేమున్న ఒకరోజు రాత్రి 10.00 గం. లకు ఆ గురు కుటీరంలో, గంగామాయి కుటీర పావంచాలను చల్లగా స్పృశిస్తూయుంటే, మలయ మారుతం మెల్లన వీస్తూంటే, గంగానదికిరువైపులా హిమాలయ పర్వత శ్రేణులలోగల ఆశ్రమాల దీపపు వెలుతుర్లు మినుకు మినుకు మంటూంటే, పైననినీలాకాశం, పైన వినీలాకాశంలోని చంద్రదరహాసపు వెల్లువలో శ్రీ చిన్నస్వామివారు హార్మోనియం వాయిస్తూ సుమధురంగా సంకీర్తనం చేస్తూంటే అహో స్వర్గం అంటే యిదే అనిపించింది. స్వర్గంకంటె మిన్న! ఇది స్వామి వారి మరొక దర్శనం! ఇది మా ఎన్నోజన్మల సుకృతం!

ఈ మధ్య ఆరోగ్యం కొంచెం కుంటుపడిందని ఎవరికీ తెలియకుండావచ్చినా, ఎలా తెలుస్తుందో ఆశ్చర్యం! జనం విరగబడి వెల్లువలా వస్తున్న విషయం మనంద రికీ విదితమే, యిది మనప్రాంతపు ప్రత్యేకతయేకాదు, 1984-1990 మధ్యలో నేను

---

Brahman or the Absolute reveals itself to our senses in different forms, as diverse objects. *—Swami Sivananda*

హైద్రాబాదులో ఉన్నపుడు స్వామి వారు వచ్చేరంటే సంపన్నులు, మార్వారీలు, పెద్ద ఉద్యోగస్తులు, వాణిజ్యవేత్తలు కార్లలో బార్లు తీర్చి వచ్చి, మా యింటికి రమ్మంటే మా యింటికి రమ్మని మా ప్రాంతానికి వచ్చి అచ్చటి భక్తులకు కొంచం సేపైనా దర్శన మిమ్మని వత్తిడి, యిదే పరిస్థితి, ఇంకొంచం హెచ్చుగా ఒరిస్సా రాష్ట్రపు సునాబేడ, బర్హాంపూరులో చూసేను, అందరికీ అనునయంగా, నొరాదానవ్వుతూ స్వామి ఆ చెప్పే తీరు గమనించడమే నాకు తన్మయత్వం.

సభలు, సమావేశాలు, సాధనాతరగతులు స్వామివారు నిర్వహించేతీరు మేనేజిమెంటు కోర్సులు డిగ్రీలు పాసయిన వారు నేర్చుకోవలసిందెంతో ఉంది.

ఇక దేశవ్యాప్తంగా వారికి వచ్చే జాబులకు లెక్కలేదు. అయితే విశేషం హెడ్ క్వార్టర్సు ఋషికేశ్ లో ఉన్నపుడేకాదు. దేశాటనలో యున్నపుడు కూడా వచ్చిన ప్రతిజాబుకు తన స్వహస్తంతో గ్రీన్ ఇంకుతో ముచ్చటైన దస్తూరీలో ఎన్నెన్ని ఉత్తరాలు వ్రాస్తారో ఆ ఓపిక అత్యాశ్చర్యకరం!

ఇంకను వీరి దానాలు **DEVANANDA IS GIVEANANDA.** వచ్చిన ప్రతివారికి ప్రసాదం అందుతుంది. పిల్లలకు చాక్లెట్లు పెద్దలకు పళ్ళు, పుస్తకాలు, మహాత్ములకు వస్త్రాలు, ధనం తన దగ్గర ఏముంటే అది.

ఎన్నని వర్ణించగలను, స్థలాభావం, మరియు నేను కవిని కాను. అయినా నా అనుభవం మీ ముందుంచాలనే ఆర్తి. ఈ వామన స్వామి పూర్ణాయురారోగ్యాలతో మనందరికీ ఆత్మానుభవానికి దిక్సూచిగా ద్వితీయ షష్ట్యబ్ది ఉత్సవాలను జరుపుకునే భాగ్యం ప్రసాదించాలని లక్ష్మణ హనుమత్ సమేత శ్రీ సీతారాములను ప్రార్థిస్తాను

జై శ్రీ దేవానంద.



A man without character is really dead, though he lives.

—*Swami Sivananda*



# ఆధ్యాత్మిక వనంలో 'వనమాలి'

ఈ జీవన ప్రయాణంలో అనేకానేకులయిన మహాత్ములతో పరిచయాలు. ఆధ్యాత్మిక సుధావనంలో ఒక తేజస్వి మహిమాన్విత శక్తి సంపన్నుడు. నీ జీవితంలో సుధా తరంగాలు వర్షింపచేయడానికి నేనున్నాను సుమా! అంటూ విచిత్ర పరిస్థితులలో "చిన్నస్వామి"గా ప్రత్యక్షమయ్యారు. ఇంకేముంది ఆధ్యాత్మిక సుధాతరంగాలు ఉవ్వెత్తున ఎగిసిపడేలా చేసింది. ఒకవైపు దివ్యప్రబోధాలు, మరోవైపు పుస్తక రూపంలో జ్ఞానయజ్ఞప్రసాదం శరపరంపర విరివిగా కొనసాగింది. మానవుడు మాధవుడుగా మారడానికి, "నేను" అనేది తొలగించుకోగలిగితే లభించేడి తాదాత్మ్యత, సార్వజనీన ప్రేమలో రేకెత్తెడి మధురానుభూతులు ఈ జీవితం భగవత్ప్రీకరపుష్పంగా మారడానికి శ్రీవారొసంగిన ప్రసంగాలు మనస్సును పట్టిపీడించే కోరికలు, శరీరాన్ని పీడించేరోగాలు మొదటిదాన్ని కోరికలనుండి మనస్సును విముక్తంగావిస్తే ఆ మనస్సు మాధవసేవలో పరిణతి చెందిననాడు భవరోగాలకు అతీతంగా లభించే దివ్యానుభూతులు ఈ జీవనయానంలో, ఈ జీవాత్మలో ఎగిసిపడుతున్న సుధాతరంగాలకు సృష్టికర్త శ్రీ చిన్నస్వామి, పెద్దస్వామికి ప్రతిరూపం.

ఒకవార్త అంతరాంతరాళాలలో పెనుదుమారం లేపింది. శ్రీవారి ఆరోగ్య పరిస్థితి భక్తజనావళిని కృంగదీపింది. ఆ సంకీర్తన స్వామి గాన మురళీరవం సుమనోహర దృశ్యమాలిక కావాలి. నిత్యం ఎల్లవేళలాకూడా అందరికి. అందరి హృదయాలు భగవదర్పితమయ్యాయి ప్రార్థనలు ఫలించాయి. మా స్వామి నిత్య మనోహరుడుగా ఎల్లవేళలా మాముందుండాలి. అదే సత్యమయింది.

భగవాన్ ! మా నిరంతర దేదీప్యమాన ఆధ్యాత్మిక సుధావనంలో సుధాపుష్పాలను వికసింపచేయడానికి తోటమాలి కావాలికదా ! ఆ సుధాపుష్పాల పరిమళాలను ఆఘ్రాణించుటకు ఆయన మాకోసమేగా ప్రభూ ! వేచియున్నది. ఆయన మా మనోబృందావనంలో వనమాలి. ఆయనను తోటమాలిగా సంబోధించడం మాకిష్టంలేదు

---

Ethical perfection is the basic requisite for spiritual attainment.

—*Swami Sivananda*

ఆయన సంకీర్తనస్వామి ఆర్తిని బాపెడి స్వామి. మనస్సును రంజింపచేసెడి "వనమాలి". మనందరి హృదయాలను పరవశింపచేసెడి చిన్నస్వామి.

చిన్నస్వామివారికి అరవై వసంతాలు నిండాయి. ఈ జీవాత్మలో ఆధ్యాత్మికబీజం శ్రీవారిచే నాటబడి అష్టాదశ వర్షములు పూర్తయినాయి. ప్రతివసంతంలోకూడా శ్రీవారి సంకీర్తనారవం అందరికి లభించేలా, మనందరం తరించేలా మనస్వామి పరిపూర్ణాయు రారోగ్యాలతో ఉండాలని ప్రార్థిద్దాం. వేడుకుందాం.

శ్రీ దేవానంద స్వామివారికి ఈ జీవుడు అర్పించేది, ఆకాంక్షించేది షష్టిపూర్తి మహోత్సవం రంగరంగ వైభవంగా జరగాలని ముకుళిత హస్తాలతో నివేదన.

నందహరి విద్యాసాగర్
రెడ్డిపల్లి.



Open the gates of wisdom Tear the veil of ignorance. Enter he abode of bliss and rest in peace forever. —*Swami Sivananda*

# గురు పూజకు విరిమాల

సద్గురు దేవానంద ప్రభో మా సేవలు గొనుమా దేవా ....
సద్గతి పొందే మార్గము మాకు చూపిన మహానుభావా .... ॥సద్గురు॥

1. భవసాగరమును దాటగ నీవు - భయమును తొలగించేవు
దివిలో నుండీ భువికేతెంచిన - దేవుడవయ్యా నీవు.... ॥సద్గురు॥

2. వేదసారము గీతారహస్యము - బోధలు జేసితివయ్యా.... ఆ
మాధుర్యము మాకందించి మా - బాధలు బాపితివయ్యా.... ॥సద్గురు॥

3. ఆధ్యాత్మిక ప్రబోధ గ్రంథమున - ఆత్మబోధ చాటేవు
ఆధ్యాత్మికమౌ బీజములను మా - యందరిలో నాటేవు .... ॥సద్గురు॥

4. దీన జనులపై దయతో ఎన్నో - దానములను జేసేవు
మానవసేవయే మాధవ సేవని - మా కెరిగించితి వీవు .... ॥సద్గురు॥

5. కర్మభక్తి జ్ఞానాది మార్గముల - మర్మము నెరిగించేవు
ధర్మ పథములో పయనించి నిష్కర్మ సేవ చేసేవు .... ॥సద్గురు॥

6. గంభీరముగ ఉపన్యాసములు - గంటలు తరబడి నీవు
శంభోశంకర శౌరిహరీయని - సంకీర్తన జేసేవు .... ॥సద్గురు॥

7. దిగంతములు భూమ్యాకాశమ్ముల - నిండెను నీదగు కీర్తి
జగమంతయు వ్యాపించెనులే నీ - బోధలు నిర్మలమూర్తి .... ॥సద్గురు॥

8. నిత్య సచ్చిదానంద స్వరూపము - నిర్మల హృదయుడవీవు
సత్యధర్మ సన్మార్గ వర్తనము - సదాబోధ చేసేవు .... ॥సద్గురు॥

9. ఇహ పరసుఖముల కాధారముగా నీ - పాదపద్మములెగావా
మహిలో నీపద ధూళి తాకిన - ముక్తికి అదియే త్రోవా ... ॥సద్గురు॥

10. మల్లి జాజి మందార మాలలు - మెడలో వేసిన సుమ్మ
చల్లనైన నీ చిరునగు మోమున - దీవించగ త్వరగా రమ్మ.... ॥సద్గురు॥

11. వ్యాస పౌర్ణమి దినమున నీ పద - పూజలు చేసితి మయ్యా
దోసిలొగ్గితిమి దోషములున్న - దయతో బ్రోవగదయ్యా .... ॥సద్గురు॥

12. ధర చిన మానా పురవాసులకు - దైవ జ్ఞానము నిమ్మా
వర కవి ఎర్నాయుని విరచితమౌ - విరిమాలను గైకొమ్మా.... ॥సద్గురు॥

రచన : రంభశ్రీ M.A.
తెలుగు పండిట్, చినమానాపురము

---

God reveals Himself only to him who makes a sincere effort to realise Him.
—*Swami Sivananda*



# శ్రీ సద్గురు స్తుతి

"సహజకవి" మెలుగు వెంకటదాసు
బి. యన్. తిమ్మాపురం, రుస్తాపురం P. O.
మం. భువనగిరి - 508 116, జి. నల్లగొండ.

కం. శ్రీ దేవానందుల యతి
పాదంబులకంజ లించిప్రస్తుతిజేతున్
సాధుజనంబుల హృదయా
హ్లాద భరితుడైన యట్టి యనఘ చరిత్రున్.

ఉ. ప్రేమమయుండవీవు నిజప్రేమయె నీదగు దివ్యమూర్తియున్
ప్రేమ సమస్త జీవులకు పెట్టుదువయ్య అనంతభిక్షయున్
ప్రేమయె నీదు వాక్కులును ప్రేమవియన్నది తావకీ మహో
ద్ధామమునన్ చరించు నిజ తాపసవర్యనుతించి మ్రొక్కెదన్

కం. అరిషడ్వర్గ విదూరా!
కరుణారస పూర్ణహృదయ! కామితజన! సు
స్థిర ప్రజ్ఞాన విశేషా!
పరమాద్భుత దివ్య చరిత! ప్రణతులొనర్తున్

కం. మకరందరసోక్తులచే
ప్రకటించి వచింతువయ్య పరమార్ధంబున్
సకల జనంబుల హృదయో
త్సుకమైనిఖిలార్థశాస్త్ర శోభితను డులన్

ఉ. చూచితి తాకాశ్రమము చూచితి గంగతరంగభంగిమ
చూచితి సద్గురోత్తముని శోభిత నిర్మలమౌ కుటీరమున్
చూచితి దివ్యహర్మ్యముల సుందరమున్, వివిధావనీజముల్
చూచితి తావకీన కృపచొప్పున దివ్య హిమాచలాగ్రమున్

Death is the entrance gate to Life Immortal.

—*Swami Sivananda.*

ఓం

# శ్రీశ్రీశ్రీ పరమపూజ్య దేవానంద సరస్వతీ మహారాజ్ స్వామి షష్ట్యబ్దోత్సవసందర్భమున భక్తితో సమర్పించిన పంచాక్షర సుమాల

శ్రీ రామనామ మంత్రము
శ్రీరమ్యత గూర్చి భజనచేసిర సిద్ధున్
ఆరోగ్యాయువు నిచ్చుచు
మారాముడు బ్రోచుగాక అవిశము భువిలో

దేవానందము గూర్చిన
భావంబున భజన చేయు పగిదిని చెప్పెన్
జీవాత్మల సూత్రధారిగ
భాగ్యంబున పెద్దస్వామి భువిభక్తులకున్.

వాక్కున మంత్ర వినోదము
ఋక్కుల యర్థంబుఁ దెల్పు ఋతమగు బోధల్,
దిక్కులలో నింపే స్వామి
పెక్కగు కాలంబు నుండ ప్రార్థింతు మదిన్

నందిత భజనాసక్తుని
పొందిన చినస్వామి నామపూర్ణాత్మ శివానందుని
భజమన చిత్తుని
నందాత్ముడు బ్రోచుగాక శతహాయనముల్

దమమును శాంతిని దాంతిని
సమలంకృతమైన భక్తి సాక్షికి నిధియై
హిమలయ నాధుని రీతిగ
ఈమహిలో నిలచుగాక ఈశుని కృపచే.

- శ్రీ ప్రసాద కొండలరావుగారు

---

The earth is the foothold of God. —*Swami Sivananda*

ఓం తత్సత్

# పూజనీయు ! దేవానంద - చిన్నస్వామి

గీ॥ త్యాగమయుడవు, తత్త్వ ప్రబోధకుడవు
ప్రేమమూర్తివి - నిర్మల మానసుడవు
ఆత్మవిదుడవు - ఆదర్శమూర్తి వీవు
పూజనీయ - దేవానంద చిన్నస్వామీ ॥

నీకు జోహార్లు సద్గురు దేవ దేవ
నీకు జేజేలు మహనీయ పుణ్యచరిత
నీకు ప్రణతులు - సంకీర్తన స్వామి నీకు
నీకు మ్రొక్కులు - దేవానంద చిన్నస్వామి ॥

వచనం : మదీయ హృదయాంతర్వాసా !
శ్రీవారికి నేటికి 60 సం॥ ముగియుచున్నవి.
శ్రీవారిని చూస్తే, శ్రీ గాంధీ మహాత్ముడు జ్ఞప్తికివస్తారు.

పద్యం: "ముంగాళ్ళ దాటని ముందుకో నూలు ఖద్దరు పుట్టమా,
నీకు భూషణంబు,
మెత్తని నెమ్మయి నేలపండుకొనుటకు పూలపాన్పు నీకు,
కృంగి కృశించు హైందవ కోటికెల్ల
నీ జ్ఞాన ప్రబోధ, వేణుదండమే ఊత మహాత్మా"

చరణదాసుడు
పసగాడ సూర్యనారాయణ
రిటైర్డు హెడ్ మాష్టరు
డెంకాడ,

---

Raga, Dvesha and Bhaya (attachment, repulsion and fear) are the product of ignorance. —*Swami Sivananda*



# పరమపూజ్య శ్రీ శ్రీ శ్రీ దేవానంద సరస్వతీ మహరాజ్ వారి షష్ఠ్యబ్దిపూర్తి మహోత్సవములు

విజయనగరము ఫిబ్రవరి 28

విజయనగరం దివ్యజీవన సంఘము బ్రాంచి, శ్రీ శంకరమఠం మరియు ధర్మ రక్షణ పరిషత్ సమిష్టి ఆధ్వర్యంలో విజయనగరము శంకర కళ్యాణ మండపములో ఫిబ్రవరి 28వ తేదీన కనుల వైకుంఠంగా పరమపూజ్య శ్రీ శ్రీ శ్రీ దేవానంద సరస్వతీ స్వాముల షష్ట్యబ్ది పూర్తి మహోత్సవం పేరొందిన వేదపండితుల ఆధ్వర్యంలో జరిగింది.

వేకువఝామున బ్రాహ్మి ముహూర్తంలో గం॥ 4-30 లకు గణపతిహోమము ప్రారంభింపబడి సూర్యోదయానికి ముందు సమాప్తి గావింపబడినది.

శ్రీ స్వామివారిని శంకరమఠాధ్యక్షులు శ్రీ పి. వి. నరసింహరాజుగారు (బుచ్చిబాబు) బుడతనపల్లి నుండి తోడ్కొనిరాగా ఉదయం గం॥ 8-00 లకు. శంకరమఠం ద్వారమువద్ద 12 మంది ఋత్విక్కులు వేదాశీర్వచనములతో పూర్ణ కుంభంతో సాదరంగా స్వాగతించగా వందలాది భక్తజన సందోహము జయ జయ ధ్వానాలు చేసేరు, శ్రీ స్వామీజీ పరమాచార్య శ్రీ చంద్రశేఖర సరస్వతివారు ప్రతిష్ఠించిన శ్రీ ఆదిశంకరుని సేవించుకున్నతరువాత పండితులతో ఏర్పాటుకాబడ్డ మహాలింగార్చన, సూర్య నమస్కారములు, ఆయుష్య హోమంలో పాల్గొన్నారు. ఈ మూడు వేదోక్తకార్యాలు జనసందోహము భక్తి ప్రపత్తులతో వీక్షిస్తుండగా శ్రీ స్వామీజీ గం॥ 8-00 ల నుండి మధ్యాహ్నము గం॥ 1-00 ల వరకు ఏకాసనాశీనులై పాల్గొన్నారు.

**సూర్య నమస్కారములు :-** వేదాధ్యాయనాపరులైన నలువురు బ్రహ్మచారులు నాల్గు దిక్కులలో నిలుచుండి వేదమూర్తులు ప్రవచనం చేస్తుండగా సుమారు రెండుగంటలు పైబడి సూర్యోపాసనను గావించేరు.

**మహాలింగార్చన :-** 360 లింగాకృతులనేర్పరచి ఏకకాలమందు మహాలింగార్చన గావింపడమైనది.

---

Enter the kingdom of the Lord through the gate of sacrifice.
—*Swami Sivananda*



8-6-87 సాయం సంధ్యాసమయంలో జరుపబడిన గంగా ఆరతికి ముందుగా శ్రీ దేవానంద స్వాములవారు గంగాదేవిని అర్చిస్తూ ఉన్నారు.



విజయనగరంలో శ్రీ దేవానంద స్వామి షష్ఠిపూర్తి మహోత్సవంలో వేద పండితులమధ్య శ్రీ స్వామీజీ.

శ్రీ స్వామీజీవారి పూర్ణాయురారోగ్యాల నాకాంక్షిస్తూ ఆయుష్య హోమము జరిపించబడింది. ఈ వేదప్రక్రియ యావత్తు ప్రముఖ వేదఘనాపాఠి శ్రీ వడ్లమాని నరశింహశాస్త్రి (గరివిడి సిద్ధాంతి) గారి ఆధ్వర్యంలో నిర్వహించబడింది. మరియు యజ్ఞం నిర్వహించిన, నిత్యాగ్నిహోత్ర ఉపాసనాపరులు శ్రీ గంటిరాజ సోమయాజులు గారు హోమనిర్వహణ గావించేరు. సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ ఋగ్వేద పండితులు శ్రీ యనమండ్ర సూర్యనారాయణ అవధానిగారు, సామవేద పండితులు, సామవేద లెక్చరర్ శ్రీ సామవేదం గోవిందశర్మగారు వేదప్రవచనాలు చేసేరు.

గం॥ 1-00 కు పూర్ణాహుతి, తీర్థప్రసాద వినియోగం భక్తులందరికి జరిగింది. లదుపరి ఈ కార్యక్రమమునకు వచ్చిన భక్తులందరికి పులిహోర, బూరెలు. పూత చుట్టలు, రెండుకూరలుతో షడ్రసోపేతమైన విందుచేయడమైనది. విందును శ్రీ నిమ్మగడ్డ రంగారావుగారు వారితల్లిగారి పేరున ఏర్పరచిరి.

సాయంత్రం గం॥ 4-00 లకు విజయనగరము దివ్యజీవన సంఘ కార్యాలయమునకు శ్రీ స్వామీజీ విచ్చేసి శ్రీ స్వామి శివానందుల తైలవర్ణ చిత్రానికి పూజలుచేసి కొంతసేపు సంకీర్తన చేయించేరు. అచ్చటనుండి భక్తుల జయజయ ధ్వానాలతో శంకర మఠానికి విచ్చేసి సత్సంగకార్యక్రమము జరిపించేరు. కార్యక్రమానికి షుమారు రెండు వేలమంది పురజనులు విచ్చేసారు. సత్సంగసభకు ధర్మరక్షణ పరిషత్ అధ్యక్షులు శ్రీ ఆర్. ఆర్. కృష్ణగారు అధ్యక్షత వహించేరు. జరజాపుపేట ఆశ్రయాధిపతి శ్రీస్వామిని జ్యోతిర్మయానందగారు, బోనంగి ఆశ్రమాధ్యక్షులు శ్రీస్వామిని బ్రహ్మచారిణిగారు వేదికనలంకరించి ఆధ్యాత్మికోపన్యాసములిచ్చేరు.

**సువర్ణపుష్పాభిషేకం** :- దివ్యజీవన సంఘము విజయనగము బ్రాంచి, ధర్మరక్షణ పరిషత్ మరియు శ్రీ శంకరమఠమునుండి 16 మంది ప్రముఖ భక్తులచే, వేదపండితులు వేదాలు వల్లిస్తుండగా బంగారు పుష్పాలును ముందుగా శ్రీ శివానంద గురుదేవుల పాదుకలను అర్చించి తదుపరివాటితో శ్రీ దేవానంద సరస్వతీస్వాముల వారిని అభిషేకించిరి. శ్రీ పుళిరికల చంద్రశేఖర్‌గారు శ్రీ స్వామివారి పాదపూజచేసేరు,

మహారాజ మోడల్ హైస్కూల్ 150 మంది విద్యార్థులకు స్వామీజీ శ్రీస్వామి శివానందులచే రచింపబడి తెనిగింపబడిన "ఆధ్యాత్మిక కధలు" పుస్తకములు, బాల్ పెన్నులు, చాకెలెట్లు పంచారు.

---

When the external pleasures are renounced, internal bliss is realised.
—*Swami Sivananda*

శ్రీ స్వామీజీ ఉదయము హోమాదిజపాలు నిర్వహించిన వేద పండితులు 16 మందికి శాలువాలు, శిల్కు కండువాలు, రుద్రాక్షమాలలు, ఆధ్యాత్మిక గ్రంథాలు, బాల్ పెన్నులు, నగదు బహుమానాన్ని ఇచ్చి ఘనంగా సత్కరించి వారి వేదస్వస్తి ఆశీర్వచనాల్ని పొందేరు. కార్యకర్తలందరికి శ్రీవారి స్వహస్తాలతో సిల్కు కండువాలు, రుద్రాక్ష మాలలు, ఆధ్యాత్మిక గ్రంథాలు బహూకరించి ఆశీర్వదించారు.

తదుపరి శ్రీ స్వామీజీ గోవిందా ! గోవిందా ! యని ఆధ్యాత్మిక జీవనాన్ని గడుపవలసిన విధానాల్ని సూచించే సంకీర్తన చేయించి మానవుడు మాధవుడుగా మారగల విధానాల్ని సూచిస్తూ ఉపన్యసించేరు. రాత్రి గం॥ 8-00 లకు శ్రీ స్వామి వారికి అసంఖ్యాక భక్త సమూహముయొక్క వీడ్కోలుతో నాటి కార్యక్రమము ముగిసింది.

చిరకాలము జ్ఞాపకముండగల ఈ కార్యక్రమాన్ని రూపొందించి నిర్వహించిన శ్రీ గన్నవరపు నరసింహంగారి అపూర్వశక్తి సామర్థ్యములు చిరస్మరణీయము. వారికి సహకరించిన శ్రీ పప్పు చక్రపాణిగారు అభినందనీయులు, కార్యదక్షులై సమాదరించిన శంకరమఠం అధ్యక్షులు శ్రీ పి. వి. నరసింహరాజు గారి సేవలు ప్రశంసనీయము. కార్యక్రమంలో పాల్గొని విజయవంతం చేసిన విజయనగరం దివ్యజీవన శాఖ సభ్యులు ధన్యులు. అంతా స్వామీజీ శ్రీ దేవానంద - చిన్నస్వాముల కృపావిశేషం.

ఈ సందర్భాన్ని పురస్కరించుకొని దివ్యజీవనసంఘ ఉపాధ్యక్షులు శ్రీ కె. వి. రమణమూర్తి గారు శ్రీ స్వామి శివానంద సరస్వతీవారిని, శ్రీ స్వామి చిదానంద సరస్వతీ స్వామిని, శ్రీ స్వామి దేవానంద సరస్వతీ స్వామివారిని ప్రస్తుతిస్తు వ్రాసిన పద్యమాలను సమర్పించేరు.

బట్టల టోకువ్యాపారస్థుల అధ్యక్షులు శ్రీ వై. సంగయ్యగారు వందనసమర్పణ గావించేరు.

ఎస్ రామరాజు

కార్యదర్శి, దివ్యజీవన సంఘం,

విజయనగరము.

---

Religion starts with fear, passes through love and adoration and culminates in the union with the Lord. —*Swami Sivananda*

# పరమపూజ్య శ్రీశ్రీశ్రీ దేవానంద సరస్వతీ మహరాజ్ వారి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవములు

శివానంద ధర్మక్షేత్రము లయిదాంలో

ఒక షష్టిపూర్తి భవనము ఆరు దశాబ్దములకు చిహ్నముగ ఆరు గదులతో నిర్మింపబడి పూజ్యస్వామీజీగారి పవిత్రహస్తములతో 29-11-96 తేదీని ప్రారంభోత్సవము గావింపబడినది. తే 24-11-96 తే నుండి తే 31-11-96 ది వరకు పూజ్యశ్రీ స్వామీ దేవానందజీ మహరాజ్ గారి ఆధ్వర్యమున సాధనాసప్తాహము జరుపబడినది. పూజ్యస్వామీజీగారు ఇచ్చట వున్న దినములలో ప్రతి దినము 400 మంది భక్తుల నుండి వేయి మంది వరకు దర్శించుకొనుచుండిరి.

తే 1-12-96 ది న స్వామీజీ గారికి షష్ట్యబ్దిపూర్తి మహోత్సవము జరుపబడినది. తెల్లవారుఝాము 4 గంటలకు పరమపవిత్ర స్వామీజీగారికి సముద్రజలము, గంగాజలము, వంశధార నదిజలము, నాగావళి నదిజలము, స్థానికముగా లభించే పవిత్రజలములచే అత్తరు పన్నీరులతో అభిషేకము గావింపబడినది. పిమ్మట స్వామీజీగారు జపధ్యానములు చేసుకొని, మంత్ర దీక్షల నిచ్చిరి.

తరువాత స్వామీజీగారిని భక్తులు పూలమాలాలంకృతులను చేసిరి. దివ్యముగా అలంకరింపబడిన పల్లకిపై స్వామీజీగారిని కూర్చుండజేసి గ్రామమంతయు ఊరేగింపు జరిపిరి. బేండు మేళములవారు వీనులవిందైన సంగీతముతో ముందు నడచిరి. అనేకమంది భక్తులు నాలుగైదు బృందములుగా ఏర్పడి సంకీర్తనలు చేసిరి. భక్తులు పల్లకిని తమభుజములపై ఇడుకొని ఊరేగించిరి. ఎంతో కోలాహలముగా సుమారు వేయిమంది భక్తులతో సుమారు రెండుగంటల కాలము గ్రామములోని ముఖ్యవీథులలో ఊరేగింపు జరిగినది. ఈ సందర్భముగ గ్రామములోని జనులందరు ఫలపుష్పములతో కానుకలతో శ్రీస్వామీజీగారిని సత్కరించిరి. స్వామిజీగారుకూడ విరామము లేకుండ ప్రజలందరకు ప్రసాదము అందజేసిరి.

---

Why do you strive and struggle for the fleeting powers of the world. Become the monarch of the universe by attaining knowledge of the Self. —*Swami Sivananda*

పూజ్యశ్రీ స్వామిజీగారిని దర్శించుటకు శ్రీకాకుళంజిల్లా, విజయ నగరంజిల్లా, ఒరిస్సాలోని గజపతిజిల్లా, గంజాము జిల్లాల నుండి సుమారు ఐదువేలమంది భక్తులకు పైగా విచ్చేసిరి. పెద్ద బహిరంగ సభ ఏర్పాటు చేయబడినది. జిల్లాలోని దివ్యజీవన సంఘ బ్రాంచీల వారు ఇతర భక్తులు స్వామీజీగారిని పూలమాలలతో, వస్త్రములతో సన్మానించిరి.

శ్రీ అధికార్ల నీలకంఠంగారు, శ్రీ బొడ్డేపల్లి అప్పలనాయుడుగారు షష్ట్యబ్ది పూర్తి సందర్భముగ స్వామీజీగారిపై అనేకపద్యములు వ్రాసి గానము చేసిరి. శ్రీ శివానంద ఆశ్రమ పాఠశాల పిల్లలు స్వామీజీగారిపై పాటలు పాడిరి. భక్తులు వారి సందేశముల నందజేసిరి. పూజ్యశ్రీ దయానంద సరస్వతిగారు, పూజ్యశ్రీ అభేదానంద స్వామిగారు, పూజ్యశ్రీ సుబ్బరామ స్వామిగారు, మున్నగు మహాత్ములు కార్యక్రమమునకు విచ్చేసిరి. శ్రీ గొర్లె రామనాయుడు దంపతులచే స్వామిజీగారికి పాదపూజ జరుపబడినది.

స్వామిజీగారు భక్తులందరికి ధన్యవాదములు తెలుపుచు ఆశీర్వచన పూర్వకముగ ఉపన్యసించిరి.

పిమ్మట స్వామీజీగారు మధ్యాహ్నము 3 గం॥ సమయములో బయలుదేరి సిరిపురం, మండాకురిటి, అన్నం రాజపురం, సురవరం, మామిడి పల్లి గ్రామములను సందర్శించిరి. ఆయా గ్రామములందలి భక్తులు బేండు మేళములతో స్వామిగారికి ఎదురేగి, పెద్దబహిరంగ సమావేశములనుఏర్పాటు చేసిరి. స్వామిగారు ప్రతిగ్రామమునందు కూడ సమావేశములో పాల్గొని తమ మధురమైన సంకీర్తనములచే, తేనె లొలుకు తీయనిమాటలచే ఆయా భక్తులను ఆనందింపజేసి రాజాం మీదుగా విజయనగరము చేరుకొనిరి.

భక్తులందరు ఈ ఉత్సవమును కన్నుల పండువుగాగాంచి పరవశులైరి.

రామచంద్రరావు
శివానంద ధర్మక్షేత్రము
లయిదాం. 532168

---

There is a power, invisible and universal, immortal and original, ineffable and transcendental. That power is God.
—*Swami Sivananda*



# శ్రీ దేవానంద చిన్న స్వాములవారి

కుంభం



(చిరంజీవి గుత్తపూడి సన్నిబాబు)

## జననకాల వివరములు-సంక్షిప్త జాతకము



### జనన కాలము

స్వస్తి శ్రీ ఈశ్వరనామ సంవత్సర జ్యేష్ఠ శుక్ల పక్ష ఏకాదశి (నిర్జల ఏకాదశి) శనివారము సమయము షుమారు అర్ధరాత్రి

తేదీ 19-6-1937

### సంక్షిప్త జాతకము

| | | | |
|---|---|---|---|
| శ 12-57 | శు 19-54 | బు 17-27<br>కే 23-04 | ర 6-30 |
| ల 26-07 | | | |
| గు<br>4—.<br>XII 27-09 | రాశి | | |
| XI 28-11 | రా 23-04<br>X 29-13 | కు 29-31<br>చం 20-34 | |

గురుదశా శేషము 15-3-25
సం. మా. రో.

Without dispassion there can be no spirituality.
—*Swami Sivananda*

లగ్నము కుంభమై లగ్నాధిపతి శని ద్వితీయ క్షేత్రమగు మీనమున స్వనక్షత్ర గతుడై యుండుట, గురువు వ్యయమందుండుట, చంద్రుడు భాగ్యభావమున అన్య గ్రహ సంబంధరహితుడై యుండుట, సన్న్యాస రాజయోగములను సూచించుచున్నవి. చతుర్థమందలి బుధకేతువులు గురుదృష్టి కలిగియుండుట కూడా ప్రాపంచిక విషయ వైముఖ్యతను సూచించుచున్నది, దశమాధిపతి కుజుడు భావచక్రమున దశమ భావము నందేయుండి రుచకయోగకారకుడై యుండుట ఆధ్యాత్మిక ఉన్నతికి, కీర్తి ప్రతిష్ఠలకు ప్రబల దోహదకారియగును. అష్టమాధిపతి బుధుడు చతుర్థ కేంద్రమగు గురు దృష్టిని కలిగియుండుట తృతీయమందు శుక్రుని స్థితి, గురునకు చంద్రుడు కేంద్రము నందుండుట, చంద్ర కేంద్రమునకు చతుర్ధ సప్తములందు వరుసగా గురు శుక్రు లుండుట, జాతకునికి పూర్ణాయుర్దాయమును ప్రసాదించుచున్నవి. పంచమ కోణము నందలి రవి స్థితి బుధుని చతుర్ధ జాతకుని సునిశిత ప్రజ్ఞను సూచించును. ప్రస్తుతం బుధ దశలో శన్యంతరము జరుగుచున్నది.

1988 అక్టోబరు 14 తర్వాత కీర్తిదశ ప్రారంభమగును. ఈ దశయందు గురు దేవుల అనుగ్రహం వలన ఆధ్యాత్మిక పరిణతి భౌతికమైన ఉన్నతి అదియును ఏదేని అధికారిక అభివృద్ధి సూచితమగుచున్నది.

అయుర్దాయం సుమారు 88 సంవత్సరములకు పైగా యుండును,
సమస్త సన్మంగళానిభవన్తు

శ్రీ ఆవంచ సుబ్రహ్మణ్యశర్మ, B. A., B.Ed.,
గోసుపాడు, కర్నూలుజిల్లా



# శ్రీ దేవానంద చిన్నస్వాములవారి పూర్వాశ్రమ సంక్షిప్త జీవిత చరిత్ర

(శ్రీ దేవానంద చిన్నస్వాములవారి జీవిత చరిత్ర ప్రగతి పథంలో ఏ విధంగా సాగుతూ ఉందో, శ్రీశివానంద స్వాములవారి సందేశాలను మూలమూలలా ప్రచారము

చేయటానికి ఎలాంటి కృషిచేస్తూ ఉన్నారో అందరికీ తెలిసిన విషయమే. ఒకవేళ సమగ్రంగా తెలియనివారు ఎవరైనా ఉంటే ఈ అభినందన సంచికను ఆమూలాగ్రం చదవగల్గినారంటే వారుచేస్తూ ఉండే మహత్తరకృషి ఎలాంటిదో విపులంగా తెలుసుకోగల్గుగుతారు. వారు సన్న్యాసాశ్రమదీక్షను స్వీకరించటానికిముందు ఎట్టి వాతావరణంలో వారు ఉండినారో, వారి పట్టుదల ఆనాడు ఎలా ఉండిందో తెలుసుకొనటానికి సాధకులకు ఉపయోగపడుతుందనే భావంతో వారి పూర్వాశ్రమ సంక్షిప్త జీవితాన్ని ఈ రచనలో పొందుపరచడం జరిగింది.)

—సంపాదకుడు

పవిత్ర భారతావనిలో ప్రతి రాష్ట్రము ఏదో ఒక మహత్తరమైన ప్రత్యేకతను సంతరించుకొనింది. అన్య రాష్ట్రాలతోపాటు ఆంధ్రరాష్ట్రం కూడా వివిధ రంగాలలో విశిష్టతను సముపార్జించుకొనింది, సుప్రసిద్ధములైన శైవ. వైష్ణవ దేవీ — దేవతల పవిత్ర క్షేత్రాలతో. పావననదీనదాలతో, సశ్యశ్యామల భరితములైన పంటపొలాలతో అన్నపూర్ణా క్షేత్రంగా అలరారుతూ ఉండే ఆంధ్రదేశంలో భక్తులకు, భక్తాగ్రేసరులకు కవులకు — కవిసార్వభౌములకి. పండితులకు—పండిత ప్రకాండులకు, వేదాన్తులకు — వేదాన్త పితామహులకు, నటులకు—నాట్యాచారులకు, అష్టావధానులకు—శతావధానులకు గురువులకు — సద్గురువులకు, పరివ్రాజకులకు — పరివ్రాజక సామ్రాట్టులకు ఇంకా మరెందరో మహానుభావులకు పుట్టినిల్లు అయింది.

ఇలాంటి ఆంధ్రదేశంలో విశాఖపట్టణం జిల్లాలోని చోడవరం తాలూకాలో కొత్తపెంట అని పిలవబడుతూ ఉండే ఒక కుగ్రామంలో శ్రీ గుత్తపూడి సన్యాసయ్యగారు తన ధర్మపత్నియైన సౌభాగ్యవతి రామాయమ్మగారితో శాన్తి-సుఖాలతో కాపురం చేస్తూ ఉండినారు. వారి ప్రధానమైన వృత్తి వ్యవసాయమే అయినాగానీ శ్రీ సన్యాసయ్యగారికి ఆయుర్వేద వైద్యంలో బాగా పరిచయం ఉండింది. తనకు లభ్యమైన వైద్య విద్యను భగవత్ప్రసాదంగా భావించుకుంటూ "మానవసేవే మాధవసేవ" అనే దృష్టితో వైద్య వృత్తిని నిర్వర్తిస్తూ ఉండేవారు. ఉత్తమమైన హస్తవాసి కల్గి ఉండటంతో చక్కటి పేరు ప్రఖ్యాతులతో పరిగ్రామాల ప్రజలనుండి కూడా మన్ననలను పొందుతూ గ్రామీణ సుఖజీవనానికి లోటులేని పరిస్థితులతో జీవితయాత్రను సాగిస్తూ ఉండినారు. ధన ధాన్య శాన్తి సుఖ సంపదలకు లోటులేని ఆ దంపతులకు సంతానం

---

When you are free from attachment to all external objects, the mind will be at peace.
—*Swami Sivananda*

కూడా సమృద్ధిగా ఉండింది. వారికి ఐదుగురు కుమాళ్ళు ఇద్దరు కుమార్తెలు ఉండినారు. వారిలో సీమన్త పుత్రుడు (జ్యేష్ఠపుత్రుడు) శ్రీ రామస్వామిగారు.

శ్రీ రామస్వామిగారు పెరిగిపెద్దయిన తర్వాత తండ్రిగారి నుంచి వైద్య విద్యను అలవడజేసుకోలేకపోయినా తండ్రిలోని దయా ధర్మ గుణాలను, సేవా భావాలను, అతిథి అభ్యాగతుల యందు ఆదర భావాలను అలవరచుకొని వాటిని పెంపొందింప జేసుకున్నారు. శ్రీ రామస్వామిగారు వ్యవసాయ వాణిజ్య రంగాలలో కృషిచేస్తూ సౌభాగ్యవతి పింహాచలమ్మ అను అర్ధాంగ లక్ష్మితో కుటుంబముయొక్క శాన్తి సుఖ సౌభాగ్య సంపదలకు మరింత దోహదము చేస్తూ ఉండేవారు.

ఈ దంపతులకు కూడా ఏడుగురు సంతానము (వీరిలో నల్వురు మగపిల్లలు; ముఫ్వురు ఆడపిల్లలు) ఈ ఏడ్గురిలో మధ్యముడే ఇప్పటి మన దేవానందస్వామిగారు ఈ మహానుభావుడు స్వస్తిశ్రీ ఈశ్వరనామ సంవత్సర జ్యేష్ఠ శుక్లపక్ష ఏకాదశి (నిర్జల ఏకాదశి) కి సరియగు 1937 వ సంవత్సరం జూన్ నెల 19వ తేదీ శనివారం నాడు జన్మించినాడు.

ఈ బాలునికి కూడా * "సన్యాసయ్య" అనే నామకరణం చేశారు, శ్రీ రామస్వామిగారి యొక్క తండ్రిపేరు కూడా సన్యాసయ్య కావటంతో పిలుపులో కాస్త తేడా కనపడడానికి ఈ బాలుణ్ణి "సన్యాసి" అని పిలిచేవారు. ఇరుగు పొరుగువారు - సన్నిబాబు అని పిలిచేవారు.

కొంతమందికి కొన్ని పేర్లు అతకవు. భీమసేనరావు అని పేరు పెట్టబడిన శిశువు పెరిగి పెద్దయ్యేసరికి బక్కచిక్కి ఎముకలు ఎంచటానికి వీలుగల దేహంతో నిర్వీర్యుడుగా ఉంటాడు. సుందరమూర్తి అని పేరు పెట్టబడిన అబ్బాయి చప్పిటి ముక్కుతో, పిల్లికళ్ళతో. గొగ్గరి పళ్ళతో కురూపిగా తయారై ఉంటాడు. మహాలక్ష్మి అని పేరు పెట్టబడిన అమ్మాయి దరిద్రుల ఇంట కాపురం చేస్తూ అష్టకష్టాలుపడుతూ ఉంటుంది. సౌభాగ్యవతియని పేరు పెట్టబడిన అమ్మాయికి పెళ్ళి అయి, అత్తవారింట అడుగు పెట్టీపెట్టకముందే వైధవ్యం ప్రాప్తించి ఉంటుంది. కాని మన "సన్యాసి" విషయంలో అలా జరుగలేదు. అయితే ఆ బాలుడు నిజంగా - నిజ్జంగా సన్యాసిగ

రూపొందాలని తలిదండ్రులు ఆ పేరు పెట్టలేదు. అయినాగానీ నామకరణం జరిగిన ముహూర్త బలప్రభావమో, లేక ఆ శిశువు జన్మించిన సమయ ప్రభావమో, అదీకాక పోతే నామకరణ సందర్భంలో ఆశీర్వదించిన పెద్ద ముత్తైదువుల ఆశీర్వచన ప్రభావమో - ఏది ఏదో మనకు సరిగా తెలియదుగానీ జననకాలంలో తలిదండ్రులు పెట్టిన పేరుకు నూటికి నూరుపాళ్ళు మన సన్యాసి సార్ధకతను కల్గించినాడు. పదిహేడవ (17 వ) సంవత్సరం ప్రవేసించగానే పక్కా సన్న్యాసిగా - శాస్త్రీయ విధితో - ట్రిబుల్ ప్రమోషన్‌తో (గార్హస్థ్య, వానప్రస్థాశ్రమాల ప్రసక్తి లేకుండా) సరాసరి చతుర్థాశ్రమంలో (సన్న్యాస దీక్షలో) ప్రవేశాన్ని పొందగల్గినాడు. అది ఎలా సాధ్యమైందో సంక్షిప్తంగా తెలుసుకుందాము.

"సన్యాసీ ! " అని పిలువబడుతూ ఉండిన మన దేవానంద స్వామిని ఐదో ఏడు దాటగానే గ్రామీణ ప్రాథమిక పాఠశాలలో ప్రవేశపెట్టినారు - నాలుగైదు తరగతులలోనికి వచ్చేసరికి అమరకోశము, ఆంధ్రనామ సంగ్రహము చెప్పించుకోవటం జరిగింది. తాతగారగు శ్రీ సన్యాసయ్యగారు, బసవరాజీయము, నాడీగ్రంథము మొదలైన వైద్య గ్రంథాలను చదివించటానికి ప్రోత్సాహమిస్తూ రోగపీడితులై ఆశ్రయిస్తూ ఉన్నవారికి "ఆ మందు ఇవ్వు, ఈ మందివ్వు" అని పురమాయిస్తూ చిన్న చిన్న జబ్బులకు చిట్కా వైద్యాలను చేయిస్తూ ఉండేవారు, వ్యవసాయ వాణిజ్యాలకు సంబంధించిన పనులలో తండ్రి కూడా తరచుగా ఆపని-ఈ పనిచేయటానికి ఆదేశిస్తూ ఉండేవారు.

ఆ అబ్బాయి ఆకృతిలో వయసుకు తగినంత ఎత్తూ ఉండేవాడు కాదు అయినాగానీ వడివడిగా నడవటం, చెప్పిన పనిని సకాలంలో, చక్కగా చేయటం, బోధించిన విషయాన్ని ప్రజ్ఞతో జ్ఞప్తిలో ఉంచుకోవటం. జ్ఞప్తిలో ఉంచుకొన్న విషయాలను సకాలంలో ఆచరించటం, శుచిగా, శుభ్రంగా ఉండటం ఇవి ఆ అబ్బాయికి వెన్నతో పెట్టిన విద్యలు, సేవాభావం వంశపారంపర్యంగా అబ్బిన సహజ సంపద. ఇటవిలో వ్యక్తమవుతూ ఉండిన ఈ సద్గుణ సంపదలను పరికించిన తాతగారు (తండ్రియొక్క తండ్రియగు శ్రీ సన్యాసయ్యగారు) తన మనుమడు భావికాలంలో గొప్ప వైద్యుడు అవుతాడని ఆకాంక్షించేవారు. తండ్రిగారగు రామస్వామిగారు తన కుమారుడు వ్యవసాయమువాణిజ్య వృత్తులలో బాగారాణించగల్గుతాడని మురిసిపోయేవారు. ఈ అబ్బాయి ఏ రంగంలో ప్రవేసించినా చక్కగా ప్రకాశించగల్గుతాడని ఇరుగు పొరుగువారు, బంధు

మిత్రులు అనుకొనేవారు. కాని పేరుకు తగినట్లు నిజమైన సన్న్యాసిగా రూపొంది శ్రీ స్వామి శివానంద సందేశామృత బిందువులను దేశంలో వివిధ ప్రాంతాలలో - సాధకులకు అందిస్తాడనీ, ఆధ్యాత్మిక జ్యోతులను మూలమూలలా వెలిగిస్తాడనీ ఎవరూ అనుకొని ఉండరు. అలా అనుకోవటానికి ఆ దశలో తగినంత ఆస్పదంకూడా లేదు.

ఈ అబ్బాయి (సన్యాసి) చదువుతూ ఉండిన పాఠశాల యొక్క టీచరు శ్రీ నారాయణమూర్తిగారు సద్గుణ సంపన్నులయిన అధ్యాపకులు. వారి తండ్రిగారు సన్న్యసించి "శ్రీ బ్రహ్మానంద భారతీస్వాములవారు" అనెడి యోగపట్టాలో అక్కడికి నలభై మైళ్ళ దూరములో ఉన్న కొత్తవలస అనే గ్రామంలో "శ్రీ బ్రహ్మానందాశ్రమము" అనే పేరులో ఒక ఆశ్రమాన్ని స్థాపించుకొని ప్రబోధాత్మకమైన కథల రూపంలో ఉన్న భారత, భాగవత, రామాయణ గ్రంథాలలోని సారాంశాన్ని ప్రజానీకానికి చక్కగా అందిస్తూ భక్తి జ్ఞాన వైరాగ్యభావాలను ప్రజలలో వ్యాప్తిచేస్తూ ఉండేవారు. వారు నియమనిష్ఠలను ఖచ్చితంగా పాటించే స్వభావం కలిగినవారు. చక్కటి భక్తి గీతాలను వ్రాసే నేర్పరితనం వారికి ఉండేది. వారు దక్షిణామ్నాయ శృంగేరీ మఠ సంప్రదాయానికి చెందిన సన్న్యాసులు.



ఒకసారి శ్రీ బ్రహ్మానంద స్వాములవారు కొత్తపెంట గ్రామానికి రావటం, శ్రీ నారాయణమూర్తిగారున్న పాఠశాలలో వారు మకాం చేయటం. వారికి సేవలు చేయటానికి మన సన్యాసిని నియమించటం జరిగింది. పొట్టి బుడమకాయమాదిరి బొద్దుగా ఉన్న, ఈ బుజ్జబ్బాయి గునగున పరుగులుదీస్తూచెప్పిన పనులను క్షణాలమీద ఉత్సాహంతో భక్తితో చేస్తూవుంటే శ్రీ బ్రహ్మానంద స్వాముల వారికి చూడముచ్చటగా ఉండేది.

ఏవేవో భావాలు మనసులో మెదిలేవి. అదేవిధంగా నియమనిష్ఠలతో, ప్రసన్నవదనంతో, బ్రహ్మ తేజస్సుతో విరాజిల్లుతూ ఉండే శ్రీ బ్రహ్మానందస్వాములవారిని చూస్తూఉండే ఈ బాలునిలో భక్తిప్రపత్తులు పెల్లుబికేవి. ఈ రీతిగా ఒకరిచే మరొకరు పరస్పరంగా ఆకర్షించుకోవటం జరిగింది. * ఈ సన్నివేశం ఒకదృష్టితో చూస్తే డాక్టర్ అనీబెసెంట్ గారికీ శ్రీ జె. కృష్ణమూర్తిగారికీ జరిగిన ప్రప్రథమ సమావేశం జ్ఞప్తికి తెస్తుంది. శ్రీ స్వాములవారు ఒరే అబ్బాయీ ! మా ఆశ్రమానికి వచ్చి అక్కడే ఉంటావా ? అని ప్రశ్నించడం దానికి జవాబుగా తడుముకోకుండా సమధికోత్సాహంతో "వచ్చేస్తానండీ" అని చెప్పటం జరిగింది. (కానీ శ్రీ స్వాములవారు ఈ అబ్బాయిని తమ వెంట తీసుకొని వెళ్ళలేదు. వారు ఒంటరిగనే వెళ్ళినారు.)

బ్రహ్మానందాశ్రమానికి వెళ్ళాలి. ఈ బ్రహ్మానంద స్వాములవారిని సేవించాలి. బ్రహ్మవిద్యను సాధించాలి. బ్రహ్మానందాన్ని పొందాలి. ఈ చతుర్విధాభిలాషలు ఆ అబ్బాయిలో తీవ్రమైన సంచలనాన్ని కల్గించినాయి. నిరంతరం వాటినే ధ్యానించుకుంటూ, ఊహాజనితమైన అవ్యక్తానందాన్ని అనుభవిస్తూ తదనుగుణ్యంగా తనదైనందిన కార్యక్రమాలలో అవసరమైన మార్పులను సంతరించుకుంటూ తన పద్నాలుగవయేట (21-3-1951) శ్రీ బ్రహ్మానందాశ్రమములో ప్రవేశించినాడు. ఓహో ! ఏమాబాలుని సాహసము ! ఏమాతని భాగ్యము !!

అంతకుముందే తాతగారగు శ్రీ సన్యాసయ్యగారు పరమపదించి ఉండినారు. ఈ బాలుని ఆశ్రమ ప్రవేశానికి తలిదండ్రులు సుముఖులు కాదు - కానీ తమ విముఖతను ప్రబలంగా ప్రదర్శించలేకపోయినారు. ఎందుకంటే ఆ దంపతులుకూడా భక్తి జ్ఞాన వైరాగ్య సుశోభితులే అయినందున.

ఈ సన్యాసి బ్రహ్మానందాశ్రమంలో ప్రవేశించే నాటికి శ్రీ బ్రహ్మానంద స్వాములవారితోపాటు శ్రీ శివానందమ్, నిత్యానంద, రామకృష్ణానంద, శాంతానంద, రామానంద, సదానంద, నిర్మలానంద, సిద్దేశ్వరానంద అనబడే దీక్షానామములుగల తొమ్మిదిమంది సన్న్యాసులు, రామ్‌బాబు, అన్నపూర్ణమ్మ అనే ఇద్దరు భక్తులు ఆ ఆశ్రమంలో స్థిర నివాసంగా ఉండేవారు బ్రహ్మానందాశ్రమమునకు నాలుగెకరాల భూవసతి ఉండేది. తగినంత నీటి సౌకర్యాలతో ఫల వృక్షాలతో, తగుపాటి పశుసంపద

---

(గో-గణము) ఉండేది. చక్కటి నియమబద్ధమైన కార్యక్రమంతో ఆశ్రమం జరుగుతూ ఉండింది. ఆశ్రమాన్ని శుభ్రపరచటం, స్నానపానాదులకు నీళ్ళు తోడటం, అర్చనలకు పుష్పాలను సేకరించటం గీతాపారాయణలలో పాల్గొనటం, ఆవులను మేపటం ఇవి ఈ బాలుడు (సన్యాసి) నిర్వర్తించవలసిన అనుదిన కార్యక్రమాలు.

చేయవలసిన ఆశ్రమ కార్యక్రమాలన్నీ శ్రద్ధాభక్తులతో చకచకా పూర్తి చేసుకొంటూ, తన స్వీయఅనుష్ఠానాలను నిర్వర్తించుకొంటూ ఆలమందను తోలుకొని ఊరి వెలుపలికి మేపటానికి వెళ్ళేవాడు. వెళ్తూ వెళ్తూ వెంట భగవద్గీతను తీసుకొని వెళ్ళేవాడు. ఆవులను ఒక కంట కనిపెడ్తూ పట్టుదలతో గీతాశ్లోకాలను కంఠస్థం చేసేవాడు. అదెలాంటి పట్టుదలంటే రోజుకు ఐదు శ్లోకాలు కంఠస్థం చేయనిదే ఆ రోజు పడుకొనేవాడు కాడు. అచంచలమైన పట్టుదలతో కొలది మాసాల్లోనే గీతను కంఠస్థం చేయగలిగాడు. ఆ తర్వాత ఆవులను మేపుతూ - మేపుతూనే సమగ్రంగా గీతను పారాయణ చేసేవాడు ఈ రీతిగా మూడు పంచాంగాలు ఇట్టే మారిపోయినాయి, అబ్బాయిలో త్వరితగతితో సాధింపబడుతూ ఉండే ప్రగతిని వారు వీరూ (చూచినవారు) చెప్పగా శ్రీ బ్రహ్మానంద స్వాములవారు విన్నారు. అబ్బాయిలో కనపడుతూఉండే వినయము, విధేయత, పట్టుదల, ఆసక్తి, చురుకుదనము, సేవాభావము, కర్మకుశలత్వము లౌకిక జీవితముపై గల విరక్తి, ఆధ్యాత్మిక జీవితముపై గల ఆసక్తి. బ్రహ్మవిద్యా గ్రహణముపై గల అనురక్తి మొదలగు ఉత్తమ గుణాలను వారు స్వయంగా పరికిస్తూనే ఉన్నారు.- ఎంతగానో సంతోషించారు.సన్న్యాస దీక్షపొందటానికి ఉండవలసిన అర్హతలన్నీ ఆ అబ్బాయిలో ఉన్నాయని పరిపూర్ణంగా విశ్వసించినారు, వయసుతో నిమిత్తం లేకుండాతురీయాశ్రమ దీక్షను ఇవ్వటానికి సంకల్పించినారు. ఇంత చిన్నవయస్సులో ఉన్నఅబ్బాయికి సన్న్యాస దీక్ష ఇవ్వటమా ? అనే భావం ఆశ్రమంలోని మిగతా వారికి కలుగకుండా ఉండటానికి - తనకు పూర్ణ విశ్వాసం ఉండినాగానీ ఆ అబ్బాయి నోటనే అతని మనోభావాన్ని వెల్లడింపజేయాలనే సంకల్పంతో ఒకనాటి శుభ ముహూర్తాన సన్యాసయ్యను అన్తేవాసుల సమక్షంలో దగ్గరకు పిలిచి కూర్చుండబెట్టుకొని ప్రేమతో ఇలా ప్రశ్నించారు.

---

He who attains God will never feel hungry or thirsty.

—*Swami Sivanvnda*

ఒరే అబ్బాయీ ! నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలిరా, జవాబు సూటిగా స్పష్టంగా చెప్పాలి. నీకు ఆనందం కావాలా ? లేక బ్రహ్మానందం కావాలా ? ఏది కావాలో నిజంగా, నిశ్చయంగా చెప్పు నాయనా ! ఆనందం కావాలంటే.... .... వాక్యం పూర్తిచేయటానికి ముందే అబ్బాయి గభాలున లేచి వినయంతో చేతులు కట్టుకొని ఏదో చెప్పబోయాడు. వెంటనే స్వాముంవారు వారిస్తూ - నా ప్రశ్నను పూర్తిగా విను. సరిగా అర్థంచేసుకో. దీర్ఘంగా యోచించు. ఆ తర్వాత నిశ్చయించు. ఒకసారి నిశ్చయించి నావా ? చేసిన నిర్ణయాన్ని మార్చుకోవద్దు. ముందువేసిన అడుగు వెనక్కు తీయవద్దు. అలా చేయటం సాధకుని లక్షణం కాదు.

ఇదిగో శ్రద్ధగా విను ! నీకు ఆనందం కావాలంటే - ఇంకా కొంత కాలం గడచిన తర్వాత మీ యింటికి వెళ్ళి మీ పెద్దల అనుమతితో - మీ బంధువర్గంలో మంచి సంస్కారంగల అమ్మాయిని ఎన్నుకొని వివాహం చేసుకో. పవిత్రమైన గృహస్థాశ్రమంలో ప్రవేశించి తలిదండ్రులను సేవిస్తూ, అతిథి అభ్యాగతులను ఆదరిస్తూ, బంధుమిత్రులను గౌరవిస్తూ, ఉత్తమమైన సంతానాన్ని పొంది సౌభాగ్య సంపదలతో గృహస్థాశ్రమ విధులను నిర్వర్తించు, అప్పుడు నీకు ఆనందం లభిస్తుంది, కానీ బ్రహ్మానందం కావాలని కోరుకుంటావా ? అప్పుడు పెళ్ళి ప్రసక్తి మానుకోవాలి. కఠినమైన సాత్వికాహార నియమాలను పాటించాలి. కఠోరమైన బ్రహ్మచర్యంతో - నియమనిష్ఠలతో, ధ్యానాధ్యయన జపతపాద్యనుష్ఠానాలతో జీవితాన్ని కొనసాగించాలి. స్త్రీ జాతిలో వయోభేదాలను పాటించకుండా అందరిలో కన్నతల్లిని దర్శించాలి. కోరికలను సమూలంగా చంపుకోవాలి. సమదృష్టిని సాధించాలి, ప్రతి ప్రాణిని ప్రేమించాలి నిరాడంబరతను అలవరచుకోవాలి ఇవన్నీ సులభసాధ్యం కాదు నాయనా ! అయినా అచంచలమైన పట్టుదల నీలో ఉంటే నీవు సాధించగలుగుతావు. అప్పుడు నీకు బ్రహ్మానంద ప్రాప్తి లభిస్తుంది. "చెప్పు నాయనా ! నీకు ఆనందం కావాలా ? బ్రహ్మానందం కావాలా ?" అని అన్నారు.

అప్పుడా అబ్బాయి వినయ విధేయతలతో నమస్కరించి ముకుళిత హస్తాలతో "స్వామీ ! నాకు బ్రహ్మానందమే కావాలి. ప్రతిబంధ రహిత బ్రహ్మ సాక్షాత్కారాన్ని సత్వరంగా సాధించాలంటే సన్న్యాస దీక్షను పొందటం అవసరం కదా స్వామీ ! నాకు

---

Realise the Self as Brahman and realise the world as Brahman.
—*Swami Sivananda*

సన్న్యాస దీక్షను ప్రసాదించమని నేనే ముందుగా మిమ్మలను అర్థిద్దామని అను కున్నాను. తామే ముందుగా ఈ విషయాన్ని బయట పెట్టినారు. తమ ఆశీస్సులతో నా కృషితో బ్రహ్మానందాన్ని పొందుతాను స్వామీ ! అనుగ్రహించండి" అంటూ తన దృఢ నిశ్చయాన్ని ఆ అబ్బాయి విన్నవించుకున్నాడు. ఈ జవాబును విన్న శ్రీబ్రహ్మా నంద స్వాములవారు ఎంతో ఆనందించారు. తన ఆశ్రమానికి యోగ్యతగల ఉత్తరాధికారి లభించనున్నాడని లోలోన మురిసి పోయినారు.

* వయసుతో నిమిత్తం లేకుండా ఆ అబ్బాయికి 17 వ ఏట సన్న్యాస దీక్షను ప్రసాదించి "స్వామి దేవానంద భారతి" అను యోగపట్టాను అనుగ్రహించినారు.

లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు. హరిః ఓమ్.

ఇది శ్రీ దేవానంద స్వాములవారియొక్క సంక్షిప్తమైన పూర్వగాథ. దీక్షా నంతరం వారెక్కడెక్కడ తిరిగినదీ, ఏ రీతిగా కృషి చేసినదీ ఎటువంటి ప్రగతిని సాధించినదీ వెనుకటి పేజీలను మీరు శ్రద్ధగా చదివిన యెడల గమనించగలుగుతారని సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాము.

— స్వామి అసంగానంద సరస్వతి

---

*కంచి కామకోటి పీఠాధిపతులగు జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాముల వారు ఒక అబ్బాయికి తురీయాశ్రమ దీక్షను ప్రసాదించి తమపీఠము నకు ఉత్తరాధికారిగా ప్రకటించిన సంగతి ఆంధ్రులకు తెలిపిన విషయమే. స్థూల దేహపు వయస్సునకు ప్రాధాన్యత ఇవ్వకుండా వ్యక్తి యొక్క యోగ్యతలను గుర్తించి మహనీయులు ప్రవర్తిస్తూ ఉంటారు.

— సంపాదకుడు.

---

నిర్జల ఏకాదశి (8-9-87) నాటి ప్రాతఃకాలంలో గురుదేవుల పవిత్ర సమాధి స్థాన్‌లో మెడిటేషన్ క్లాస్ ముగుస్తూనే ఆశ్రమ జనరల్ సెక్రటరీగారగు పూజ్యపాద శ్రీశ్రీశ్రీ కృష్ణానంద స్వాములవారు ప్రప్రథమంగా శ్రీ దేవానంద స్వామిని వారి స్వర్ణ జయన్తిని పురస్కరించుకొని ఆశీర్వదిస్తూ అనుగ్రహ భాషణను గావించినారు. వారి ఆంగ్ల భాషణమునకు శ్రీ హంసానందగారి ఆంధ్రానువాదాన్ని ఇక్కడ పొందు పరుస్తున్నాము.

---

World as world is relative Truth. World as Brahman is absolute Truth.

—*Swami Sivananda*

సర్వశక్తివంతుడైన భగవంతుని నామమహిమను స్థిర ప్రతిష్ఠత మొనర్చుటకై అవతరించిన శ్రీ గురుదేవ్ స్వామి శివానంద స్వాములవారు తమ భక్తులను, సాధకులను ముముక్షువులను, అనుయాయులను ఉద్ధరింపటకై వ్యక్త పఱచిన శక్తులను స్మరించుకొనుచున్న నేటి ఈ సమయము పవిత్రమైనది. ఆకాశమునందున్న సూర్య భగవానుని గోళములోని కిరణములు అనేక లక్షలై యున్నవి. అదే విధముగా ఈ ప్రపంచమునందు పనిచేయు దివ్యశక్తులు అనంతములై యున్నవి. ఈసృష్టిలోని మూల మూలలయందు దేవుని హస్తములు అనుక్షణము పనిచేయుచున్నట్లే, శ్రీ గురుదేవుల దామమైన శివానందాశ్రమమునందు దివ్యలక్ష్యము నొందు మార్గమును నిర్దేశించు శక్తులు అనుక్షణము పనిచేయుచుండును. భగవంతుడీ విశాలసృష్టియందు అనంత రూపములలో అవతరించుచుండును. ఈ రోజు ఇచ్చట స్థిర నివాస మొనర్చుకొన్న ప్రతి వ్యక్తి తన సంకల్పము. సద్భావము మఱియు సత్క్రియలచే ఏదోయొక రూపమునందాశ్రమ సేవ చేయుచుండుట సర్వజన విదితమే. స్వామి శివానంద భగవానునినుండి ఉత్పన్నమైన మిణుగురు ఒక జ్యోతియై, సమస్త విశ్వమునకు ప్రకాశము నిచ్చుచు వ్యక్తులయొక్క భావములు మఱియు క్రియలన్నియు దైవ పూజగా, దైవార్పణముగా పరిణమించెను.

శ్రీ గురుదేవులవారికి నిర్విరామముగా మఱపురాని సేవలొనర్చినట్టి పూజ్యశ్రీ గురుభాయి దేవానంద స్వాములవారిని ఈ రోజు స్మరించుకొను ప్రత్యేక సందర్భ మేర్పడినది. నేడు మన దేశంలోని ప్రజలందఱికి వారి నామము చిరపరిచితమైనది. శ్రీ గురుదేవులవారి కొనర్చిన సేవయందు వారు తమ హృదయమును, ఆత్మను, సర్వస్వమును సమర్పించిరి. వారు పలుకునదంతయు, వారి నోటినుండి వచ్చు సంభాషణమంతయు మఱియు శ్రీ గురుదేవులవారి సేవా కార్యమునందు పాల్గొను అంశములన్నియును ఎల్లప్పుడు ఆత్మార్పణ సమన్వితమై యుండుటకు అనేకులు గమనించి యుందురు, వారి భావములు, క్రియలు, మాటలన్నియును ఏకాగ్ర చిత్తాయత్తములై యుండును. వారిఆశ్రమ జీవిత నిర్వహణమునందు నేను గమనించిన విషయమిదియే. వారెల్లప్పుడు పూర్ణ వ్యక్తిత్వముతో నిండియున్న నిండుకుండవంటి వారేకాని, ఆంశిక వ్యక్తిత్వముతో తొణకుచుండువారుకారు. వారు ఏ పూజ యొనర్చినను, ఏసేవ చేసినను లేక సంకీర్తన - ప్రవచనముల నొనర్చినను, దేశమెల్లెడల దివ్య జీవన సందేశ ప్రచార మొనర్చినను వారి ఆలోచనలన్నియును తమ పరిపూర్ణ వ్యక్తిత్వము నుండి ఉత్పన్న

---

Go beyond all that cause duality. —*Swami Sivanand*

ములగుచుండును, సామాన్యముగా సగము మనస్సుతో కార్యముల నొనర్చు ప్రజల వలెకాక, శ్రీ దేవానంద స్వాములవారు పూర్తి మనస్సుతో సేవాకార్యముల నొనర్చు చుండుట నేను గమనించిన అంశములయందొకటి. సామాన్యముగా ప్రజలు కార్యముల నొనర్చునప్పుడు మనస్సులోని ఒక అంశముతో చేయుదురేకాని, పూర్ణ వ్యక్తిత్వమును దానికై వినియోగించరు. లేక కొంత దేహ పరిశ్రమను వినియోగింతురే కాని, దానికై వారు తమ హృదయము నొసంగరు. మనము ఏదైన పని చేయుచుండు నప్పుడు మనలో అర్థ భాగము, లేక పావు భాగము, లేక మూడవవంతు, లేక ఏదైన ఒక భాగము బాహ్యప్రపంచము నందుండును. సర్వవేళలలో ఒకే స్థలమునందు మన మందెవ్వరున్నూ ఉండజాలము. సామాన్యముగా మనము ఒకే సమయములో అనేక స్థలములయందుందుము నిజమునకు అదియే మనందరికి సహజ స్వభావము. ఈ విధముగా సేవావాంఛను అనేకచోట్ల పంచుకొనుటచేతను మరియు మన జీవిత లక్ష్యము నుండి చలించుచుండుటచేతను మనము మన కార్యమునందు విజయము నొంద జాలకున్నాము. కాని శ్రీ దేవానంద స్వాములవారు వెళ్ళిన ప్రతి స్థలము నందును విజయమును సాధించుచున్నారు.

శ్రీగురుదేవులవారి ఆశ్రమమునందు ప్రవేశించినప్పటి నుండియు శ్రీదేవానంద స్వాములవారు శ్రీ గురుదేవులవారికి వ్యక్తిగత సేవలు యొనర్చుచు ఎల్లప్పుడు శ్రీగురు దేవులవారిని వెంబడించుచు, అన్నిరకములగు సపర్యలొనర్చుచుండిరి. నాకు తెలిసినంత వరకు శ్రీగురుదేవులవారి ప్రపంచమును వీడుటకు ముందు శ్రీ దేవానందజీ నిద్రను సరకుగొనక, ఒక్కొక్కప్పుడు తమ దైనికాహారమును స్వీకరించుటకైనను సమయం చాలక, శ్రీ గురుదేవుల వారేక్షణమునందైనను పిలచదరేమోయను భయముతో అను క్షణము సేవించిరి. శ్రీగురుదేవులవారి భౌతిక శరీరము ఆరోగ్యముగా లేనప్పుడుకూడా వారు ఏ క్షణమునందైనను పిలచెడివారు. శ్రీ దేవానందజీ గదిలోపలయున్నను, బయటయున్నను ఏ శబ్దము విన్నను. ఏ పిలుపు విన్నను, ఏ సంజ్ఞను గమనించినను మిక్కిలి శ్రద్ధతో నిరంతరము శ్రీ గురుదేవులవారిని సేవించిరి. శ్రీ గురుదేవులవారి శారీరిక పరిస్థితివిబట్టి ఏ క్షణమునందు శ్రీవారికి సేవ ఆవశ్యకమగునోయను భావముతో రాత్రింబగళ్ళు కనిపెట్టుకొనియుండుటచే సహజముగా శ్రీ దేవానంద స్వాములవారికి నిద్రలేని రాత్రులు అనేకములు గడపవలసి వచ్చెడిది. ఆ పరిస్థితిలో శ్రీగురుదేవులవారి ఆవశ్యకతలను నెఱవేర్చుట అంత సులభమైన కార్యముకాదు. దీనిని నిర్వర్తించుటకు "త్యాగము" ను పదము చాలదు. అది పూర్ణ శరణాగతి, ఆత్మార్పణము మఱియు

పూర్తిగా స్వయముగా శ్రీగురుదేవులవారితో ఏకీభవించుటయే యగును. నిద్రలేకుండుట, విశ్రాంతి లేకుంట, ఏకాంతవాసము లేకుండుట యనునవి సులభమైన కార్యములుకావు. ఇట్లుండువారు ఒకరిద్దఱు మాత్రమే యుండిరి. మరియొకరి పేరు సత్యజ్ఞానమ్. వారు కూడా అన్ని కష్టములకోర్చి గురుదేవులను సేవించిరి. అది వారికాశీర్వాదమై నేడు ధన సమృద్ధితో తులతూగుతున్నారు. గురుదేవులవారి అపార ప్రేమకు పాత్రులైన వారిలో ఒకరైన శ్రీ దేవానందస్వాములవారు శ్రీవారి అనుయాయులకు ప్రేమపాత్రులగుటయేగాక దేశమందెల్లెడలగల భక్తులు, ముముక్షువులు సాధకులచే ఒక ప్రత్యక్ష ఆరాధ్య దైవముగా గౌరవింపబడుచు పూజింపబడుచున్నారు. ఇది కేవలము శ్రీ గురుదేవులవారి ఆశీర్వాదమేయని నుడువక తప్పదు. ఈ సమయమునందు శ్రీ గురుదేవులవారు శ్రీ దేవానంద స్వాములవారిని తమకు కుడి భుజముగా ఎన్నుకొనిరి. శ్రీ గురుదేవులవారి శక్తివంతమైన సందేశమును ప్రజల మనస్సులలో చొప్పించుటకు మఱియు చైతన్య శక్తి బిందువులను ప్రజల హృదయాలలో ఇముడ్చుటకై ఇట్టి కఠిన పరిశ్రమ అత్యవసరమైయున్నది. శ్రీవారి సందేశమేమనగా :— "మేల్కొనుము నీనేత్రములను తెఱువుము. జీవితలక్ష్యమును పొందుటకై బద్ధకంకణుడవగుము." పవిత్రమగు గంగా దసరాకు తర్వాత వచ్చు ఏకాదశి శుభ సందర్భమునందు తమ స్వర్ణోత్సవ జయంతిని జరుపుకొనుచున్న ప్రియమైన శ్రీ దేవానంద స్వాములవారు విధేయతతోను, నిరాడంబరత్వముతోను స్వార్థరహితులై శ్రీ గురుదేవులవారి సేవాకార్యము నందెల్లప్పుడు నిమగ్నులై యుందురు.

దైవబలముచేతను, గురుదేవుని ఆశీస్సులచేతను సేవలొనర్చినట్టి, ఒనర్చుచున్నట్టి, ఒనర్చబోవునట్టి శ్రీదేవానంద స్వాములవారి కింకను బలతేజస్సుల నొసంగుటకై ఈ సందర్భమునందు నేను హృదయ పూర్వకముగా శుభకామనలతో సర్వశక్తివంతుడైన సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. దివ్యజీవన సంఘముయొక్క ఉద్దేశ్యములను లక్ష్యములను నెఱవేర్చుటకై సేవయొనర్చుచున్న సువర్ణాభరణము వంటి శ్రీదేవానందస్వాములవారు ఇతోధికముగా శ్రీ గురుదేవులవారిని సేవించుటకై వారికిస్వాస్థ్యము, దీర్ఘాయుష్యము చేకూరునుగాక ! వారి దీర్ఘాయుష్యమునకై మేము విధేయతతో ప్రార్థించుచున్నాము అని ఆశీర్వదిస్తూ "శ్రీ దేవానంద స్వాములవారు దీర్ఘాయుష్కులగుదురుగాక ! శ్రీ దేవానంద స్వాములవారు దీర్ఘ జీవనులగుదురు గాక ! శ్రీ దేవానంద స్వాములవారు దీర్ఘకాలము జీవింతురు గాక !" అంటూ అందరితో ఉచ్చైస్స్వరంతో పలికించారు.



Strive for that wealth which never fades. —*Swami Sivananda*

# కుంభలగ్న విశేషము

ప్రఖ్యాత జ్యోతిషవేత్తలు బి. వి. రామన్ దీనికి 'WATER BEARER' అని వ్రాశాడు. మనం పంచాంగాల్లో నీటి కడవనుగాని లేక నీటి కడవతో నున్న మనిషినిగాని కుంభరాశిలో బొమ్మను వేస్తారు. ఇది శనికి మూల త్రికోణరాశి. దీనిపేరు చెప్తేనే చాలామంది భయపడతారు. కాని గొప్ప గొప్ప వేదాంతులు, ఋషులు ఈ లగ్నములోగాని, ఈ రాశిలో జన్మించినవారుగాని ఎక్కువగా వున్నారు. కాని వీరు చాల తెలివితేటలు గలవారుగా వుంటారు. అందరితోటి కలుపుగోలుగా వుంటారు. వారి హృదయం నిర్మలంగా వుంటుంది. అందరికీ సాయంచేయాలనే సంకల్పముంటుంది. వారు వ్రాయడం మాట్లాడుటలో ప్రకాశించగలరు. వారి సంభాషణలు చాల బోధనీయంగా వుంటవి. వారికి జరగబోయే విషయాలు తెలుస్తాయి అనిపిస్తుంది. వారు చిన్నతనంలో నున్నప్పుడు వాళ్ళ శక్తి వాళ్ళకే తెలియదు. వారు వాతావరణానికి సంబంధించిన జాగ్రత్తలు తీసుకోవలసి వుంటుంది లేనిచో వారు కాలిక వ్యాధులకు గురికాగలరు. వారికి పరిచయములోకొచ్చిన వారిని ప్రేమపాత్రులుగా మార్చుకోగలరు.

తత్త్వదర్శనం :- రామకృష్ణ పరమహంస, మొహమ్మద్ ప్రవక్త మొదలగువారు యీ లగ్నానికి చెందినవారే. పూజ్యశ్రీ దేవానంద స్వాములవారు గూడా దీనికి చెందినవారే అని శ్రీ అవంచ సుబ్రహ్మణ్య శర్మగారు తయారుచేసిన జాతకచక్రం ఋజువు చేస్తోంది.

ఈ కుంభమనే పదం 'ESOTERIC SCIENCE' (రహస్య శాస్త్ర ప్రకారము) కుంభకము అనే పదంలోనుండి వచ్చినదే. ఇది యోగాభ్యాసానికి సంబంధించిన ప్రాణాయామములో ఒక భాగము. ఈ కుంభలగ్నానికి అధిపతి శని అని మనము ముందే చెప్పుకున్నాము. శని వ్యక్తియొక్క ఇష్టనిష్టలను చెల్లనివ్వడు. ఆ వ్యక్తిని విపరీతమైన బాధలకు, వ్యధలకు గురిచేస్తాడు. అట్టి పరిస్థితి భరించాలంటే కుజునియొక్క బలం ఉండాలి. కుజునియొక్క బలంవల్ల ఉత్సాహం, ధైర్యం వుండితీరుతాయి. లేనిచో ఆ వ్యక్తి

ఆ కష్టాలను భరించలేడు. దీని తదుపరి మెట్టు వ్యక్త్యాత్మ విశ్వాత్మలో లీన మవడమే.

ఈ కుంభము గుర్తును రేఖాచిత్రంలో అలాగీతల్తో చూపిస్తారు. దీని అర్థము అదంతా నీరు అన్న సంకేతాన్ని తెలియజేస్తుంది. ఇంకా లోతుగా దీని అర్థమేమంటే సృష్టికి ముందు కేవలము అగాధమైన నీరు మాత్రమే వున్నదనీ, ఆ నీటినుండి యావత్తు ప్రాణికోటి ఉద్భవించిందని సంకేత సూచకంగా చెప్పబడింది. మొదటి వంకరగీత నీరని, రెండవ వంకరగీత వ్యక్తియనిన్నీ, మొత్తము కలిసి విశ్వశక్తితో కూడుకున్న వ్యక్తియని రహస్య శాస్త్రం ESOTERIC SCIENCE చెప్తోంది.



మొదట చెప్పబడిన నీటికడవ వేదాంత పరంగా కడవ మట్టితో తయారు చేయబడింది. అంటే దాన్ని తయారు చేసినవాళ్ళు ఒక భావంతో తయారుచేశారు. అన్ని నామరూపాలన్నీ ఆ మట్టిలోనుండి ఉత్పత్తి కాబడి నవే. దీన్నే భూమిమీదనున్న దుమ్మునుండి మనిషిని తయారు చేసినట్లు పాత బైబిల్లో వర్ణించబడి వుంది. జీవి తన కార్యక్రమం కోసం కడవను తయారు చేయడం జరిగింది. ఆ కడవలో నీరు రూపంలో సర్వాధారమైన జీవశక్తి ప్రవహిస్తోంది. కుంభలగ్న జాతకుల సంకేతమచే జీసస్ క్రీస్తు తన చివరి విందు రోజున "దాహము గొన్నవారు నా వద్దకు రండి నేను LIVING WATER - అమర శక్తిగల పానీయాన్నిస్తా"నంటాడు. ఈనాటి ప్రపంచము మర్చిపోయి నిర్లక్ష్యం చేయబడిన ఆధ్యాత్మికతను మళ్ళీ వారిలో పునః ప్రతిష్టించడమే వారి జీవన విధానము.

రమణ మహర్షి జాతక చక్రంలో లగ్నాధిపతి రెండవ ఇంటిలో నున్నాడు. అట్లా ఉండటం మిషనరీ జీల్‌ను కలిగిస్తుంది. కాని శక్తివంత మైన కుజబలం వున్నప్పుడే జన సమూహాలతో సంబంధాన్ని కలిగిస్తుంది. ఆ కుజబలం స్వాములవారి జాతకచక్రంలో వుంది. చైతన్యప్రభు జాతక

చక్రంలో వలె శుక్రుడు మేషంలో స్వక్షేత్రమైన తులను చూస్తున్నాడు. రామకృష్ణ పరమహంస యొక్క జాతక చక్రంలో పూర్వ పుణ్యస్థానమైన 9వ స్థానాన్ని గురువు చూస్తున్నాడు. చిన్నస్వాములవారి జాతక చక్రంలో 9వ స్థానాన్ని శుక్రుడు చూస్తున్నాడు. జాతక పారిజాతంలో 9వ ఇంటిని ఆ క్షేత్రాధిపతి చూడడం, అందులో శుభగ్రహం చూడడం, అదే భాగ్య స్థానము గనుక శుభకరం కాగలిగింది. రాజ్యాధిపతి కుజుడు తులలో చంద్రునితో కలిసి చంద్రమంగళ యోగం ఏర్పడింది. దానికితోడు కుజుని ఇంటిలో శుక్రుడు, శుక్రుని ఇంటిలో కుజుడు వుండటంవల్ల పరివర్తనయోగ మేర్పడింది. శుక్రుడు కుంభ లగ్నాధిపతియైన శనికి మిత్రుడేగాక, కుంభలగ్నానికి రాజయోగ కారకుడై కూడా అయివున్నాడు. శుక్రుని ప్రక్క ఇంటిలో బుధుడుండుట వలన మూడువంతులు చంద్రాధియోగం ఏర్పడింది. రాహువు, కేతువు, గురువు వీళ్ళు నీచలో వుండడాన్న రాజయోగి కావలసినవారు యోగ రాజవడం జరిగింది. భాగవతంలో ఒకచోట చెప్తాడు శుక్రుడు కుజుడ్ని చూడడం వల్ల, కుజునికి సౌమ్యత్వము ఏర్పడుతుందని.

పైన వివరించిన వివరాలనుబట్టి, భాగ్యస్థానము, ధర్మస్థానము మరియు పూర్వ పుణ్యస్థానమైన 9వ ఇల్లు ఒక వ్యక్తియొక్క గమ్యము నిర్ణయించవలసి వుంటుంది వారికి సంఘము మీదవుండే ప్రభావము అర్థమవుతుంది. భాగ్య స్థానములోనున్న కుజుడు పాపిగదాయని అనవచ్చు. కాని దానికి మూల్యము వ్యక్తిగత సౌకర్యాలు పోగొట్టుకోవడము, కష్టాలను భరించడం ద్వారా చెల్లించబడింది. జన్మవిమోచనం నిర్ణయించబడేవుంది. అయితే రామకృష్ణ పరమహంసలాగ మరొకరి ద్వారా కాకుండా వీరే స్వయంగా ఇతరులకు జన్మవిమోచనం కలిగించడానికి పూనుకుంటారు యీ కుజుని చైతన్యం ద్వారా- ఓం తత్సత్

-సాధు శేషగిరిరావు

---

Hair-splitting logic will not gives you even an iota of spirituality.

—*Swami Sivananda*



# శ్రీ శివానందవాణి



జూన్
1997

ఓమ్
నమోభగవతే
శివానందాయ
★

హార్థిక అభినందనలతో . . .

పూజ్య శ్రీశ్రీశ్రీ దేవానంద - చిన్నస్వాముల వారి

## షష్ట్యబ్దపూర్తి మహోత్సవ సందర్భ సంచిక

శ్రీ శివానంద సందేశ ప్రచార సేవా సమితి వారి సమర్పణ

"ఓం నమో భగవతే శివానందాయ"




శివానంద ఆశ్రమము
ఫోన్‌నెం : 430040
కోడ్‌నెం : 0135

# శ్రీ శివానంద వాణి

6/97 ద్వైమాస పత్రిక మాన్యువల్ నెం. 112

హితచింతకులు: పరమపూజ్య శ్రీ స్వామి చిదానందజీ మహరాజ్
దివ్యజీవన సంఘాధ్యక్షులు, ఋషికేశ్-హిమాలయాస్

వ్యవస్థాపకులు :
శ్రీశ్రీశ్రీ స్వామి దేవానంద - చిన్నస్వామి
శ్రీ శివానందాశ్రమము, ఋషికేశ్ - 249 192.

సంపాదకులు :
శ్రీ సాధు శేషగిరిరావు

## సూక్తి ముక్తావళి

శ్లో॥ దానోపభోగహీనేన ।ధనేన ధననోయది ॥
పృధ్వీఖాత నిఖాతేన। ధనేన ధనినో వయమ్ ॥

తా॥ ఒకరి కీడక తాము గుడువకయుండు ధనరాసుల చేతనే వారు ధనకులైనయెడల భూమిలో గుప్తముగా పాతివేయబడియున్న పెన్నిధులచే మనము మాత్రము ధనికులముగామా ! అనుభవమునకురాని ధనరాసులు నిష్ప్రయోజనములని భావము. -[హితోపదేశం]

# విషయ సూచిక

VOL. ৬ NO. 4



## మహారాజ పోషకులు 2016/-

ఈరోడువాస్తవ్యులయిన (తమిళనాడు) చి॥ హెచ్. వేణుగోపాల్ కృష్ణరాజు, చి॥సౌ॥ శివబాల సరస్వతి నూతన దంపతులు, వారి వివాహశుభ సందర్భముగా శ్రీ శివానంద వాణి ప్రతికాభివృద్ధిని ఆకాంక్షించుచు, పైవిరాళ మొసంగి మహారాజపోషకులుగా చేరినారు. వారికి ధన్యవాదములర్పించుకొనుచున్నాము.

సకలైశ్వర్య సంపన్నులైన శ్రీ లక్ష్మీనారాయణులు, శ్రీ పార్వతీ పరమేశ్వరులు, శ్రీ సీతారామచంద్రులు శ్రీ సద్గురుమూర్తి, నూతన వధూవరులైన చి॥ హెచ్. వేణుగోపాల్ కృష్ణరాజుకి, చి॥సౌ॥ శివబాల సరస్వతికి, క్షేమ స్థైర్య, ధైర్య విజయ, అభయ ఆయురారోగ్యములు, ధన, కనకవస్తు వాహన పుత్ర, పౌత్రాది సమస్త సంపదలు ప్రసాదించి రక్షింతుగాక.

నూతన దంపతుల దాంపత్య జీవితం అన్యోన్యమైన పరస్పర ప్రేమతో సుఖమయముగా శాంతియుతముగా ఆనందకరముగా ఆదర్శవంతముగా యుండు గాక.

ఇట్లు

శ్రీ శివానంద సందేశ ప్రచారసమితి



- **20-7-95** గురుపూర్ణిమ
- సాధనా సప్తాహం
- సద్గురుదేవులు శ్రీ శివానంద మహరాజ్ వారి పుణ్యతిథి ఆరాధన **28-7-97**న జరుప బడును.

ఈ ప్రోగ్రాములు దివ్యజీవన సంఘ ప్రధాన కేంద్రమగు శివానందాశ్రమములో జరుపబడును. 21 జులై నుండి 27 జులై వరకు సాధనా సప్తాహము జరుపబడును. అనగా ఆధ్యాత్మిక తరగతులు జరుపబడును. ప్రార్థన, ధ్యానము, యోగము, వేదాంతము మొదలైనవాటిపై, వేదాంతులు, స్వాములు, మహాత్ముల (సాధుసంతులు) ఉపన్యాసము లుండును. పాల్గొనదలచినవారు వివరములతో ముందుగా వ్రాయవలెను. ఆశ్రమమువారు వసతి, ఆహారము ఏర్పాటు చేయుదురు.

ఈ దిగువ అడ్రసుకు వ్రాయవలెను.

To

**General Secretary**

THE DIVINE LIFE SOCIETY

(PO) Shivananda Nagar - 249192

Tehri - Gharhwal Dt. (UP)

# ఉత్తరాలు

తమ దర్శనము వలన, మహాత్ముల ఆగమనం వలన కొత్తపేట గ్రామము ఎంతయో పునీతమైనది. మరువలేని మరపురాని మహద్భాగ్యాన్ని మా దంపతులకు కలుగ జేసితిరి.

మండల సత్యనారాయణగారు
కొత్తపేట

* * *

తమ షష్ట్యబ్ది ఉత్సవములకు భక్త జనులందరూ ఒక దివ్యానుభూతిగా, చరిత్రలో మరపురాని ఘట్టముగా పులకించిపోయి నెమరువేసుకొనుచున్నారు. తమ సన్మాన పత్రము మరల వేలాది ప్రతులను రూపు దాల్చుకొనుచున్నవని తెలుపుటకు సంతసించుచూ ఆ సేవా భాగ్యము నాకు కలిగినందులకు ధన్యత చెందినాను అని తలంచుచున్నాను.

యం. టి. ఆళ్వారుగారు
నాగార్జున సాగర్

* * *

శంకర కళ్యాణ మండపములో జరిపించిన హోమ, జపాది, వేదాశీర్వచనములు, సువర్ణాభిషేకం, అన్నిటి కంటె కనీ వినీ ఎరుగని రీతిలో తమరు జరిపించిన ఋత్విక్ సన్మానము ప్రతి ఒక్కరినీ అలరించింది, తమ రూపమూ అందరిలోను అపరశివమూర్తిలా ప్రశాంత దరహాసంతో మెదిలింది తమరు ప్రసాదించిన రుద్రాక్షమాలలు ఎంతయో భక్తిశ్రద్ధలతో పొందిన ప్రతివారు ధరించి తరించినట్లు భావిస్తూవున్నారు.

ఎస్. రామరాజుగారు
విజయనగరం

# గురుదేవుడు

- శ్రీ శారద, రాజమండ్రి.

దొరికినాడు నాకు గురువు
మహిమాలయమైన మేరువు.
మథించితి నా అంతరాత్మ
లభించెను ఆ పరమాత్మ.
ఎన్నో జన్మల అనంతరం
నేడు దొరికెను సాన్నిధ్యం.
తెరచుకొనెను అంతర్ చక్షువు
గురుదేవుడే ధర్మభిక్షువు.
చరాచరజీవులకు ప్రాణదాత
మార్చెను చూడుడు నాతలరాత.
మాయ మనకు గర్భ శత్రువు
ఛేదించిన లభించును గురువు.
మాయకు మారుపేరు అజ్ఞానం
ఖండించిన వ్యక్తమగును జ్ఞానం.
జ్ఞానవృద్ధికై నామ సంకీర్తనం
జిహ్వకు కర్తవ్యం నిరంతరం.
చేసితిని నిరంతర అన్వేషణ
కొనసాగించితి ఇంద్రియాలతో ఘర్షణ.
కలిగియుంటిని ఇహలోక విరక్తి
నిలిపితిని గురుచరణాలపై ఆసక్తి.
నేర్చుకొందును బాగుగ ఆత్మవిద్య
తలచుచుందును ఈ ప్రపంచమొక మిథ్య.
మీమాటలే నాకు అష్టోత్తరాలు
మీ పలుకులే శతసహస్రనామాలు.
మీ గళములోని మధురగానాలు
నాకు దేవదేవుని ప్రియరాగాలు.

# గురుభక్తి

పల్లవి :- దేవానందా గురుదేవా మా మొర వినరావా గురుదేవా
దిక్కు నీవని నమ్మితిమయ్యా దయగనరావా గురుదేవా

1. మంత్రతంత్రములు తెలియవు దేవా మనసున నిన్నే తలచెదమూ
భక్తి శ్రద్ధ ప్రేమలతో స్వామీ నిన్నే కొలిచెదమూ
చేసిన తప్పులు కాయుము దేవా దీనబాంధవా గురుదేవా
దిక్కు నీవని నమ్మితిమయ్యా దయగనరావా గురుదేవా ॥దేవా॥

2. ఎచ్చట చల్లగ నీవు చూతువో అచ్చట కలుగును ఐశ్వర్యం
దుఃఖము దరికి రానేరాదు అచ్చట విరియును ఆరోగ్యం
భక్తుల చింతలు బాపెడి దేవా దీనబాంధవా గురుదేవా
దిక్కు నీవని నమ్మితిమయ్యా దయగనరావా గురుదేవా ॥దేవా॥

3. నిన్ను తలచిన కలతలుఱావు పిలచిన నీవే వత్తువట
నీ చరణములే నమ్మినవారిని మక్కువతో నువు బ్రోతువట
మాయామోహము బాపుము దేవా దీనబాంధవా గురుదేవా
దిక్కు నీవని నమ్మితిమయ్యా దయగనరావా గురుదేవా ॥దేవా॥

హరగోపాలరావు, (రాజేరు)

---

# కీర్తనీయస్సదాహరిః

శ్రద్ధ మఱియు విశ్వాసము లేని ఏ కార్యముకూడా సఫలము కానేరదు. కావున భక్తి భావముతోకూడిన సాధనచే చేయబడు నామజపము మఱియు హరికీర్తన జీవితము నందు శాంతిసౌఖ్యముల నొసంగుటలో సహాయకములగును. ఈ కారణముచే వీటికి విశేషమహత్వము కలదు. మనము సాంసారిక క్రియయందు కేవలము స్వార్థపరత్వముచే మనలను ఒక శక్తివంతుడైన వ్యక్తికి సమర్పించుకొన్నప్పు డాతనివల్ల లాభము మనకు తరచుగా లభించును. ఇక సర్వశక్తివంతుడైన మహాప్రభువు ఎదుట నిజముగా సమర్పింపబడినప్పుడు అవశ్యముగా మనకు శ్రేయస్సు కలుగును. ఇది సునిశ్చితమైన విషయము శ్రీరామచంద్రభగవానునియొక్క ఉక్తి ఏమనగా :-

"ఎవడైన నను ఒకసారియైనను 'నేను నీవాడను' అని శరణాగతుడై అభయమును యాచించునో, నేనతనికి ప్రాణులన్నింటివలన అభయదానమొసంగుదును. ఇది నా వ్రతము." ఈ విధముగా మానవ జీవితమును పొంది, కలికాలములో తన అనుకూలానుసారముగా ప్రతిదినము హరికీర్తనను మఱియు నామజపమును అవశ్యముగా ఒనర్పవలయును. దేనిచే ఉత్థానము మఱియు శ్రేయస్సు కలుగును.

# గురుపూజ

"పూర్ణము శూన్యము నెరుగదు
శూన్యానికి పూర్ణము తెలియదు
పూర్ణం కావాలని అందరికీ ధ్యాస
పరిపూర్ణం కావాలని ఒకటే ఆశ
దీనికై
గురువును చేరు
మారుతుంది బ్రతుకు తీరు

క్షీరము నిచ్చేది ధేనువు
జ్ఞానము నిచ్చేది గురువు
తల్లిని మరపిస్తుంది ధేనువు
కన్నవారిని మరపిస్తాడు గురువు
కసవుతిని పాలనిచ్చేది ధేనువు
కన్నీరు మింగి పన్నీరు చల్లేది గురువు

గాలినిచ్చేది తరువు
జ్ఞానమిచ్చేది గురువు
ఆశించదు ప్రతిఫలం తరువు
ఆశలెరుగనివాడు గురువు

ఎండుతూ నీడనిచ్చేది తరువు
శ్రమిస్తూ విజ్ఞానాన్ని పంచేది గురువు
కొట్టినా ఫలానిస్తుంది తరువు
చీకొట్టినా విద్య బోధిస్తాడు గురువు

ఫలాల పంపకం తరువుది
ప్రతిఫలాపేక్షలేని సంతర్పణ గురువుది
జలముతో నిండివుంటుంది చెరువు
పరిపూర్ణ ప్రేమహృదయుడు గురువు

"జలము దాటిపోదు చెరువును
శిష్యులు వదలిపోరు గురువును
చల్లబడును మేను చెరువులో దిగితే
శాంతి కలగును మనసు గురుబోధలు వింటే!"

శ్రీ పూడిపెద్ది నీలవేణి
శృంగవరపుకోట

## ★ చందాదారులకు విజ్ఞప్తి ★

వార్షిక చందాలు, రెన్యూవల్స్ రు. 40/- లు ఈ దిగువ అడ్రసుకు పంపించ ప్రార్థన.

**D. V. Subrahmanyam**
D. L. S. Branch Secretary
Kodivari Street
RAZOLE - 533 242
E. G. Dt. (A.P.)

పత్రికలు అందనివారు, శ్రీశివానందవాణి విషయమై వివరములు తెలిసికొనగోరువారు పై అడ్రసుకు తెలియజేయ ప్రార్థన.

| | |
|---|---|
| శాశ్వతచందాదారులు | రు. 400/- |
| రాజపోషకులు | రు. 1000/- |
| మహారాజపోషకులు | రు. 2000/- |

ఈ క్రింది అడ్రసుకు పంప గోరుచున్నాము.

**SRI DEVANANDA CHINNA SWAMY**
Gurudev Kutir
Sivananda Nagar - 249 192
Tehri Gharwal Dt. (U. P.)

స్టేట్ బ్యాంక్ Drafts మరియు చెక్కులు

Sri Sivananda Sandesh Prachara Samithi, - Lakshman Jula Road Branch S. B. I.

అను అడ్రసుమీద తీసికొనవలెను.



## "శ్రీ శివానందవాణి" శాశ్వత చందాదారుల లిస్టు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ కె. యల్. నారాయణగారు | బలగ | రూ. 400/- |
| 2. | శ్రీ ముప్పన రామారావుగారు | పెద్దాపురం | రూ. 400/- |
| 3. | శ్రీ ఓం శ్రీ ప్రేమ్‌సాయిగారు | మొగరాల | రూ. 400/- |
| 4. | శ్రీ జగ్గా రామారావుగారు | ధర్మవరం | రూ. 400/- |
| 5. | శ్రీ నెరగదమ్ వెంకునాయుడు | అడ్డూరు | రూ. 400/- |
| 6. | శ్రీ బి. గోపాలరావుగారు | పినగాడి | రూ. 400/- |
| 7. | శ్రీ గుజ్జె భూమయ్యగారు | సిరిసిల్ల | రూ. 400/- |
| 8. | శ్రీమతి జి. సూర్యకుమారిగారు | విశాఖపట్నం | రూ. 400/- |
| 9. | శ్రీ ఆణెం లక్ష్మీనారాయణగారు | బ్రాహ్మణతర్లా | రూ. 400/- |



కొత్తపెంటలో శ్రీ దేవానంద చిన్నస్వామి షష్ఠిపూర్తి
సందర్భంలో హోమగుండం వద్ద శ్రీ స్వామీజీ



కొత్తపెంటలో శ్రీ స్వామి దేవానంద షష్ఠిపూర్తి సందర్భంగా
జరిగిన నగర సంకీర్తనలో సుమనోహర దృశ్యం



సాధుమాతలను సత్కరిస్తున్న స్వామీజీ



కనకమాల, పుష్పకిరీటంతో స్వామీజీ

(కొత్తపెంటలో శ్రీ దేవానంద చిన్నస్వామీజీ షష్ఠ్యబ్దపూర్తి మహోత్సవ సందర్భంలో)

# శ్రీ దేవానంద చిన్నస్వాములవారి షష్ట్యబ్దపూర్తి మహోత్సవములు - కొత్తపేట

(గతసంచిక తరువాయి)

# ద్వితీయ దినము - అద్వితీయము

రెండవరోజు అనగా 13-2-1997 గురువారము, రథసప్తమి శ్రీ మహావిష్ణువు సూర్యభగవానునిలో అంతర్యామిగానుండి సకల చరాచర సృష్టికి పుష్టిని కలిగించుటకై వివిధ వాహనములపై ఊరేగు రోజుకదా ! ఈనాటి సభలు కార్యక్రమములు చాల ప్రత్యేకతను చాటినవి. ఎప్పటివలె ప్రాతఃకాల ధ్యాన-జప తరగతులు బ్రహ్మాండమగు నగర సంకీర్తనలు పూర్తియైనవి. గీతాపారాయణ 7వ అధ్యాయమునుండి 12వ అధ్యాయమువరకు సామూహికముగా నిర్వర్తించబడినవి.

ఈనాటి సభలకు పరమపూజ్య శ్రీశ్రీశ్రీ సాధుమాతా శాంతాబాయమ్మగారు అధ్యక్షత వహించినారు. ఆమె తన అధ్యక్షోపన్యాసములో- తాను అధ్యక్షురాలు కానని సర్వాధ్యక్షుడు శ్రీకృష్ణ దేవుడని మయాధ్యక్షేణప్రకృతిః సూయతే సచరాచరమ్ అన్న గీతావాక్యము ప్రకారమే ఈ చరాచర సృష్టికి నియంత శ్రీహరే అని తెలియజేయుచూ మదాలస మహాసాధ్వికథను బహురమణీయముగా చెప్పిరి. ఆ సాధ్వి తన కుమారులను గొప్ప వైరాగ్యవంతులుగా జేసెనని

శుద్ధోసి బుద్ధోసి నిరంజనోసి.... సంసారమాయా పరివర్జితోఽసి....

అంటు జోలపాటద్వారా సంసార మసారమని

బోధించి ఆత్మతత్త్వమును తెలిపినగాధ ప్రతితల్లి గుర్తించాలని రాతిలోని కప్పనుగూడా పరమాత్మ దయతలచునని శివాజీ రామదాసుల వృత్తాంతము ద్వారా తెలిపి స్త్రీలు తమ పిల్లలను చక్కగా తీర్చిదిద్దవలెనని భర్తృ భార్యాసంబంధవైలక్షణ్యమును బోధించిరి. పిమ్మట బాబా బ్రహ్మచారిణి అమ్మగారు తమ సందేశములో సాధూనాం దర్శనం పుణ్యం అని ఇంతమంది సాధువులు కలసిన ఈ స్థలం గొప్పక్షేత్రమని అన్ని ఆశ్రమములలో కెల్ల గృహస్థాశ్రమం చాలాగొప్పదని ఆ ఆశ్రమమే మిగిలిన బ్రహ్మచారి వానప్రస్థ సన్యాసులకు సేవచేయు మహాభాగ్యమును పొందినదని మన సంసార జీవనమును ఆధునిక భోగభాగ్యములవైపు మళ్ళించి దుఃఖములపాలు కారాదని గురుదేవుని

---

You can know the will of God if you are pure in heart, free from lust, anger, hatred, jealousy, egoism and vanity.

—*Swami Sivananda*

సేవలో సరలి సమర్పణము గావించి ధన్యత చెందవలెనని తెలిపినారు. ఆ తరువాత శ్రీశ్రీశ్రీ యోగానంద స్వాములవారు గంగచోళ్ళపెంట, జ్ఞానానందాశ్రమాధిపతులు తమ గంభీరోపన్యాసములో వాల్మీకిమహర్షి పూర్వచరిత్రను సప్తర్షుల అనుగ్రహముచే బోయగానున్న వాల్మీకి రామనామము ప్రభావముచే ఆదికవిగా మారి బ్రహ్మ ఆజ్ఞచే నారద భగవానునిఉపదేశముచే శ్రీ రామాయణమును రచించిన విధానమును కన్నులకు గట్టినట్లుగా బోధించిరి. ఈ మహాత్ములు శ్రీరామసేన అను సంస్థను స్థాపించి అందు 70 లక్షల మందిని సభ్యులుగా చేర్పించి యోగవిద్యను పాఠశాలలలో కళాశాలలలో పురములలో బోధించుచూ గొప్ప ఆధ్యాత్మిక ప్రచారము చేయుచున్నారు.

పిమ్మట ఎద్దు "సింహాద్రికవి" జానపదములతో శ్రీశ్రీశ్రీ దేవానందస్వామి వారి జీవన వృత్తాంతమును గానము చేసి శ్రీస్వాములవారి బహుమానమును పొందిరి.

పిమ్మట సాధు గాయత్రీబాయిగారు రాజమహేంద్రవరం స్త్రీల సాధుమఠం వారు తమ అనుగ్రహ భాషణములో సమయము ఎంతో విలువైనదని దేనినైననూ తిరిగి సాధించగలముగాని సమయమును తిరిగి సాధించ లేమని పతివ్రతా మణులశక్తి అపారమైనదని జానాబాయి చూడాల గార్గి వంటి వారి చరిత్రలు చదువు కొనవలెనని వేదాంత సభలలో మహర్షులను గార్గి ఓడించిరని

ఈశ్వరః సర్వభూతానాం హృద్దే శేర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని భారత ।

పరమాత్మ సమస్తభూతములలో అంతర్యామిగానుండి ఈ సమస్త సృష్టిని నడిపివేయుచున్నాడని ఈ భావన ఎల్లప్పుడు కలిగియుండి "పోనీలే" అనే క్షమా గుణాన్ని అలవరచుకొనవలెనని సంసారములో సర్దుకొని పోవుట గొప్ప లక్షణమని స్త్రీశక్తి మహిమను కొనియాడి ఆదర్శ తల్లులుగా మారవలె నని బోధించినారు. పిమ్మట శ్రీశ్రీశ్రీ సదానంద స్వాములవారు నెమలికొండ దత్తపీఠం పలాస ఆశ్రమాధిపతులు తమ గంభీర ఆధ్యాత్మిక ప్రబోధములో దీవ దేవుని చింతించు దినము దినము అంటూ ప్రారంభించి ఆనందమును భ్రాంతిలో మానవుడు వివిధ దుఃఖముల పాలౌచున్నాడని నిజానికి ఆత్మలో నిమగ్నమైన గాని ఆనందము సంప్రాప్తించదని ఎవ్వరిపైన దేనిపైన అతిగా మమకారము ఉండరాదని భాగవతములోని జడభరతుడు

Objects are beautiful, but more beautiful is mind and beautiful still is the Atman or the Self. —*Swami Sivananda*

యోగభ్రష్టునిగా మారిన విధానమును తెలిపి ఈ సంసారమున తామరాకుపై నీటిబొట్టు వలె నుండువాడు మహాయోగి యని పలు ఉదాహరణలతో సభాసదులందరినీ ఆశీర్వదించిరి.

పిమ్మట శ్రీశ్రీశ్రీ దేవానంద చిన్నస్వాములవారు తమ 60వ జన్మదినమున 60 మంది స్త్రీలకు పురుషులకు వేరువేరుగా చీరలను - ధోవతలను పంచిపెట్టి తమ తల్లిదండ్రులపై భక్తిప్రపత్తులను జన్మనిచ్చిన ఆ పుణ్యదంపతులకు కృతజ్ఞతలను తెలుపుకొనిరి. బ్రహ్మాండమగు భజనచేయించినారు. ఈనాటి సభలకు సుమారు అనేక వేలమంది హాజరగుట అత్యాశ్చర్యము. కొత్తపేట గ్రామమున మున్నెన్నడు లేనట్టి అద్భుత శోభ ఏర్పడెను.

## దేవకీ పరమానందం
## కృష్ణం వందే జగద్గురుమ్

మధ్యాహ్నము 3 గం॥నుండి చందులూరు భక్తులచే దివ్యనామసంకీర్తనము జరుపబడగా, వచ్చిన భక్తులందరూ శ్రీశ్రీశ్రీ దేవానందుల వారిని చిన్ని కృష్ణునిగా మార్చివేసిరి.

చేతవెన్నముద్ద - చెంగల్వపూదండ
బంగారు మొలత్రాడు పట్టుదట్టి
సందె తాయెత్తులు - సిరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణ నిన్ను చేరికొలుతు ॥

అన్నట్లుగా అద్వైత వేదాంత బ్రహ్మ పదార్థములో విహరించు మన చిన్నస్వామిని సాకార వ్రేపల్లె చిన్నబాలునిగా మార్చి తలపై ఉష్ణీషము చుట్టిరి. నెమలి పింఛము నుంచిరి పిల్లనగ్రోవిని పట్టించిరి, కాషాయాంబరములపై పట్టువస్త్రము లుంచిరి. రుద్రాక్షలపై తులసిమాలలుంచిరి. త్రిశూలి రూపమును వనమాలిగామార్చిరి. చివరకు స్వామిని ఊయలలో కూర్చొండబెట్టి ఊయలలూపిరి. జోలపాటపాడిరి. వేణునాదము వినిపించమని పట్టుపట్టిరి. గాయతి వనమాలీ మధురం గాయతి వనమాలీ-అంటూ

---

The fire of anger burns up all that are noble, good and beautiful in you. —*Swami Sivananda*

దేవానందులగు చిన్నకృష్ణునిచే తాండవ నృత్యము చేయించిరి. వేలాదిమందీ పరవశించిరి. అందరికీ మా చిన్నస్వామి మాచిన్ని కన్నడు అన్నట్లు గోచరించినదీ. సాకార ఆనంద బ్రహ్మము కొత్తపెంటలో పంటవలె చేతికందెను గదా అని ఆనందించిరి. పిమ్మట సాయంకాల మహాసభలకు అంతర్జాతీయ జగద్గురు పీఠాధ్యక్షులు పూజ్యశ్రీ కంభంపాటి పార్వతీ కుమార్‌గారు (విశాఖపట్టణము) అధ్యక్షత వహించినారు. శ్రీ సత్తిబాబుగారు (విశాఖ) శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి ఏకలవ్యశిష్యులు, శ్రీ R. S రాజుగారు తమ మధుర భాషణలలో జగద్గురు పీఠ ఆశయములను. సమాజ సేవను శ్రీశ్రీశ్రీ దేవానందస్వాములవారి సర్వసులభత్వమును తెలుపుచూ దైవచింతనతో కూడిన కర్తవ్యోన్ముఖము మంచిదని సమస్త సాధు సత్పురుషులు ఆ పరమాత్మవాహికలని, వారి మార్గములలో పయనించుట శ్రేయోదాయకమని తెలిసినారు. పిమ్మట ఆనాటి సభాధ్యక్షులు శ్రీ కంభంపాటి పార్వతీ కుమార్‌గారు 30 సం॥ములకు రాశిచక్రములో జరుగు మార్పును గురుదేవుడు తపస్విగా నుండి ధర్మవాహికగ నుండు తత్త్వమును భగవంతునితో విడదీయరాని సత్సంబంధము కలిగి ఉండుటను సంసార సాగరములో నావ శ్రీకృష్ణ పరమాత్మ అని పైన కనబడిన నావ నీటిలోపల గూడా కొంత మునిగి తనలోనికి నీరు రానివ్వక తనలోనున్న వారిని ఆవల గట్టుకు చేర్చునటుల మన మాయా సంసారమును అతని కృపతో దాటించగలడని గురుదేవుని ప్రభావము అయస్కాంతము వంటిదని ఇనుము కూడా ఆకర్షించునని గురువు కృపకలిగినచాలు పరమాత్మ మనకు చేరువ అగునని శ్రీశ్రీశ్రీ దేవానందుల వంటి సంకీర్తన సమ్రాట్టులు మార్గదర్శకులు అని వారి భజన నేటికిని విదేశీయులగు మా సంస్థ సభ్యులు మరువక గోవింద భజన స్వామిగా గుర్తుంచుకొనినారు పలు పలు విషయములను అత్యంత రసస్ఫోరకముగా ప్రబోధించినారు. పిమ్మట వేచలపు పాలవెల్లిగారు (వీరు పూర్వము రాజకీయ రంగమున ఉండి గొప్ప ప్రజాసేవచేసిన పుణ్యపురుషులు) తమ ప్రసంగములో సమస్త సాధుసత్పురుషులకు వందనములు సమర్పించి తీర్థపాదులుగా మహాత్ముల నభివర్ణించి కొత్తపెంట గ్రామముపై చక్కని వర్ణనాత్మక పద్యములు చదివిరి. శ్రీశ్రీశ్రీ దేవానందుల వారిని ప్రహ్లాద కుమారునితో పోల్చిన విధము బహురమణీయముగా సాగినది,

తనయందు అఖిలభూతములందు సమహితత్త్వంబున బరగువాడు.... అనెడి పోతనగారి పద్యమును భక్తి యోగమునందలి భక్తుని లక్షణమును శ్రీదేవానందస్వామి

---

Graft your heart with the feet of Sat-Guru. You will grow into a Godman.

—*Swami Sivananda*

యందు చక్కగా కనబడునని అట్టి పురాణపురుషుని సేవించుట మన అదృష్టమని నొక్కి చెప్పిరి - పిమ్మట శ్రీశ్రీశ్రీ అభేదానందస్వాములవారు తమ మధురశైలిలో శ్రీకృష్ణభగవానుని తత్త్వము వివరించి అబలులమగు మనము సర్వేశ్వరుని కృపచే సబలులమగుదుమని దేవానందులు జన్మించుటచే ఈ గ్రామము దేశము సమకాలీనుల మగు మనము ధన్యులమైతిమని ప్రబోధించినారు.

శ్రీశ్రీశ్రీ ప్రసన్నానందస్వాములవారు గండిపాళెం పీఠాధ్యక్షులు తమ హాస్య మాధుర్య వేదాంతోపన్యాసములో మనమందరము శివస్వరూపులమని నవనీతచోరుడగు శ్రీకృష్ణుడు వెన్నదొంగ అనునది సామాన్యార్థమని నవముగా నీతమగు బ్రహ్మపదార్థ మునకు అధిష్ఠానదేవత అని, మానవుడు అనగా నవత్వములేనివాడు అని అనాదియగు శ్రీకృష్ణునితో అనాదిగా సంబంధమున్నవాడే అని తరతిశోకమాత్మవిత్ అని ఆత్మ నెఱింగినవాడే శోకమును దాటునని మనిషి పరమేశ్వరునివలె మారవలెనని ఆశీర్వ దించినారు.

మాతా జ్యోతిర్మయానందగారు జగ్గంపేట అమ్మగారు తమ ప్రసంగములో శ్రద్ధావాన్ లభతేజ్ఞానమ్ అని శ్రద్ధగలిగినవారికే దివ్యజ్ఞానము కలుగునని, జన్మదుఃఖము నిజమగు దుఃఖమని మరల మరల పుట్టుక అనెడి దుఃఖమును తొలగించుకొనవలెనని సచో మహాపురుష సాంగత్యము శ్రవణమనన నిధి ధ్యానములుచేసి ఆ పరమపదమును పొందవలెనని దానిని తీవ్రమగు కృషిసాధన అలవరచుకొనవలెనని ప్రబోధించినారు. పిమ్మట జనరల్ సెక్రటరీగారు శ్రీ ఆర్. గంగారామ్‌గారు వందనసమర్పణ సమర్పించి నారు. విశ్వప్రార్థన శాంతి మంత్రహారతులతో నాటి కార్యక్రమములు ముగిసినవి.

## సహస్ర శీర్షా పురుషః

మూడవరోజు 14-2-1997 శుక్రవారము శ్రీశ్రీశ్రీ దేవానందులవారి బ్రహ్మ జ్ఞానయజ్ఞ పూర్ణాహుతిరోజు గ్రామమంత తెల్లవారుఝాముననే మంగళదీపములతో సిద్ధమైనది. ఎక్కడచూచినా స్వామివారిని గూర్చిన కథలే. ఎక్కడచూచినా హరినామ స్మరణలే, గుడిగంటల మ్రోతలతో శ్రీశ్రీశ్రీ స్వామివారిధ్యాన,జప కార్యక్రమములతో పూర్ణాహుతి దినము ప్రారంభమైనది.

---

Anna (matter) Prana (life) Manas (mind) Vijnana (intelligence) Ananda (bliss) are the stages of the ascendency of the Spirit.

—*Swami Sivananda*

ఎప్పటివలె 8.00 గం॥లకు భగవద్గీతా పారాయణము శ్రీ సాధు స్త్రీలమఠము వారిచే 12 నుండి 18 అధ్యాయములవరకు సామూహిక పారాయణ చేయుచూ భగవద్గీతా పారాయణ యజ్ఞమునకు పూర్ణాహుతి సమర్పించబడెను. గీతాపారాయణ ఎందుకు ఎలా చేయవలెనో దాని ప్రాధాన్యతనుగూర్చి శ్రీ ఎమ్.టి. ఆళ్వార్‌గారు వివరించినారు.

ఆనాటి సభాకార్యక్రమములు స్వస్తిమంత్రములతో 9.00 గం॥లకు ప్రారంభమైనవి. మూడవరోజు ఆయుష్హోమము ప్రారంభమైనది. భక్తుల ప్రేమావేశములకు అవధులు లేకుండెను శ్రీశ్రీశ్రీ దేవానంద చిన్నస్వామికి జై! అనెడి ధ్వనులతో కొత్తపెంట గ్రామము మారుమ్రోగినది. ఆనాటి సభాకార్యక్రమములకు మాతా జ్యోతిర్మయానందగారు అధ్యక్షత వహించినారు. వారు తమ అధ్యక్షోపన్యాసములో పుట్టిన రోజు అనగా అర్థమేమిటో ఆనాడు చేయవలసిన పనులేమిటో తెలియజేయుచూ....

రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం.... .... ....

మన జీవితంలో రాత్రులు సుప్రభాతములు తరిగిపోవుచున్నవని ఇదేవిధంగా భావించిన ఒకానొక గండుతుమ్మెద ఒక తామర పువ్వులో దూరి ఇలాగే రాత్రి పగలు సూర్యోదయాన సూర్యాస్తమానాలు జరుగుతూ ఈ పువ్వు వికసిస్తుంటుందని నాకేమి కొరతఅని భావిస్తుండగానే ఒకానొక ఏనుగువచ్చి ఆ తామరకాడను పెరికిపారవేసిందట అయ్యో! వింతక్షణభంగురం! ఈ జీవితం. దీన్ని గమనించి సత్కర్మలు ఆచరించి తరించాలని బోధించినారు.

అటుపిమ్మట మాతా శాంతిబాయిగారు తమ సందేశములో తిన్నవి జీర్ణంకావాలని విన్నవి జీర్ణంకారాదని రామాయణంలో పాత్రలు అన్నీ సజీవములని శ్రీరామచంద్రుని ఆదర్శం చేసుకుని మన జీవితాన్ని పండించుకోవాలని రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు సీతా మహాసాధ్వి హనుమంతులు మన జీవితానికి మార్గదర్శకులని వివరించినారు.

పిమ్మట A. కోడూరు వాస్తవ్యులు శ్రీ సదానంద స్వాములవారు (విశాఖ) భగవంతుని గొప్పతనము తెలియజేయుచూ ఏ స్థానమునకు జీవుడు ప్రవేశించి తిరిగి మరల ఈ లోకమునకు ప్రవేశించునో అదే నిజమైన ముక్తిస్థానమని దానిని పొందుటకై మానవుడు ప్రయత్నించవలెనని ప్రబోధించినారు.

---

తరువాత శ్రీశ్రీశ్రీ సదానందస్వాములువారు నెమలికొండ దత్త పీఠాధిపతులు తమ ఆధ్యాత్మిక ప్రసంగములో మన జీవితమంతా చిన్నపిల్లల స్తంభాలాటవలె నుండునని, స్తంభము పట్టుకొని ఎంతసేపు గిరగిర తిరిగినా పడిపోమని అట్లే శ్రీధరునిపై భారముంచినవారు ధరణిలో పడిపోరని హృదయనిర్మలమే ఆత్మ సాక్షాత్కారమని; పరోపకారగుణమే మహనీయులు ఉపదేశించిన మంచిమార్గమని ఆహారనిద్రాభయమైథునాదులు అందరీ అన్నిప్రాణులకూ సమానమైనా జ్ఞానమనునది మానవునకు వరము వంటిదని ఆ జ్ఞానముద్వారా ధైర్యముపొంది భగవంతుని చేరవలెనని ఆశీర్వదించిరి. పిమ్మట ఒరిస్సాప్రాంతీయులు బరంపురం నివాసులు శ్రీశ్రీశ్రీ శివానంద గురుదేవుల పరిపూర్ణానుగ్రహమును పొందిన శ్రీగురు సేవానంద మహరాజ్‌వారు తమ అనుగ్రహ భాషణములో సమస్త గురుదేవులకు వందనములు సమర్పించి నిరంతరం గురుసేవ ఒక్కటి ఆత్మతరుణోపాయమని గురుదేవుని అర్చించుటకన్నా ఈలోకములో గొప్ప కార్యమేదీలేదని శ్రీశ్రీశ్రీ శివానందులవారి దివ్యశక్తులను పుణికిపుచ్చుకున్న శ్రీశ్రీశ్రీ దేవానందులు చిన్నస్వామికాదని గొప్పస్వామియని ఆ మహనీయుడు ఈ ప్రాంతమున అవతరించుటచే వారునూ ఎంతో అదృష్టవంతులని శ్రీశ్రీశ్రీ దేవానందులువారు ఆరాధ్య గురువులని ఆతని దివ్యజీవనమే మనకు సందేశమని వారిని అనుకరించినచాలు మన లక్ష్యం నెరవేరునని ప్రబోధించినారు.

పిమ్మట విరాట్ పురుషుని దివ్యపాదములకు అనగా వేదికపై నారాయణుని ప్రతినిధులుగా విచ్చేసిన యతీశ్వరుల పాదపద్మములను శ్రీశ్రీశ్రీ దేవానందులవారు అత్యంతభక్తిశ్రద్ధలతో కడిగి ఆ తీర్థమును శిరసునదాల్చిరి. ఆ సమయమున వేదికపై పెద్ద ఆసనములు ఉంచిరి వాటిపై వరుసగా కాషాయవస్త్రధారులగు స్వాములందరినీ ఆసీనులు గావించిరి. పుష్పమాలాదులతో అలంకరింపజేసిరి "నమో స్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర పాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటి యుగధారిణే నమః" అంటూ పురుషసూక్తమును వేద మంత్రములను పఠించుచుండగా సహస్ర వదనములతో సహస్ర పాదములతో సహస్రనేత్రములతో సహస్రబాహువులతో ప్రకాశించు ఆ శ్రీమన్నారాయణుని సహస్రశీర్షా పురుషః అని భావించి అర్చనగావించిరి. ఈ దృశ్యము చూచినవారు ధన్యులు విన్నవారు ధన్యులు.

---

Break the bars of desire; come out of the cell of flesh; move about freely and fearlessly in the kingdom of God.

—*Swami Sivananda*

మహాత్ములకు ఏవిధముగా పాదపూజ చేయవలెనో శ్రీస్వామి దేవానందులు చేసిచూపిన ఆదర్శ యతీంద్రులు. మహాత్ములందరూ తమలో ప్రకాశించు శుద్ధసత్త్వ జ్యోతిర్మయుడగు నారాయణసేవగా తలచిరి. ఈవిధముగా అత్యంతవైభవముగా మహాత్ముల సన్మానము జరిగినపిదప అశేష భక్తబృందములు శ్రీశ్రీశ్రీ సద్గురు దేవానందులవారికి గురుపూజగా మహాసన్మానమును జరిపిరి. స్వామికి నమస్కరించని భక్తుడుగాని సత్కరించని పిల్లలుగాని లేరు.

పత్రం పుష్పం ఫలం తోయమని ఎవరికి తోచినదివారు తమతమ భక్తి శ్రద్ధలతో మహాప్రవాహమువలె స్వామిని సత్కారములతో ముంచెత్తివేసిరి. విశ్వప్రార్థన శాంతి మంత్రములలో మధ్యాహ్న కార్యక్రమములు ముగిసినవి. తిరిగి మధ్యాహ్నము 3 గం॥లకు దివ్యనామ సంకీర్తనలతో గ్రామమంతయు పునీతమైనది. ఆనాటి మధ్యాహ్నము శ్రీశ్రీశ్రీ దేవానందులవారికి సార్వభౌమత్వమును సూచించు విధముగా భక్తులు భక్తాగ్రేసరులగు స్వామివారికి పల్లకిసేవ చేసిరి. ఆ సన్నివేశమును చూచుటకు రెండు కన్నులు చాలవు. స్వామివారు పరమహంసకదా! వేదాంత వినువీధులలో విహరించు యతిచంద్రులు. చిరునవ్వులు కురిపించుచూ పరబ్రహ్మను దర్శించుచూ అంతర్ముఖులగుచూ భక్త జనులకు పల్లకిసేవను నిరాడంబర హృదయముతో స్వామి అనుగ్రహించిరి.

పిమ్మట సాయంకాల మహాసభ పూర్ణాహుతి సభయే. యజ్ఞమునకు పూర్ణాహుతి పూర్తియైనది, జ్ఞానయజ్ఞమునకు కూడా పూర్ణాహుతి కానున్నది. ఆనాటి చివరి సభకు పరమపూజ్య శ్రీశ్రీశ్రీ ప్రసన్నానందస్వాములవారు అధ్యక్షతవహించినారు. భగవానుని దివ్యప్రేమను గోపికా భక్తిని మధురముగా ఉపన్యసించినారు.

పిమ్మట శ్రీ ఎమ్. టి. ఆళ్వార్‌గారు నాగార్జున సాగర్ లెక్చరర్ **APRJC** వారు తమ ఉపన్యాసములో నవవిధభక్తులను నవవిధభక్తులు శ్రీరామాయణమున ఉపాసించిన విధమును శ్రవణభక్తికి హనుమయని; కీర్తనకు వాల్మీకి మహర్షియని; స్మరణ భక్తికి సీతామహా సాధ్వియని, పాదసేవాభక్తికి భరతులవారని, అర్చనకు శబరి భక్తి గొప్పదని, వందన భక్తికి శ్రీ విభీషణులని, దాస్య భక్తికి లక్ష్మణస్వామి యని సఖ్యభక్తికి గుహుండనియు, ఆత్మనివేదన భక్తికి జటాయువని రామాయణ పాత్రలను ఔచిత్యమును వివరించిరి.

---

The final destiny of man is the realisation of the Immortal through this mortal frame. —*Swami Sivananda*



కొత్తపేటలో శ్రీ స్వామిజీ షష్ఠిపూర్తి సందర్భంలో ఊరేగింపులో
పల్లకిపై శ్రీ దేవానంద స్వామి



కొత్తపేటలో
స్వామిజీ షష్ఠి
పూర్తి
సందర్భంలో
కృష్ణునిగా
అలంకరింపబడిన
శ్రీ దేవానంద
చిన్నస్వామి

పిమ్మట డా॥ కె. ఎస్. శాస్త్రిగారు పరమపూజ్య మాతా జ్యోతిర్మయానందగారు పూజ్యశ్రీ అభేదానందులవారు శ్రీశ్రీశ్రీ దేవానందుల వారు మహోపన్యాసములు గావించిరి. ఈ ఉపన్యాసములలో మానవుడు మహనీయుడుగా మారుటకు సత్ప్రవర్తన దై వీగుణములు అలవరచుకొన వలెనని సత్సంగమే జీవన్ముక్తికి మార్గమని పరోప కారము పుణ్యప్రదమని మానవులు ప్రపంచము సకలజీవులు శాంతి సౌభాగ్యములతో వర్ధిల్లవలెనని తెలిపిరి. ఈ మూడురోజులు ఈ షష్ట్యబ్దిలో పాల్గొన్న మహనీయులకు గ్రామ ప్రజలకు సుదూర ప్రాంతమునుండి వచ్చిన మహనీయులకు కార్యకర్తలకు పత్రికలవారికి ప్రెస్‌వారికి ఆయా దివ్యజీవన సంఘ సభ్యులకు సకల మానవాళికి తమ శుభాశీస్సులను భగవానుని దివ్యకరుణా కటాక్షములను శ్రీ గురుదేవుల పరమాను గ్రహము లభించవలెనని ఆశీర్వదించినారు.

పై కార్యక్రమములకు, విచ్చేసిన మహాత్ములకు - వివిధ ప్రాంతాలనుండి వచ్చిన భక్తులకు ఈ దిగువ పేర్కొనిన భక్తులంతా, తమ తమ గృహాలలో తగిన వసతిని కల్పించి త్రికరణశుద్ధిగా సేవచేశారు.

1. శ్రీ మండ్ల సత్యన్నారాయణగారు,
(పూజ్యశ్రీ దేవానందస్వాములు వారికి వసతి, మహాత్ములకు, భక్తులందరికీ భోజనసదుపాయములు, వీరి గృహములో - మరియు గృహ ప్రాంగణములో ఏర్పాటుచేసి కుటుంబమంతా గొప్పగా సేవచేశారు.)
2. శ్రీ రెడ్డి నారాయణమూర్తి, మహేశ్
(సభావేదికకు తగిన వసతి కల్పించి సహకరించారు.)
3. శ్రీ రెడ్డి తాతంనాయుడు దంపతులు,
4. శ్రీ రెడ్డి అప్పారావు దంపతులు,
5. శ్రీ వరిగాల ఆనందం దంపతులు,
6. శ్రీ వరిగాల శంకరరావు దంపతులు,
7. శ్రీ రెడ్డి వెంకునాయుడు,
8. శ్రీమతి రొంగలి భవాని దంపతులు.
9. హెడ్మాష్టరుగారు పాఠశాలలో గదులు.

Divine grace demands a sincere and sustained effort.
—*Swami Sivananda*

10. శ్రీ పైలపాల బాబు దంపతులు.
11. శ్రీ కొత్తలి అమ్మాయమ్మ గారు.
12. కో-ఆపరేటివ్ సొసైటీవారి గదులు.
13. పాల సొసైటీవారి గదులు.
14. శ్రీ గంగిరెడ్డి వెంకటరమణ దంపతులు.
15. శ్రీ గాది సత్యము దంపతులు.
16. శ్రీ కర్రి అచ్చియమ్మగారు.
17. శ్రీ రెడ్డి అనంతంనాయుడుగారు.
18. శ్రీ చిరికి పైడంనాయుడుగారు.
19. శ్రీ చిరికి గౌరునాయుడుగారు.
20. శ్రీ తంగేటి అప్పన్నగారు.
21. శ్రీ రొంగలి అమ్మన్నగారు.
22. శ్రీ పొట్నూరు రమణగారు.
23. శ్రీ గిడుతూరి నారాయణమ్మగారు.

శ్రీ రొంగలి శంకరావుగారు, శ్రీరెడ్డినాయుడు బాబుగారు, శ్రీసన్యాసినాయుడు గారు, మొదలగు వారంతా వంటలు, వడ్డనలను చాల నైపుణ్యముగా, నిర్వహించారు.

పై కార్యక్రమములన్నీ జయప్రదముగా జరుగుటకు గాను శ్రీ గుత్తపూడి నూకరాజుగారు, శ్రీ రాజాన గంగారావుగారు, శ్రీ పొన్నగంటి జగ్గారావుగారు సుమరు 2, 3 నెలలనుండి తీవ్రమైన కృషిచేశారు.

శ్రీ గురుదేవ భక్త సమాజం సభ్యులంతా మరియు కొత్తపెంట గ్రామ ప్రజలూ గొప్పగా సహకరించి సేవచేశారు.

శ్రీ గురుదేవ భక్త సమాజం - ఎండపల్లి పాలెం, వేచలం, చందులూరు, విశాఖజిల్లాలోని ఇతరగ్రామాల శిష్య బృందములు సహకరించి సేవ చేశారు.

వీరందరికి శ్రీ గురుదేవుని కటాక్షము లభించుగాక ! ఈ సభలు దిగ్విజయపర చిన వారందరికి శుభ మంగళం.

---

Divine Life is a synthesis of service, devotion and knowledge.
—*Swami Sivananda*

హరిః ఓమ్

# శ్రీశ్రీశ్రీ సద్గురువులు దేవానంద సరస్వతీ మహారాజ్ వారి దివ్య షష్ట్యబ్దపూర్తి మహోత్సవముల సందర్భంగా రాజేరులో జరిగిన మహాసభల ప్రత్యేక నివేదిక

సమర్పణము :

"సాహిత్య శిరోమణి" యం. టి. ఆళ్వారు
M.A. (Phd.)
నాగార్జునసాగరము

ప్రియ ఆధ్యాత్మ బంధువులారా! శ్రీ శివానందవాణి ప్రియతమ పాఠకులారా! ప్రణామములు. ఆంధ్రప్రదేశ్‌లో సకల కళాప్రాంగణము విజయనగరం జిల్లా ప్రాంతము. ఈ ప్రాంతమున ఆధ్యాత్మిక కేంద్రములు, ఆశ్రమములు, మందిరములు చాలా ఎక్కువ. దైవీసంపన్నులు ఈ ప్రాంత ప్రజలు. విజయనగరం జిల్లా కేంద్రమునకు షుమారు 23 కి మీ. దూరములో "బి. రాజేరు" గ్రామమున్నది. ఈ గ్రామము ప్రస్తుతము భక్తి సామ్రాజ్యమునకు రాజధానిగా మారినది.

శ్రీశ్రీశ్రీ సద్గురువులు మన చిన్నస్వాములవారు విశ్వరూపాన్ని ధరించి కొత్తపెంట నుండి రాజేరుకు చేరినారు. జన్మస్థలంలో యశోదాకృష్ణుడే, చిన్నవాడే. కాని కురుక్షేత్రమున దేవదేవునిగా కీర్తించబడినాడు. దేవానందస్వామి గురించి తెలియాలంటే రాజేరు చేరవలసిందే. అక్కడ ఆ మహనీయుడు చిన్నస్వామికాదు, తెలుగువారుకాదు, దేవానందస్వామికాదు. మరి ఎవరు? సాక్షాత్తు శ్రీశ్రీశ్రీ శివానంద సరస్వతియే. అతడే శంకరుడు, అతడే రాముడు, అతడే కృష్ణుడు, అతడే సద్గురు దేవానందగా ఏకగ్రీవముగా మహాత్ములచే అగ్రాసనాధిపతిగా అంగీకరింపబడినాడు. రాబోవు కాలములో శ్రీశ్రీశ్రీ శివానందాశ్రమ నిర్వాహక ధురంధరుడుగా వేనోళ్ళ కీర్తించబడినారు.

రాజేరు గ్రామము మారుమూలనున్నప్పటికీ; భక్తులు సెలయేరులవలె వచ్చిరి. భగవన్నామము యేరులై పారినది. షుమారు 60 గ్రామముల నుండి జన ప్రవాహము పొంగి రాజేరును ముంచివేసినది. లక్షకుపైగా జనసంఖ్య ఆ గ్రామములో కిక్కిరిసి

---

You are possessed by the devil of ignorance. Attain wisdom and become a sage. —*Swami Sivananda*

నది. ఎక్కడా తోపిడి, దొంగతనములు, పోలీసు పహరాలు, బెదిరింపులు, టిక్కెట్ల గోల, వ్యాపార దృక్పథములేదు. కేవలం గురుదేవుల పాదపద్మ సమారాధనే. మహా విస్తీర్ణముగల పొలములలో బ్రహ్మ జ్ఞానయజ్ఞ వేదికలు అమర్చినారు. షుమారు 10 వేలమంది కూర్చొనవచ్చును. సువిశాల ప్రాంగణములో శ్రీశ్రీశ్రీ శివానందులవారి నిలువెత్తు ఛాయా చిత్రము శ్రీశ్రీశ్రీ దేవానందులవారి ఛాయా చిత్రములు చూపరులకు దివ్యానుభూతి నిచ్చునట్లుగా నున్నవి. అక్కడే యజ్ఞశాల నిర్మించి ప్రతిదినము హోమములు చేసినారు. యాగశాలకు ప్రక్కగా కొద్దిదూరములో అన్నపూర్ణ ప్రాంగణము మహాప్రసాద వితరణ (అన్నదానము) జరిగినది. కనుచూపు మేర భోజనశాలను నిర్మించి సెక్టారులుగా విభజించినారు. వంటసామగ్రి చెప్పనలవికాదు. అహోరాత్రములు అగ్ని భగవానుడు ఆనందించినాడు. వైశ్వానరాగ్నికి అలుపులేక సమారాధన జరిగినది. లక్షలాది ప్రజలు మహాప్రసాదము స్వీకరించినారు. గ్రామములకు గ్రామములు వడ్డనలో పాల్గొని నారు. వంతులవారీగా వేలాది కార్యకర్తలు పాల్గొనినారు ఎన్ని తాటిబందులు తాటాకు వెదుళ్ళు నాటినారో వ్రాయశక్యముకాదు. రాజేరులో జరిగిన అన్నదానము అపూర్వమని వచ్చిన భక్తులంతా చెప్పుకొనసాగిరి. ఎప్పటికప్పుడు శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారు తనిఖీచేయుచూ ఏ కార్యక్రమము ఏవిధముగా జరిపిన బాగుండునో దేనిని ఎవ్వరిచేత ఎలాగ చేయించవలెనో సూచనలు చేసెడివారు. వచ్చిన భక్తాదులందరికీ భోజనములను టోకన్ల పద్ధతి దూరభారము లేకుండా ఎట్టి ప్రతినిధి రుసుములు లేకుండా మృష్టాన్నములను పెండ్లివిందువలె వివిధ వంటకములు తీపి పదార్థములతో విస్తరాకులలో వడ్డించుట ఈ కాలమున అపూర్వ విషయమే. గ్రామ పంచాయితీవారు తగినంత నీటివి సప్లయి చేసినారు వీధి దీపములు, ఆరోగ్య పరిస్థితులు, దూరశ్రవణ యంత్రములు, పుష్పములు, స్వామీజీలందరికీ ప్రత్యేక వసతులు, భోజన ఏర్పాట్లు ఆయా కార్యకర్తలు అత్యుత్సాహముతో తమ ఇంటిపనివలే చేసినారు. వారి పేర్లు ఈ నివేదికలో వ్రాయుట కుదరదు కదా ! అట్టివారందరికి పేరుపేరునా ధన్యవాదములే.

## హరిః ఓం

వేదములను ఆరంభించుటకు ముందు హరిః ఓమ్ అని పలుకుట నియమము. అట్లే ఈ బ్రహ్మ జ్ఞానయజ్ఞ మహాసభలకు మొదటిరోజు హరిః ఓమ్ అని యజ్ఞ నారాయణుని ప్రార్థించుచూ 21-2-97 శుక్రవారంనాడు బ్రాహ్మీముహూర్తమున సుప్రభాత



బి. రాజేరులో శ్రీ స్వామి దేవానంద షష్ఠిపూర్తి సందర్భంలో వేదికపై
అధ్యక్ష పదవినలంకరించిన శ్రీ భూమానంద భారతీ స్వాములవారు.



సాధు మాతలను సత్కరిస్తున్న శ్రీ స్వామి దేవానంద.
బి. రాజేరులో శ్రీ స్వామి దేవానంద షష్ఠిపూర్తి సందర్భంలో



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠి పూర్తి మహోత్సవ
సందర్భంగా శ్రీ చదలవాడ వెంకటశేషయ్యగారు ఉపన్యసిస్తున్నారు.



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠిపూర్తి సందర్భంలో
హోమగుండం వద్ద శ్రీ స్వామీజీ

ధ్వనులతో ప్రారంభమైనవి. 5 గంటలకు ధ్వజారోహణ ప్రార్థన; ధ్యానము నిర్వహింపబడినవి. 6 గంటల నుండి 7 గంటల వరకు దివ్యనామ కీర్తనలతో "నగర సంకీర్తనము" ప్రారంభించినారు. ఈ సంకీర్తన వైకుంఠధాముని బ్రహ్మాది దేవతలు మృదంగ తాళములలో కీర్తించినట్లు, ద్రేపల్లెవాసులు గోపాలురు గోపికలు కోలాట మాడినట్లు "నల్లవాడుండే స్థలం మా గోకులం" అంటూ పెద్దపెట్టున మహాధ్వనులతో ఆ ప్రాంతమంతయు దద్దరిల్లినది. భక్తి గంగాప్రవాహము "రాజేరు"లా ప్రవహించినది. గోపాలకృష్ణ భగవాన్‌కీ జై ! భద్రాచల శ్రీ సీతారామచంద్ర భగవాన్‌కీ జై ! పవనసుత హనుమాన్‌కీ జై ! సబ్‌సంతన్‌కీ జై ! జగదంబే మాతాకీ జై అంటూ శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారిచే నిర్వహింపబడిన నగర సంకీర్తన కిలోమీటర్ల దూరము సాగినది. మనము ఎక్కడ వున్నాము కలియుగంలోనా ! సాక్షాత్ శ్రీరామ చంద్రుని త్రేతాయుగంలోనా అని అనిపించినది. స్వామి నర్తనచేసి "నటవర్‌లాల్"గా దర్శనమిచ్చి బృందావన చంద్రుని దర్శింపచేసిరి. మళ్ళీమళ్ళీ ఇట్టి నగర సంకీర్తన దర్శించవలెనని భక్తులు కోరుకొనసాగిరి కాని సంభవమా ! లక్షలాదిమంది ఎక్కడకు రాగలరు ? వచ్చిననూ దివ్యనామ సంకీర్తనకు అవకాశమెట్లు ? ఏమో ? గురుదేవుల అనుగ్రహమున్నచో మరల మరల ఇట్టి నగర సంకీర్తనము జరుగుగాక ! వచ్చిన యావన్మందికి అల్పాహారము (అనల్పముగా) సమర్పించినారు.

ఎప్పటివలె ఈ మూడు దినములలో రాజమహేంద్రవరం సాధు స్త్రీలమఠం అమ్మగార్లు భగవత్ గీతాపారాయణను రోజుకు 6 అధ్యాయములు చొప్పున వేలాది మంది పాల్గొనగా నిర్వహించినారు. ఇది అపూర్వ విషయమే.

## నమః సభాయై

ప్రత్యక్షదైవము శ్రీ సూర్యనారాయణుని సాక్షిగా అన్నట్లు కార్యక్రమము లన్నియూ సమయము నతిక్రమించక; జరుపుట శ్రీ దేవానందులవారి సమయ పరిపాలనకు నిదర్శనము. ఉదయము 9 గంటల నుండి 12 గంటల వరకు సాయంత్రము 4 గంటల నుండి 7-30 గంటల వరకు ఆధ్యాత్మిక మహాసభలలో సమయము నతిక్రమించక అనేకమంది మహాపురుషులు తమతమ అనుభూతులను దివ్య సందేశములను భక్తులందరికీ పంచిపెట్టి ధన్యులను చేసినారు.

---

Where there is no selfishness there is peace, joy and illuminations.
—*Swami Sivananda*

మొదటిరోజున ముఖ్యంగా నాటి సభలకు అఖిలాంధ్ర సాధుపరిషత్ అధ్యక్షులు ఆధ్యాత్మరంగ కురువృద్ధ పితామహులు శ్రీశ్రీశ్రీ భూమానంద భారతీస్వాములవారు అధ్యక్షత వహించి.... తమ దివ్య సందేశములో ఈ శతాబ్దమున శ్రీశ్రీశ్రీ శివానంద సద్గురుదేవుల వాఙ్మయముతో పరిచయములేని ఆత్మవిద్యా సాధకుడు ఉండడని; సెల విచ్చుచూ ఒక చిన్న ఉదాహరణగా— లాస్ ఏంజల్స్ అను దేవత తన చంకలో ఒక పుస్తకము ధరించి అబ్దుల్ ఆడమ్‌కు ప్రత్యక్షమై; తనవద్ద నున్న పుస్తకము మంచి నడవడిక కలవారి పేర్లను కలిగినదని చెప్పగా— ఓ దేవతా! నా పేరును చివరపేరుగా నమోదు చేసుకొనగలవు అని ప్రార్థించెనట. కాని ఆ దేవత కొన్ని దినములు గడచిన పిదప ప్రత్యక్షమై ఆమె పుస్తకము చూపెనట. ఆ పుస్తకములో ఆ భక్తుని పేరు మొదటి పేరుగా వ్రాయబడి యుండుట అతనిని ఆశ్చర్యములో ముంచెనట. దీనినిబట్టి వినయవంతుడు మొదటి స్థానమును పొందునని ఇది దేవానందులవారి విషయమే అని చెప్పుచూ ఈశావాస్య కేనోపనిషత్ సారాంశములుగా భగవంతుని సర్వ వ్యాపకత్వము గూర్చి పలు ఉదాహరణలతో చెప్పి ఆశీర్వదించిరి. పిమ్మట పరమపూజ్య శ్రీశ్రీశ్రీ సర్వేశ్వరానంద స్వాముల వారు మాజీ అఖిలాంధ్ర సాధు పరిషత్ అధ్యక్షులు, వీరు ఉపనిషత్ రహస్యవేత్తలు, సుకవులు. తమ దివ్యప్రసంగములో నిత్యా నిత్య వివేకము గూర్చియు "అంగం గలతం.... ....... .. తదపినముంచ త్యాసాపిండం" మానవుడు తాను నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే; నిశ్శబ్దము శబ్దాతీతమే పరబ్రహ్మతత్త్వమని "తత్త్వమసి" మహావాక్యమును మననం చేస్తూ బ్రహ్మ సాక్షాత్కారము సాధించవలె నని శ్రీశ్రీశ్రీ దేవానందులవారి "పశ్యేమ శరదశ్శతం" "జీవేమ శరదశ్శతం" అని వేదవాక్యములు ఆశాసించినట్లు అనేక వసంతాలు దేశసేవకై వర్ధిల్లెదరుగాక. అని అను గ్రహ భాషణము చేసినారు. అటుపిమ్మట పరమపూజ్య శ్రీశ్రీశ్రీ అభేదానంద స్వాముల వారు శ్రీ రామానందాశ్రమం జి. ఆర్. పురంవారు తమ అత్యద్భుత వాక్ప్రవాహ పటి మతో పురుషులందు పుణ్యపురుషులు వేరని; శ్రద్ధావంతులకే జ్ఞానప్రాప్తి అని; జ్ఞాన ముతో సమానమైన వస్తువు లేదని అట్టి జ్ఞానాన్ని, మహాపురుషులను ఆశ్రయించి తెలుసుకోవాలని ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వస్త్రకథను చెప్పి సమాజంలో డాంబిక ములకే గౌరవమని అవి పరమేశ్వరుని దృష్టిలో చెల్లదని మధురంగా వివరించినారు. తదుపరి పరమపూజ్య శ్రీశ్రీశ్రీ ప్రసన్నానంద స్వాములవారు గండిపాళెం నెల్లూరు

---

**Kindle the light of love in the heart and radiate love and light to one and all.**

*—Swami Sivananda*

జిల్లావారు తమ చమత్కార వేదాంత ఉపన్యాసములో "తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర" అనే గీతావాక్యాన్ని వివరిస్తూ నిరంతము అన్ని కాలాల్లో కాలపురుషుడైన నారాయణుని స్మరించడమే మన విధి అని; ఆంజనేయుడు ఆ విధమగు ఉపాసన చేసి అనన్య భక్తుడుగా మారిన విధాన్ని తెలుపుతూ; మనిషి "శివు"నిగా మారాలంటే వినయం ప్రధానమని అది లేనినాడు మనిషి శవంగా మారుతాడని సాధు సత్పురుషులకు సేవ, నారాయణ సేవ అని పలుపలు విధాలుగా హాస్య భాషణములతో అనుగ్రహించినారు. పిమ్మట శ్రీశ్రీశ్రీ దేవానందులవారు 60 మంది బాల బాలికలకు వివిధ వస్తువులతో సన్మానము జరిపి; మానవజీవిత పునాది విద్యార్థిదశ అని; ఆ దశలో కష్టపడితే జీవితాంతం సుఖపడవచ్చునని మంచి అలవాట్లు, యోగాభ్యాసం, సూర్య నమస్కారములు, పెద్దల దగ్గర వినయం, దేవునియందు నమ్మకం, తల్లిదండ్రుల సేవ, దేశభక్తి సమయపాలనఅలవరచుకోవాలని మనం చేసుకున్న సుకృతం మనలను ఎక్కడఉన్నా రక్షిస్తుందని స్వానుభవాలను విద్యార్థి దశలో తాము పడిన దుర్భర కష్టాలను కళ్ళకు కట్టినట్లుగా వివరించి జన్మను సార్థక్యము చేసుకోవాలని ఆశీర్వదించినారు.

మొదటిరోజున దాదాపు 70 వేలమంది వరకు మహాప్రసాదాన్ని స్వీకరించారు. ఎక్కడ నిలచితే అక్కడే ఆధ్యాత్మిక అనుభూతి. ఎవరినోట విన్నా శ్రీశ్రీశ్రీ దేవానందులవారి దివ్యచరిత్రయే. సాయంత్రం 3 గంటల నుండి 4 గంటల వరకు బ్రిటగుంట భక్తులచే దివ్యనామ సంకీర్తనం చేయబడి శ్రోతలను ఆనంద సాగరంలో ముంచివేసినది.

ఆనాటి సాయంకాల సభకు పరమపూజ్య శ్రీశ్రీశ్రీ సర్వేశ్వరానందజీవారు అధ్యక్షతవహించి జ్ఞానము, దానము, స్నానములచే మానవులు పవిత్రం కావాలని, పాపఫలితమే రోగములని, ఆ రోగములను పోగొట్టుకొనుటకై ఔషధసేవ-జప యజ్ఞాదులు చేసుకొని శరీరమును కాపాడుకొని తద్వారా ఆధ్యాత్మిక ఉన్నతి సాధించవలెనని అన్నమయ - ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయ - కోశములను వాటి విలువలను తెలుసుకోవాలని "త్యాగి" అగుట చాలా కష్టమని త్యాగము ద్వారా అమృతత్వము పొందగలరని విశదీకరించి ఆశీస్సుల నందజేసినారు.

పిమ్మట మహాత్ములు పరమపూజ్యులు శ్రీశ్రీశ్రీ సదానంద స్వాములవారు నెమలికొండ దత్తపీఠమువారు తమ అనుగ్రహ భాషణములో మహాత్ముల సేవ

---

Faith in God illumines the path of the aspirant.

—*Swami Sivananda*

ద్వారానే మనం పవిత్రులం కావలసినదని దృష్టిం జ్ఞానమయీం కృత్వా పశ్యేత్ జ్ఞానమయం జగత్. జ్ఞానంతో జ్ఞానమయమైన జగత్తును సందర్శించాలని మనది మనవాడు నేను నాది ఇవి దుఃఖాన్ని పెదజిమ్ముతాయని "ఆశయా బధ్యతే లోకః" ఆశాపాశాలతో ఈలోకం బంధింపబడుతుంది. సోమరికి ఏదీ సిద్ధించదు.— ఇచ్చినవారికి ఇచ్చును దైవమని మన జీవన నౌక శిథిలం కాకమునుపే ఆ సర్వేశ్వరుని ఆశ్రయించి తరించాలని వివరించినారు

అనంతరం ఉపన్యాస కేసరి శ్రీ చదలవాడ వేంకట శేషయ్యగారు తమ అద్భుత గంగాప్రవాహ ప్రసంగంలో, ఇతరులెరుగకున్న ఈశ్వరుడెరుగడా !! అంటూ మనం చేసే ప్రతిపనిని పైవాడు పలురకాలుగా గమనిస్తూనే ఉంటాడని; నరుని వృత్తాంతము ధర్మదేవత కనిపెడుతూనే ఉంటుందని సమస్త ఔషధాలు పనిచేయకపోయినా శ్రీశ్రీశ్రీ శివానంద గురుదేవులు **Namopathy Never fail** భగవన్నామోపతి వైద్యం విఫలంకాదని చెప్పిన సంగతులను వివరిస్తూ పూరీక్షేత్ర మహాభక్తుడు దయాసింధు కథ వివరించారు. క్షమకలిగిన సిరిగలుగును అని మాట అనేది ఉద్వేగభరితంగా ఉండరాదని, సత్యము, మితము, హితముగా పలుకవలెనని హనుమంతుని వాక్పటిమను తిరువళ్ళువర్ భోజన నియమాన్ని తెలిపి - "న శ్రేయః నియమం వినా" నియమం లేక పోయినచో శ్రేయస్సు లేదని మధురాతి మధురంగా ప్రసంగించినారు. తదుపరి పూజ్య శ్రీశ్రీశ్రీ ఓంకారానంద స్వాములవారు (పెద్దాపురం) తమ దివ్యప్రసంగంలో తమ గురుదేవులు శ్రీ రామకృష్ణానంద స్వాములను కీర్తిస్తూ హనుమానుని దివ్యకీర్తన నర్తన గురించి తెలిపి - దేవదేవుని చింతించు దినము దినము అని భగవత్కీర్తన చేయక సమయం వృధా వృధా అని తెలిపి ప్రహ్లాద - ఆంజనేయులవలె అనన్యభక్తితో ఉండాలని చక్కని దివ్యసందేశాన్ని తమ అనుగ్రహ భాషణ ద్వారా వినిపించినారు. ఆ తరువాత శ్రీశ్రీశ్రీ ప్రసన్నానంద స్వాములవారు మానవ అనే పదానికి ఓ మానవా? నీవు (మా = కాదు నవ = క్రొత్తవాడివి;) నీవు సనాతనుడవే అని వివరిస్తూ-

యస్మాన్నోద్విజతే లోకో-
లోకాన్నోద్విజతే చయః ॥

అనే గీతావాక్యాన్ని వివరిస్తూ ఎవని ద్వారా లోకము ఉద్వేగమును పొందరో ఎవడు లోకముచే ఉద్వేజితుడు కాడో అట్టివాడే ధీరుడని; ఇంద్రుణ్ణి జయించడం కాదు

---

Sow love, reap peace; sow humility, reap reverence: sow meditation, reap wisdom : sow prayer, reap grace.

—*Swami Sivananda*



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠి పూర్తి మహోత్సవ
సందర్భంగా నగర సంకీర్తనలలో ఒక కమనీయ దృశ్యం



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠిపూర్తి సందర్భంలో
అన్నదాన దృశ్యం



రాజోలులో
సత్కరింప
బడినట్టి
శ్రీ దేవానంద
చిన్నస్వామి



పి. రాజేరులో షష్టిపూర్తి మహోత్సవంలో ఉయ్యాల సేవలో
శ్రీ దేవానంద చిన్నస్వామి.

ఇంద్రియాలను జయించడం గొప్ప అని; సుఖ దుఃఖాలు రెండు బ్రహ్మస్వరూపాలే అని శ్రీరామతీర్థస్వామివారి సమయపాలన గురించి తెలిపి మనస్సును క్రమంగా వశం చేసుకొని మురళీమనోహర విలాసమందిరంగా మలచుకోవాలని ఉద్బోధించినారు. అటు పిమ్మట మొదటిరోజు కార్యక్రమములను ముగించు సందర్భముగా పరమపూజ్యులు శ్రీశ్రీశ్రీ దేవానందస్వాములవారు దాశరధి శతకపద్యములతో ప్రార్థనచేసి, శ్రవణ మనన నిధి ధ్యాసలు మానవుని మహనీయునిగా తీర్చిదిద్దునని సత్సాంగత్యమే ఈ లోక మునకు శరణ్యమని మహనీయులవాక్కులు వ్యర్థము కావని చెప్పుచూ ఒకరాజుగారు తనకుమారుడు దొంగగా మారునని జ్యోతిష్కులచే సూచింపబడిన వెంటనే సత్పురుషుల సాంగత్యం చేయించి భయంకర గజదొంగ కాకుండా చిన్ని దొంగగా మార్చ గలిగాడని తెలియజేసి సజ్జనసాంగత్యము చేయగా చేయగా చక్కని మార్పువచ్చునని సత్పురుషుల వాక్కులను మననం చేస్తూ ఉండాలని సందేశమిచ్చుచూ దివ్యనామ సంకీర్తనములకు అత్యద్భుతముగా భక్తులకు పంచిపెట్టిరి. పిదప శాంతి మంత్రములు హారతులతో ఆనాటి కార్యక్రమములు హోమములు ముగిసినవి.

## పూర్వా సంధ్యా ప్రవర్తతే

22-2-1997 శనివారం రెండవరోజు బ్రాహ్మీముహూర్తమననే వేలాదిమంది భక్తులు భగవానునికి కౌసల్యా సుప్రజారామ ! పూర్వాసంధ్యా ప్రవర్తతే

ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్॥

అంటూ సుప్రభాతాలు పాడారు. ప్రార్థన - ధ్యానము ఎప్పటిలాగే జరిగినవి. ఇక నగర సంకీర్తన గురించి చెప్పలేము వేలాది జనసంకీర్తన జేయుచుండగా రేగిన పాదధూళితో ఆకాశమావరించి పోయింది. భక్తుల పాదధూళి ఎంతటి సుకృతాత్ములకు లభించునో గదా ! ఆ దృశ్యం చూడడానికి రెండుకన్నులుచాలవు. వర్ణించడానికి ఈనాలుకకు శక్తి చాలదు. అది దేవగానం దానిలోని ఆనందం - దేవానందం - ఆ బృందం-బృందావన భక్తబృందమే, శ్రీహరినామంతో దద్దరిల్లుతూ మహాసభలు 2వ రోజుకు చేరుకున్నాయి. ఎంత మందికి ఎవరు ప్రచారం చేశారో తెలియదు. బలవంతం అసలు లేనేలేదు, ఎవ్వరి చేతిలోచూచినా పండ్లు పువ్వులు; రాజేరు రాజేరు జనప్రవాహంగా మారిపోయింది.

---

He who attains God will never feel hungry or thirsty.

*—Swami Sivananda*

శ్రీ దేవానందుల వారి దర్శనం అపూర్వం ఆశ్చర్యంగా సాగుతోంది. ఎప్పటిలాగే గీతా పారాయణాదులు పూర్తి అయ్యాయి. మహాసభమళ్ళీ 9.00 గం॥లకు ప్రారంభమైంది. విశాలమైన వేదిక అంతా నిండిపోయింది. ఎన్నివేల మంది కూర్చున్నారో చెప్పలేం. ఆ బ్రహ్మజ్ఞాన దివ్యసభకు పరమ పూజ్య శ్రీశ్రీశ్రీ అభేదానందస్వాముల వారు అధ్యక్షత వహించారు తమ ఉపన్యాసంలో శ్రీదేవానందుల వారి భక్తి పారవశ్యత గురించి ఆ స్వామితో తమకున్న సాన్నిహిత్యాన్ని పలుపలువిధములుగా వివరిస్తూ, "హరికథా పీయూషవర్జితమ్-దుర్దినమ్" ఏ రోజున హరికధ అనే అమృతం లభించదో అదే దుర్దినముగాని; మేఘాలతో సూర్యుడు కప్పబడిన రోజు దుర్ధినం కాదు. అని మహాభాగవతంలోని శ్రీకృష్ణ పరమాత్మ బాల్య ఘట్టాలను పోతనగారి సుధామకరంద తేట తెనుగు పద్యాలను రాగయుక్తంగా పాడుతూ తేనెలూరించినారు శ్రీకృష్ణబ్రహ్మ సాక్షాత్కారమైనది. శ్రోతలు మంత్రముగ్ధులై తలలూపసాగారు. "సంజగౌ వేణునా దేవకీనందనః" ఆ దేవకీనందనుని మురళీగానమే సృష్టిని ఆపివేసిందట. ఇక సామాన్యుల అసమాన్యుల చైతన్యము చెప్పతరమా ! శ్రీ శుకులవారు ఏడురోజులలో పరీక్షిత్తుకు కృష్ణానుభవాన్ని కలగించారని మనం కూడా ఆ దేవదేవుని చింతించి మన దినములను సార్థకమొనరించుకొని తరించాలని ఆశీర్వదించినారు.

అటుపిమ్మట శ్రీశ్రీశ్రీ కృష్ణానందగిరి స్వాములవారు ఇనమడుగు నెల్లూరు జిల్లావారు. తమగాంభీర్యమగు కంఠస్వరంతో హరినామ వైభవాన్ని ఉగ్గడిస్తూ న,నామ సదృశం జ్ఞానం - న, నామ సదృశం వ్రతమ్ నామంతో సమానమైన జ్ఞానంగాని సమానమగు వ్రతదీక్షలుగాని లేవని అమానినా మానదీయేన కీర్తనీయః సదా హరిః ఎట్టిదోషభావం లేక ఆ శ్రీహరినే సదాకీర్తించవలెనని; ఈ కలియుగంలో -

హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం ।
కలౌనాస్త్యేవ - నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥

హరినామమొక్కటే తరుణోపాయము - దీనికన్నమించిన మార్గం లేదు లేదు లేనేలేదనే మహాత్ముల వచనసారాంశాన్ని అందించారు.

సాటిలేని ఐశ్వర్యము, ధర్మము, కీర్తి సంపదలు - జ్ఞానము - వైరాగ్యము అనునవి భగవంతుని లక్షణములని అవి నారాయణునికి మాత్రమే ఉన్నవని

అతడే భగవంతుడని స్వామీ నీ చరణసేవ ప్రసాదించుమా అని ప్రార్థిస్తూ ఆశీస్సుల నందించినారు.

శ్రీ జ్ఞానేశ్వర్ గారు సిద్ధిపేట మహాభక్తులు చక్కని చిత్రకారులు ఫోటోగ్రాఫర్ వీరు కొత్తపెంటలో శ్రీశ్రీశ్రీ దేవానందస్వామివారి శ్రీకృష్ణ అలంకారమును పుష్ప కిరీటం దాల్చిన ఛాయాచిత్రమును సమర్పించి ఆశీస్సులు పొందినారు. తరువాత శ్రీశ్రీశ్రీ భూమానందస్వామివారి శిష్యురాలు శ్రీ మాతా ప్రేమానందగారు గీతాసార ముగా పత్రం పుష్పం ఫలంతోయం అను శ్లోకమునకు ద్రౌపతి, గజేంద్రుడు, శబరి, రంతిదేవులు వరుసగా ఎలా ఎవరు సమర్పించి ధన్యత చెందిరో ఆ విషయమును చెప్పి ఆశీర్వదించినారు.

అటుపిమ్మట మహాపురుషులు శ్రీశివానందస్వామి శిష్యాగ్రగణ్యులు ఏకలవ్యుని వంటి వారు శ్రీశ్రీశ్రీ గురుసేవానందజీ మహరాజ్ బరంపురంవారు అత్యంత ప్రేమ-వినయము - భక్తి-ఉట్టిపడుచూ ప్రసన్నమగు తమ ఉపన్యాసమును ప్రజలపై వర్షించిరి. చిన్నస్వామివారు మాకు పెద్దస్వామి. వారిభాష భక్తులభాష. మనం వారి సమకాలీనులం కావడం మన అదృష్టము. వారిగురించి మీ ప్రాంతమువారికన్నా మా ప్రాంతీయులకే ఎక్కువగా తెలుసుకునే అదృష్టం కలిగింది. వారు మంచుకొండవలె పైకి కొద్దిగా కనబడి దివ్య తేజస్సునంతటిని లోలోపలదాచుకున్న మహనీయులు. చిన్నస్వామినుండి ధైర్యం. నేర్చుకోవాలి. దానం నేర్చుకోవాలి, సేవ నేర్చుకోవాలి, వినయం నేర్చుకోవాలి, భక్తి భజన నిరాడంబరం నేర్చుకోవాలి ఈ మహాత్ముడే సేవానందులవారి ఔన్నత్యాన్ని అరటి పండు ఒలిచినట్లు చెప్పి - శ్రోతలను దివ్యజీవన మార్గములో పయనించవలెనని ఆశీర్వదించినారు.

తరువాత శ్రీశ్రీశ్రీ భూమానందస్వాములవారు తమ అనుగ్రహ భాషణములో దైవీగుణములు 26 కలవని వాటిని గీతలో గమనించవలెనని శ్రీశ్రీశ్రీ దేవానందుల వారినుండి గృహస్థులుకూడా దానం ఎలాచేయాలో నేర్చుకొనవచ్చునని, భోగానభుక్తాః వయమేవ భుక్తాః నిజానికి భోగాలను మనం అనుభవించడంలేదని ఆ భోగములే మనలను కబళించుచున్నవని; ఇంద్రియ పటుత్వం ఉన్నప్పటికీ ఇంద్రియాలను వశం

---

Life up your eyes and behold the beauty and glory of the Lord
—*Swami Sivananda*

చేసుకోవాలని దైవీసంపద వృద్ధిచెందించుకొని దివ్యమార్గములో పయనించుచూ దివ్య జ్యోతి దర్శనం చేయాలని ఆశీర్వదించినారు. పిమ్మట గురుసార్వభౌములు శ్రీశ్రీశ్రీ దేవానంద స్వామిగారు తమ షష్ట్యబ్దిపూర్తికి సాద్గుణ్యముగా 60 మంది పురుషులకు స్త్రీలకు ధోవతులు కండువాలు చీరలు రవికెలు దానం చేసి శ్రీ శివానందస్వామి శిష్యులని వారి దానము ద్వారా లోకులకు చెప్పకనే చెప్పినట్లు, భావించిరి, ఆనాటి మధ్యాహ్నం శనివారం 3 గం॥నుండి 4 గం॥వరకు దివ్యనామ కీర్తన కొత్తపేట భక్తులు, మరియు కొత్తవలస గుమడాం భక్తుల ద్వారా అత్యద్భుతముగా ఆనందపరవశముతో నిర్వహించబడినది. సాయంకాల దివ్యజ్ఞాన సభలు 4 గంటలకు ప్రారంభమైనవి, ఈనాటి సాయంకాల సభకు పూజ్యశ్రీ మాతా శాంతి బాయమ్మగారు రాజమహేంద్రి సాధుస్త్రీల మఠం అమ్మవారు అధ్యక్షత వహించిరి.

తమ అధ్యక్షోపన్యాసములో "వేదాంత తత్త్వములతో కూడిన లాలిపాటలను పాడి సర్వం దుఃఖమయమని అశాశ్వతమని; వైరాగ్యమే అభయమని ఈ చరాచర జగత్తును జ్ఞాని నాటకమువలే గమనించునే గాని దుఃఖించడని విద్య - వినయం ఈ బుద్ధులను తల్లులు తమ బిడ్డలకు నేర్పడంలో ప్రధానపాత్ర వహించాలని, అహంకారము మమకారమున వదిలి అందరిలోనూ అంతటా ఆ సర్వేశ్వరుని దర్శించాలని అట్టివారికి చింతానాస్తి" అని మధురాతి మధురంగా అనుగ్రహించినారు. పిమ్మట ఓంకారానందస్వాములవారు పెద్దాపురం తమ అనుగ్రహభాషణములో రజ్జుసర్పభ్రాంతిని వివరించి భ్రాంతిని తొలగించుకుంటే శాంతి కలుగునని ఈ ఆత్మను ఎవ్వరు ఏ విధమగు అస్త్రశస్త్రాలతో నాశపరచలేరని తండ్రి హరి చేరుమనెడి తండ్రి తండ్రి అనే ప్రహ్లాదుల వారి జ్ఞానమే నిజమైన జ్ఞానమని అట్టి జ్ఞానాన్ని పొందితే "పరశాంతిం అచిరేణాధి గచ్ఛతి" త్వరలోని శాశ్వత జ్ఞానాన్ని పొందు ననెడి గీతావాక్యమును శ్రీ కృష్ణ పరమాత్మ సందేశమును మనోరంజకముగా అనుగ్రహించినారు. అనంతరము జగద్గురు పీఠాధిపులు కులపతులు శ్రీమాన్ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి కుమారుడు శ్రీమాన్ ఎక్కిరాల అనంత కృష్ణగారు తమ గంగాప్రవాహ ఉపన్యాసములో భాగవత ధర్మముల గురించి విపులంగా వివరిస్తూ నమస్కారము దుఃఖమును తొలగించునని నమస్కారము వలన పాపములు క్షీణమగునని; ప్రణామో దుఃఖశమనః తం నమామి హరింపరమ్" అంటూ పరమాత్మపై గోపీజనులు జూపిన భక్తి అలవరచుకొనవలెనని

"యథా వ్రజ గోపికానామ్", అంటూ ఆ భక్తి "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అది పరమ ప్రేమగా నిరంతర భావనా ప్రకర్షతో ఉప్పొంగి పొరలాలని ఆ శ్రీకృష్ణుడు అందర హృదయాలలో "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అన్నట్లు వేంచేసి ఉంటాడని ఆయనను సంపూర్ణముగా శరణపొందుటయే నిజమగు గోపీభక్తి యని పలు పలు ఉదాహరణలతో ప్రసంగించి ఆశీర్వదించినారు.

పిమ్మట మాతాపూజ్యశ్రీ దయాబాయమ్మగారు అద్భుతమగు భజనలు దివ్య నామసంకీర్తనలుచేసి భక్తిపారవశ్యము గావించినారు. పిమ్మట దత్తపీఠనిర్వాహకులు నెమలికొండ ఆశ్రమవాసులు శ్రీశ్రీశ్రీ సదానంద స్వాములవారు తమ అనుగ్రహ భాషణములో తృప్తి, మానవునకు అన్నిటికన్నా గొప్ప భాగ్యమని తృప్తిలేని వాని జీవనము నరకప్రాయమే అని; ఈ చరాచర జగత్తు అంతా ఆ పరమేశ్వరుని లీలా నాటకమని పూర్వం జనకమహారాజు ఒకానొక పర్యాయము గుఱ్ఱం కళాబులో కాలు పెట్టి ఎగిరేలోపల ఎవరైనా బ్రహ్మానుభవం పొందగలరా ? అని అడిగిన ప్రశ్నకు అష్టావక్రులవారు అది సాధ్యమే అని చెప్పిన వృత్తాంతమును తెలిపి మానవుడు దివ్య జీవన పథములో చరించుటకు శ్రీశ్రీశ్రీ శివానందుల వారి సూక్తులు శ్రీశ్రీశ్రీ దేవా నందులవారి జీవనము మనకు ఆదర్శమగుగాక అని ఆశీర్వదించిరి. అనంతరము ఉప న్యాస కేసరి శ్రీ చదలవాడ వేంకట శేషయ్యగారు గూడూరు దివ్యజీవన సంఘ అధ్యక్షులు తమ గంభీర ఉపన్యాసములో శ్రీరామచంద్రులవారు అడవికి బయలుదేరిన సమయములో కౌసల్యాదేవి పలికిన మంగళ వాక్యములను వివరించుచూ-

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే ।
వృత్రనాశే సమభవత్తత్తే భవతు మంగళమ్ ॥
యన్మంగళం సుపర్ణస్య వినతా కల్పయత్ పురా ।
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్ ॥

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతోవజ్రధరస్యయత్ ।
అదితిర్మంగళం ప్రాదాత్ తత్తే భవతు మంగళమ్ ॥
త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణోరమిత తేజసః ।
యదా సీన్మంగళం రామ ; తత్తేభవతు మంగళం ॥

---

Purify your heart. Seek the Lord there and in solemn Silence.
—*Swami Sivananda*

చేసుకోవాలని దైవీసంపద వృద్ధిచెందించుకొని దివ్యమార్గములో పయనించుచూ దివ్య జ్యోతి దర్శనం చేయాలని ఆశీర్వదించినారు. పిమ్మట గురుసార్వభౌములు శ్రీశ్రీశ్రీ దేవానంద స్వామిగారు తమ షష్ట్యబ్దిపూర్తికి సాద్గుణ్యముగా 60 మంది పురుషులకు స్త్రీలకు ధోవతులు కండువాలు చీరలు రవికెలు దానం చేసి శ్రీ శివానందస్వామి శిష్యులని వారి దానము ద్వారా లోకులకు చెప్పకనే చెప్పినట్లు, భాసించిరి. ఆనాటి మధ్యాహ్నం శనివారం 3 గం॥నుండి 4 గం॥వరకు దివ్యనామ కీర్తన కొత్తపేట భక్తులు, మరియు కొత్తవలస గుమడాం భక్తుల ద్వారా అత్యద్భుతముగా ఆనందపరవశముతో నిర్వహించబడినది. సాయంకాల దివ్యజ్ఞాన సభలు 4 గంటలకు ప్రారంభమైనవి. ఈనాటి సాయంకాల సభకు పూజ్యశ్రీ మాతా శాంతి బాయమ్మగారు రాజమహేంద్రి సాధుస్త్రీల మఠం అమ్మవారు అధ్యక్షత వహించిరి.

తమ అధ్యక్షోపన్యాసములో "వేదాంత తత్త్వములతో కూడిన లాలిపాటలను పాడి సర్వం దుఃఖమయమని అశాశ్వతమని; వైరాగ్యమే అభయమని ఈ చరాచర జగత్తును జ్ఞాని నాటకమువలే గమనించునే గాని దుఃఖించడని విద్య - వినయం ఈ బుద్ధులను తల్లులు తమ బిడ్డలకు నేర్పడంలో ప్రధానపాత్ర వహించాలని, అహంకారమును మమకారమున వదిలి అందరిలోనూ అంతటా ఆ సర్వేశ్వరుని దర్శించాలని అట్టివారికి చింతానాస్తి" అని మధురాతి మధురంగా అనుగ్రహించినారు. పిమ్మట ఓంకారానందస్వాములవారు పెద్దాపురం తమ అనుగ్రహభాషణములో రజ్జుసర్పభ్రాంతిని వివరించి భ్రాంతిని తొలగించుకుంటే శాంతి కలుగునని ఈ ఆత్మను ఎవ్వరు ఏ విధమగు అస్త్రశస్త్రాలతో నాశపరచలేరని తండ్రి హరి చేరుమనెడి తండ్రి తండ్రి అనే ప్రహ్లాదుల వారి జ్ఞానమే నిజమైన జ్ఞానమని అట్టి జ్ఞానాన్ని పొందితే "పరశాంతిం అచిరేణాధి గచ్ఛతి" త్వరలోని శాశ్వత జ్ఞానాన్ని పొందు ననెడి గీతావాక్యమును శ్రీ కృష్ణ పరమాత్మ సందేశమును మనోరంజకముగా అనుగ్రహించినారు. అనంతరము జగద్గురు పీఠాధిపులు కులపతులు శ్రీమాన్ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి కుమారుడు శ్రీమాన్ ఎక్కిరాల అనంత కృష్ణగారు తమ గంగాప్రవాహ ఉపన్యాసములో భాగవత ధర్మముల గురించి విపులంగా వివరిస్తూ నమస్కారము దుఃఖమును తొలగించునని నమస్కారము వలన పాపములు క్షీణనమగునని; ప్రణామో దుఃఖశమనః తం నమామి హరింపరమ్" అంటూ పరమాత్మపై గోపీజనులు జూపిన భక్తి అలవరచుకొనవలెనని

God is immanent, Brahman is transcendent. —*Swami Sivananda*

"యథా వ్రజ గోపికానామ్", అంటూ ఆ భక్తి "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అది పరమ ప్రేమగా నిరంతర భావనా ప్రకర్షతో ఉప్పొంగి పొరలాలని ఆ శ్రీకృష్ణుడు అందర హృదయాలలో "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" అన్నట్లు వేంచేసి ఉంటాడని ఆయనను సంపూర్ణముగా శరణపొందుటయే నిజమగు గోపీభక్తి యని పలు పలు ఉదాహరణలతో ప్రసంగించి ఆశీర్వదించినారు.

పిమ్మట మాతాపూజ్యశ్రీ దయాబాయమ్మగారు అద్భుతమగు భజనలు దివ్య నామసంకీర్తనలుచేసి భక్తిపారవశ్యము గావించినారు. పిమ్మట దత్తపీఠనిర్వాహకులు నెమలికొండ ఆశ్రమవాసులు శ్రీశ్రీశ్రీ సదానంద స్వాములవారు తమ అనుగ్రహ భాషణములో తృప్తి, మానవునకు అన్నిటికన్నా గొప్ప భాగ్యమని తృప్తిలేని వాని జీవనము నరకప్రాయమే అని; ఈ చరాచర జగత్తు అంతా ఆ పరమేశ్వరుని లీలా నాటకమని పూర్వం జనకమహరాజు ఒకానొక పర్యాయము గుఱ్ఱం కళాబులో కాలు పెట్టి ఎగిరేలోపుల ఎవరైనా బ్రహ్మానుభవం పొందగలరా ? అని అడిగిన ప్రశ్నకు అష్టావక్రులవారు అది సాధ్యమే అని చెప్పిన వృత్తాంతమును తెలిపి మానవుడు దివ్య జీవన పథములో చరించుటకు శ్రీశ్రీశ్రీ శివానందుల వారి సూక్తులు శ్రీశ్రీశ్రీ దేవా నందులవారి జీవనము మనకు ఆదర్శమగుగాక అని ఆశీర్వదించిరి. అనంతరము ఉప న్యాస కేసరి శ్రీ చదలవాడ వేంకట శేషయ్యగారు గూడూరు దివ్యజీవన సంఘ అధ్యక్షులు తమ గంభీర ఉపన్యాసములో శ్రీరామచంద్రులవారు అడవికి బయలుదేరిన సమయములో కౌసల్యాదేవి పలికిన మంగళ వాక్యములను వివరించుచూ-

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే ।
వృత్రనాశే సమభవత్తత్తే భవతు మంగళమ్ ॥
యన్మంగళం సుపర్ణస్య వినతా కల్పయత్ పురా ।
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్ ॥

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్ ।
అదితిర్మంగళం ప్రాదాత్ తత్తే భవతు మంగళమ్ ॥
త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణోరమిత తేజసః ।
యదా సీన్మంగళం రామ ! తత్తేభవతు మంగళం ॥

---

Purify your heart. Seek the Lord there and in solemn Silence.
—*Swami Sivananda*

శ్రీరామచంద్రునకు, ఇంద్రునకు అతని తల్లి ఇచ్చిన మంగళము గరుడ భగవానునికి అతని తల్లి వినతాదేవి ఇచ్చిన మంగళములు త్రివిక్రమావతార రూపియగు ఆ నారాయణునకు వేదములు పలికిన మంగళములు చేకూరుగాక ; అను ఆశీర్వచన; రామాయణ శ్లోకములను ఉపన్యసించి శ్రీరాముని అరణ్యవాసము కిష్కింథాగమనము; సుందరకాండ దివ్యసందేశము, యుద్ధకాండ ధర్మములను, రామరావణ యుద్ధములను, రామాయణ దివ్యసందేశమును, కన్నులకు కట్టినట్లు శ్రోతలను ఆకర్షించురీతిగా ఉపన్యసించిరి.

చివరగా శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారు తమ దివ్యసందేశములో "ఉద్ధరేత్ ఆత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్" అంటూ మనలను మనమే ఉద్ధరించుకొనవలెనేగాని మనలను మనమే నాశపరచుకొనరాదని పశుపక్ష్యాదులకన్న జ్ఞానముతో విశిష్టముగా నున్న మానవుడు లోకోపకారిగా ఉండవలెనని "కురు పుణ్యమహోరాత్రం స్మరనిత్యము నిత్యతామ్" అహోరాత్రములు పుణ్యకార్యములను చేయుచూ ఈ ప్రపంచమును అశాశ్వతముగాభావించి ఆనందానుభూతిని పొంది భగవదనుగ్రహంతో తరించవలెనని ఆశీర్వదించినారు.

**23-2-97** **ఆదివారం-మూడవరోజు**

# విశ్వరూప సందర్శనము

మూడవరోజు ఇది. శ్రీ దేవానందులవారు మూడడుగులుగా పెరిగినరోజు విశ్వరూపమును దాల్చినరోజు. సహస్ర శీర్షములతో సహస్రాక్షునిగా సహస్రబాహు పరివేష్టితునిగా అందరి హృదయాలలో సాక్షాత్కరించిన రోజు, మరపురాని రోజు,

ఎప్పటివలె ప్రభాతవేళలో సుప్రభాతము ప్రార్థన ధ్యానము నిర్వహింపబడినవి. శ్రీశ్రీశ్రీ దేవానందులవారి నేతృత్వములో నగర సంకీర్తన మారుమ్రోగినది దిక్కులు పిక్కటిల్లు ధ్వనులతో శంఖారావములతో రంగు జెండాలతో హరినామముతో విరాట్ నారాయణుడు నగర సంకీర్తనలో తాండవమాడిన రోజు- నల్లవాడుండే స్థలం మా గోకులం అంటూ ప్రతి ఒక్క భక్తుడు పారవశ్యమున మృదంగ తాళములతో నర్తిం

చిన రోజు. సంకీ ర్తన అనంతరము శ్రీమద్భగవద్గీత 13వ అధ్యాయము నుండి 18వ అధ్యాయము వరకు సామూహిక పారాయణ చేయబడి పూర్ణాహుతిని పొందినరోజు శ్రీశ్రీశ్రీ దేవానందస్వాముల వారి భవ్య దివ్యజీవనమునకు మంగళారతులు ఎత్తుచూ ఆయుష్ హోమము జరిగి పూర్ణాహుతి నొందినది.

ఆనాటి బ్రహ్మయజ్ఞ జ్ఞానయజ్ఞమునకు అధ్యక్షులుగా పరమపూజ్య శ్రీశ్రీశ్రీ గురుసేవానంద మహరాజ్ బరంపురం ఒరిస్సావారు వ్యవహరించినారు. తమ సందేశ ములో ఆంగ్లభాషలో తప్పిపోయిన రాజకుమారుని కథ చెప్పినారు. తిరిగి ఆ రాజకుమా రుని గురుదేవుడు గుర్తించి అతని పూర్వ జీవితమునకు స్వస్తి చెప్పించి మరల చాలా కాలము పిదప అతని రాజ్యమునకు తీసుకునివచ్చి: అతని పుట్టు పూర్వోత్తరములను తెలిపి, రాజుగారి దుఃఖమునుకూడా పోగొట్టి ఆనందము కలిగించి మహాసామ్రాజ్య మును పట్టాభిషిక్తుని గావించి క్షణకాలము క్రిందటనున్న దైన్యమును పోగొట్టి రాజ రికమును ప్రసాదించిన రీతిని వివరించుచూ మనము కూడా మన తండ్రియగు సర్వే శ్వరునకు మన అజ్ఞానముచే దూరమై కొట్టుమిట్టాడుచున్నామని గురుదేవులు దృష్టిపడిన తక్షణమే మాయామేయ జగము దూరమై, భగవంతుని సామ్రాజ్యమున చేరగలమని మనము అతని పుత్రులమని దివ్యజీవనము ద్వారా దివ్యస్వరూపుని చేరుకొనగలమనెడి శ్రీశ్రీశ్రీ శివానందులవారి శ్రీసూక్తులను వివరించిరి. కావున పరమాత్మకు జీవాత్మకు అనుసంధానకర్త గురుదేవులని ఆ మహాత్ముని కృపయే చాలునని తెలిపి ఆశీర్వదించిరి. వీరి ఆంగ్లభాషా ప్రసంగమును వెనువెంటనే శ్రీ యం టి. ఆళ్వార్‌గారు తెలుగుభాషలో తర్జుమాచేసి శ్రోతలకు ఆనందమును చేకూర్చిరి.

అనంతరము శ్రీశ్రీశ్రీ భూమానంద స్వాములవారు తమ దివ్య ప్రసంగంలో ప్రస్థానత్రయముల గురించి వివరించుచూ "మహాత్మనో యేఽగతః సపంథాః" మహా పురుషులు ఏ మార్గము ననుసరించిరో అదియే సన్మార్గమని; సుఖ దుఃఖములు మానవు నకు సహజ జాతములను వానిని ఓర్చుకొని గమ్యం చేరవలెనని, "సన్యశ్య శ్రవణం కుర్యాత్" అన్నిటిని త్యజించి పరమాత్మపై ధ్యానము నిలిపి శ్రవణము చేయవలెనని వివేక చూడామణి రహస్యములను తెలుపుచూ పృధివ్యప్ తేజోవాయి ఆకాశ తత్త్వము

---

The essence of man and the essence of the world are the same.

—*Swami Sivananda*

లనువాటి లఘుత్వ గురుత్వములను వివరించినారు. సాధనద్వారా నియమమగు జీవనము ద్వారా అద్వైతసిద్ధి పొందవలెనని అనుగ్రహ భాషణము చేసినారు.

అటుపిమ్మట శ్రీశ్రీశ్రీ యోగానంద స్వాములవారు (గంగచోళ్ళపెంట వారు) యోగాభ్యాసము గూర్చి వివరించుచూ

సమం కాయ శిరోగ్రీవం ధారయన్ అచలం స్థిరం ।
సంప్రేక్ష్య నాసికాగ్ర్యంస్వం దిశశ్చా నవలోకయన్ ॥
భగవద్గీత 6వ అధ్యాయం

అను శ్లోకమును బాగుగా వ్యాఖ్యానించి యోగసాధన ద్వారా మూలాధార - స్వాధిష్ఠాన - మణిపూరక - అనాహత - విశుద్ధ - ఆజ్ఞేయ చక్రములను మేల్కొల్పు పద్ధతిని పతంజలి యోగవిద్యను చక్కగా విశ్లేషించి సాధకులకు ఎంతో హాయిగూర్చి యోగసాధన ద్వారా దివ్య దేహమును సాధింపవచ్చునని అనుగ్రహించినారు

పిమ్మట పరమపూజ్యశ్రీ వేంకటేశ్వరానందగారు తమ ఆధ్యాత్మిక ప్రసంగములో శారీరక చికిత్సాలయములు వేలకొలది పెరుగు ఈ రోజులలో ఆత్మ చికిత్సాలయములు తగినన్ని లేవని మూల ప్రకృతులకు చికిత్స జరిగినచో ప్రశాంతత లభించునని ఆనందం అనునది వస్తుసామగ్రిలో లేదని ఇతరుల ఆనందములోనే తన ఆనందము దాగి ఉన్నదని మనము సన్మార్గమును అవలంబించి సాధుపురుషులుగా నున్నచో ఆ పరమాత్మ అనుగ్రహము తప్పక లభించునని ఆశీర్వదించినారు.

తరువాత పరమపూజ్య మాతా గాయత్రీబాయిగారు సాధుస్త్రీల మఠం రాజమహేంద్రి అమ్మగారు తమ చల్లని ప్రసంగములో

శ్లో॥ గంగాపాపం, శశీతాపం, దైన్యం కల్పతరుస్తథా ।
పాపం తాపం దైన్యంచ హన్తి సజ్జన సంగమః ॥

ఈ లోకంలో గంగానది పాపాన్ని, చంద్రుడు తాపాన్ని దారిద్ర్యాన్ని కల్పతరువు పోగొట్టుతాయి. కాని ఈ మూడు కార్యాలను తీర్చడానికి సాధుసాంగత్యము

Love alone can cure all the ills of life.
—*Swami Sivananda*



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠి పూర్తి
మహోత్సవ సందర్భంగా కృష్ణునిగా అలంకరించిన దృశ్యం



బి. రాజేరులో శ్రీ దేవానంద స్వామీజీ షష్ఠిపూర్తి
సందర్భంలో వేదికపై ఆసీనులైయున్న స్వాములవారు

ఒక్కటే చాలు అని వివరించుతూ- నిశ్చింత రామయ్య అనే జ్ఞానిని అగ్ని, ఇంద్రులు పరీక్షించి అతని వైరాగ్యానికి సంతసించి ఆశీర్వదించినారని తెలుపుతూ వైరాగ్యమే నిజమైన నేస్తమని భయ రహితమని; దివ్యజీవన సహకారియని ఆశీర్వదించినారు—

అనంతరము శిష్టా శాంతగారు (వీరు శ్రీ శిష్టా సుబ్బారావుగారు భగవద్గీత వ్యాఖ్యానకర్తగారి కుమార్తె) శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారిని త్రివిక్రమావతారునిగా కీర్తించుచూ గురుదేవులు శివానందులు బడాస్వామి అని వీరు దేవానందులు చిన్నస్వామి అని కీర్తిగావించితిరని శివానందులు మహాకుటుంబి అని వారి సంసారమే పెద్దదని వారికి "శివానందస్వాములు" అనే పేరును శ్రీ సుబ్బారావుగారు ప్రచారముచేసిరని తమ చిన్ననాటినుండి శ్రీశ్రీశ్రీ దేవానందస్వాములవారితో గల పరిచయ భాగ్యమును అనుభూతులను రమణీయముగా వివరించి తెలిపినారు.

## సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే

చివరగా శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారు మహాత్ములకు సన్మానములను కనీవినీ ఎరుగని రీతిన జరిపించిరి. మహాత్ములు వేదికపై అగ్రాసనములను అలంకరించిరి. కాషాయవస్త్రశోభతో సువాసనల పరిమళాలతో శ్రీ మహావిష్ణువు సహస్రశీర్షములను దాల్చినట్లు మహాత్ములందరిని ఒకచోట కూర్చుండబెట్టిరి. అందరి పాదపద్మములను తామే స్వయముగా ప్రక్షాళనముచేసి ఆ నీటిని శిరముపైదాల్చిరి. ఆ సమయమున "యోగిహృద్ధ్యాన గమ్యమ్" అన్నట్లు శ్రీహరి అందరిలో చిత్ శక్తిగా భాసించినాడు అది శ్రీకృష్ణుడు కుచేలాది భాగవతులకు చేసిన పాదపూజవలె ప్రకాశించినది. ఒక ప్రక్క వైదిక మంత్రములు, మరొక ప్రక్క మంగళవాయిద్యములు ఇంకొకప్రక్క జయజయ ధ్వానములతో ఆ శ్రీమన్నారాయణుడు అర్చించబడినాడు. రెండుకన్నులు చాలలేదు. అందరి నేత్రములు అందరి శిరస్సులు అందరిచేతులు అందరి కాళ్ళు అందరి హృదయాలు ఆ సర్వేశ్వరుడివే కదా అని అందరూ ఆనంద పరవశులైపోయిరి.

పిమ్మట రాజేరుభక్త బృందము గురుదేవ భక్త సమాజమువారు మన శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారికి అద్భుతమగు మహాసన్మాన పత్రమును సమర్పించిరి. ఆ

---

Assend the zenith of spiritual perfection and behold unity.
—*Swami Sivananda*

సన్మానపత్ర పఠనము శ్రీ M. T. ఆళ్వార్ గారిచే చేయబడినది. జయీభవ ! దిగ్విజయీభవ ! దేవానంద సద్గురూ ! అంటూ పఠించుచుండగా అందరి హృదయములు పులకరించిపోయినవి. ఆ సన్మాన పత్రములను భక్తులకు కానుకగా సంఘమువారు సమర్పించుకొనిరి. శ్రీశ్రీశ్రీ భూమానందస్వాముల వారు చిన్నస్వాముల వారిని శ్రీ గురుదేవానంద మహారాజ్ అని సత్కరించిరి.

ఆనాటి మధ్యాహ్నము. 3 గం॥ నుండి 4గ॥ల వరకు గుమదాం భక్తబృందము వారిచే భజనలు దివ్యనామ కీర్తనలు మనోహరముగా చేయబడినవి.

నాటిసాయంకాల మహాసభలకు పరమపూజ్య శ్రీశ్రీశ్రీ ప్రసన్నానందస్వాముల వారు గండిపాళెం వారు అధ్యక్షత వహించి తమ ప్రసంగములో హరిభక్తులతో మాటలు ధరనెన్నడు చెడని మాటలని బాధల్లోనున్నవారికే బోధలు చేయాలని ఆంజనేయస్వామి వారి పరా భక్తిని, అనన్య భక్తిని వివరించినారు, భగవద్గీత యందలి భక్తి యోగ సారాంశమును

అద్వేష్టా సర్వభూతానాం !
మైత్రః కరుణ ఏవచ !
నిర్మమో నిరహం కారః
సమ దుఃఖ సుఖఃక్షమా ॥

సంతుష్ట స్సతతం యోగీ - యతాత్మా దృఢ నిశ్చయః !
మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్త స్సమే ప్రియః ॥

అంటూ భక్తుల లక్షణాన్ని ఎంతోచమత్కారంగా వివరించి ద్వేషరాహిత్యాన్ని సమస్త ప్రాణులతో మైత్రిని, కరుణ ఏర్పరచుకొని నిరహంకారాన్ని ప్రశాంత మనస్సును అలవరచుకొని జీవితాన్ని ఆనందంగా లీలానాటకంగా భావించి అనుభవించాలని పరమాత్మ అనుగ్రహాన్ని పొందవలెనని ఆశీర్వదించినారు. అనంతరము శ్రీరామ యోగిగారు (లయిదాం) మనఇల్లే - మనకు దేవాలయం అని; ప్రతిక్రియ ప్రతి నిమిషం భగవదారాధనగ ఉండాలని; ఇదే తేలికమార్గమని. భగవంతునిగోపికా స్త్రీలు నానా విధములగు పద్ధతుల ద్వారా భక్తితో పొందితిరని సత్యవాక్కు అలవరచుకోవాలని

పవిత్ర జీవనానికి శ్రీశ్రీశ్రీ స్వామీజీల సాంగత్యము ఎంతో మేలు చేకూర్చునని ప్రసంగించినారు. తరువాత బాజా బ్రహ్మచారిణి అమ్మగారు (బోనంగి) తమ ప్రసంగములో గురుదేవులను కీర్తించి మన శరీరంలోని చిలుక లేవకముందే గురుదేవుల అనుగ్రహంతో పరమాత్మకు చేరువకావాలని నేటికాలమాన పరిస్థితులలో గృహిణి బాధ్యత ఎంతో విలువైనదని పలు ఉదాహరణలతో చైతన్యవంతమగు ప్రసంగమును ఆశీస్సులనందించినారు.

అటు పిమ్మట మాతా శాంతిబాయిగారు శ్రీమద్భగవద్గీతలోని 16 వ అధ్యాయ సారాంశమును దైవాసుర సంపద్విభాగ యోగమును 26 గుణములను అద్భుతముగా ప్రసంగించిరి.

భయరాహిత్యము - అంతఃకరణ శుద్ధి - జ్ఞానము - దానము - నిగ్రహము - యజ్ఞము - అధ్యయనము - తపస్సు - కపటము లేకుండుట - అహింస - సత్యం - కోపము లేకుండుట - త్యాగము - శాంతి - కొండెములు చెప్పకుండుట - దయ - అనాసక్తి - మృదుత్వము - సిగ్గు - చంచల రాహిత్యము - బ్రహ్మతేజస్సు - ఓర్పు - ధైర్యం - శుచి - అద్రోహము - స్వాతిశయము లేకుండుట అను దైవీగుణములు అలవరచుకొని దివ్యతత్త్వము సాధింపవలెనని బలిచక్రవర్తి కథను ఉదహరించి శ్రోతలకు తమ ఆశీస్సుల నందించినారు.

అనంతరము శ్రీశ్రీశ్రీ సదానందులవారు తీర్థపాదులు, పూజ్యపాదులు, శ్రీపాదులు అని మహాత్ములకు గల పేర్లను తెలుపుచూ "మోక్షార్థీ పురుషః శ్రేష్ఠః" మోక్షముగోరు పురుషుడే శ్రేష్ఠుడని, "అన్త్యకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్" అను గీతావాక్యమును వివరించుచూ అంత్యకాలమందు కూడా నన్నే స్మరించుచూ ఎవరు దేహత్యాగము చేసెదరో వారే నన్ను పొందుదురని వివరించినారు. సేవ-ప్రేమ - దానము - ధ్యానము - సాక్షాత్కారము అనెడి సిద్ధాంతములు లేనిదే ఆధ్యాత్మికత అలవడదని; వీటిని ఆధారముగా సర్వమతములు వెలసినవని అందరూ పై శ్రీశివానంద స్వాములవారి సూక్తులను ఆచరించి తరించవలెనని ఆశీర్వదించినారు. దేవానందుల వార్కి అనేకులు సన్మానములు చేసిరి.

---

Sadhana is more important than getting into contact with queer people. —*Swami Sivananda*

# నాన్యపంథా అయనాయ విద్యతే

చివరిగా ఈ షష్ట్యబ్దిపూర్తి మహోత్సవ జ్ఞాన యజ్ఞ సభలకు ముగింపు సందేశముగా శ్రీశ్రీశ్రీ దేవానంద స్వాములవారు లక్షలాది జనప్రవాహ మధ్యమున పెద్ద వేదికపై కూర్చుండి యోగేశ్వరుని వలే చిరునగవు మోముతో దివ్య సంకీర్తనలను ఆలపించి మేఘ గంభీర నాదముతో అశేష భక్తజనుల నుద్దేశించి

శ్రీశ్రీశ్రీ శివానంద స్వాములవారి ఆశయములను వారి ఉదారమనస్సును ఉదాహరణ కథలను వివరించుచూ

సర్ప దుర్జన యార్మధ్యే వరం సర్పో నదుర్జనః
సర్పో దశతి కాలేన - దుర్జనస్తు - పదేపదే ॥

పాము, దుర్మార్గుడు వీరిద్దరిలో పామే శ్రేష్ఠమైనది. ఎందుకనగా పాము ఎప్పుడో ఎక్కడో ఎవరినో మాత్రమే ఎదో ఒకసారి కాటువేస్తుంది. దుర్జనుడు అందరినీ అన్నివేళల అన్ని సమయాల్లో బాధిస్తాడు. కాబట్టి దుర్జన సాంగత్యము వదులుకోవాలని బోధించి;

పరోపకారాయ ఫలంతి వృక్షాః
పరోపకారాయ వహంతి నద్యః
పరోపకారాయ దుహంతి గావః
పరోపకారార్థ మిదం శరీరమ్ ॥

పరోపకారం కోసమే వృక్షాలు ఫలించుచున్నవని; నదులుకూడా పరోపకారం కోసం ప్రవహిస్తున్నవని; ఆవులు పరోపకారం కోసమే పాలను అందిస్తున్నవని. మనం కూడా మనశరీరాన్ని పరోపకారం కోసమే వినియోగించి తరించాలని వివరిస్తూ మనం ఎక్కడ ఉన్నా -

వనే రణే శత్రు జలాగ్నిమధ్యే
మహార్ణవే - పర్వతమస్తకేవా ।
సుప్తం - ప్రమత్తం - మనుజం హితోక్తే
రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥

మనం అరణ్యంలో ఉన్నా - శత్రుమధ్యలో ఉన్నా అగ్నిలో ఉన్నా నీటిలో మునిగినా కొండలలో తిరుగాడుతున్నా నిద్రిస్తున్నా జాగరూకతతో లేకున్న మనం చేసుకున్న పూర్వపుణ్యాలు రక్షించి తీరుతాయని తమ జీవిత అనుభవాలను పూసగ్రుచ్చి నట్లు తెలిపి తాము తీవ్ర అనారోగ్య పరిస్థితులలో ఉన్నట్లుగా డాక్టర్లు తెలిపిననూ తాము ఏమాత్రము కలతచెందలేదని సహస్రబాహువులతో ఆ నారాయణుడు సహాయము తనను ఏ విధముగా అందించెనో అన్ని వివరముగా తెలిపినారు. ఆనందోహం-ఆనందోహం-ఆనందం - బ్రహ్మానందం అనే శ్రీ గురుదేవుల గీతం నాకు ఎంతో ధైర్యం ఇచ్చిన దని మారుమూల పల్లెలో చదువు సంధ్యలు లేని తనను అద్భుత శిల్పంగా ధన్యత చెందిన వ్యక్తిగా సమాజ సేవకునిగా గురుపాదార్చకునిగా; లక్షలాది మంది సత్పురుషులతో దివ్యానుభూతిని పంచుకొనే వ్యక్తిగా ఆనందమూర్తిగా దేవానందునిగా తీర్చి దిద్ది మీ అందరిలో, ఆ వేణునాద విశారదుని, దర్శించే భాగ్యాన్ని అందించిన, నా గురుదేవులు శ్రీశ్రీశ్రీ శివానందలవారి మహిమను, ఏమని వర్ణించాలని ! ఆనందాశ్రువులతో మూగవోయిన కంఠంతో గురుదేవుల కీర్తిని ఎలుగెత్తి చాటి మీ అందరి జీవితములు దివ్య జీవితములు అగుగాక అని; శారీరక ఆరోగ్యము - ఆరోగ్య సూత్రములు ఆహార నియమములు పాటించి శుచి - శుభ్రత - అలవరచుకొని సేవాభాగ్యము పొందవలెనని అహింసను పాటించవలెనని మద్య మాంసములు సేవించరాదని సత్యవాక్కు కలిగి పరోపకారముతో ఉండి మీ పిల్లలను దేశభక్తులుగా; భగవంతునికి పూజాకుసుమములుగా మార్చుడని; గ్రామములన్ని రామ రాజ్యములు కావలెనని పాడిపంటలతో మన దేశము వర్ధిల్లవలెనని లోకమంతా సుఖశాంతులతో తుల తూగవలెనని

లోకాస్సమస్తా సుఖినో భవంతు ।
సర్వేజనా స్సుఖినో భవంతు ॥ అని

తమ షష్ట్యబ్ది దివ్యసందేశమును మనోహరముగా హృదయములకు హత్తుకొను రీతిగా మధురాతి మధురముగా ప్రసంగించి ఆశీస్సుల నందించినారు.

పిమ్మటకార్యకర్తలు యావన్మందికి పేరుపేరునా ధన్యవాదములు తెలపినారు. పై కార్యక్రమములన్నిటికి సందర్భోచితముగా శ్రీ యం.టి. ఆళ్వార్‌గారు వ్యాఖ్యానము నందించి ఆనందపరచినారు.

"హరిః ఓమ్ శ్రీకృష్ణార్పణమస్తు"

---

When the mind is serene, Truth shines. —*Swami Sivananda*



1997 సం॥రం ఫిబ్రవరి 21, 22, 23, తేదీలలో బి. రాజేరులో జరిగిన బ్రహ్మజ్ఞానయజ్ఞమునకు విచ్చేసిన మహాత్ములకు, వివిధప్రాంతములనుండి వచ్చిన భక్తులందరికి ఈ దిగువ పేర్కొనినవారంతా తమ తమ గృహాలలో తగిన వసతులు ఏర్పాటుచేసి, త్రికరణశుద్ధిగా సేవ చేసారు.

బి. రాజేరు గ్రామ భక్తులు :-

శ్రీ గొల్లు గంగునాయుడుగారు, వారి కుటుంబమంతా

(పూజ్యశ్రీ స్వాములవారికి వసతి మరియు మహాత్ములకు, దూరప్రాంతాల నుండి వచ్చిన భక్తులకు భోజన సమపాయములు)

శ్రీ పాళల సన్యాసినాయుడు దంపతులు, శ్రీ పుప్రేవు హరగోపాలరావు దంపతులు, శ్రీ జాగరపుసింహాచలం మాష్టారు దంపతులు. శ్రీ బేత అప్పలనాయుడు దంపతులు, శ్రీమతి శిరిపురపు కృష్ణమ్మగారు, శ్రీ గొల్లు సూర్యనారాయణ దంపతులు, శ్రీ గోగాడ సత్యం మాష్టారు దంపతులు, శ్రీ కిలపర్తి రామునాయుడు దంపతులు, శ్రీకొరుపోలు ముత్యాలునాయుడు దంపతులు, శ్రీ గోగాడ అప్పలనాయుడు దంపతులు, శ్రీ చల్లా జోగారావు దంపతులు, శ్రీ లచ్చిరెడ్డి పోలినాయుడుదంపతులు, శ్రీ తొర్లడి సత్యనారాయణ దంపతులు, శ్రీ తొత్తడి దేవుడు దంపతులు, శ్రీ చల్ల అప్పల ముత్యాలునాయుడు దంపతులు, శ్రీ టంకల సూర్యనారాయణ దంపతులు.

బుడతనపల్లి గ్రామ భక్తులు :-

శ్రీ వర్రె రామునాయుడు గారు, శ్రీ బర్ల మహేశ్వరరావు గారు, శ్రీ బర్ల శ్రీరాములుగారు, శ్రీ గిడుతూరి ఎర్రయ్యగారు, శ్రీ దోకల ఎర్నాయుడు గారు, శ్రీ రొంగల సత్యం మాష్టారుగారు, శ్రీ వల్లూరి గంగరాజుగారు, శ్రీ శిరికి సింహాలం గారు, శ్రీ రొంగలి నారాయణమూర్తిగారు.

రుద్రపాలెం గ్రామ భక్తులు :-

శ్రీమతి గేదెల సన్యాసమ్మగారు, శ్రీ చొక్కాకుల మహేశ్వరరావు, శ్రీ చొక్కాకుల శ్రీనివాసరావు. ఓం తత్సత్

ఇట్లు,

గొల్లు గంగునాయుడు

బి. రాజేరు.

Mind can attend to one thing alone at time. —*Swami Sivananda*

# పద్యరత్నం

(1) మలయాదేశము నందు, వైద్యునిగ, సన్మానంబులున్, సంపదల్
గల వృత్తినే. విడనాడి. సర్వజన, సంఘశ్రేయకాంక్షన్, హి
మాచల, మందున్, తపమాచరించిన, మహాజ్ఞానిన్. శివానందునిన్
దలతున్ భక్తి వినమ్రచిత్తమున్, నాత్మజ్ఞాన మర్థించుచున్॥

(2) కడుమహానీయ, గాంగతట, కానన మందొక, యాశ్రమంబునన్,
సడలని దీక్షతో, తపము సల్పె-హిమాద్రిని కుప్పు సామిగన్,పుడమి
మనుష్య జన్మమును పొంది శరీరముపైన భ్రాంతి ఏర్పడినిదె
దివ్యజీవన బహౌషదమున్ భవరోగ వైద్యుడై॥

(3) సుందర గాంగ నిర్ఝర విశుద్ధ హిమాద్రిని. ద్వాదశాబ్దముల్,
బంధవిముక్తి గోరుచు, తపంబొన రించెను సిద్ధి గల్గియున్
అందరి మేలు కోరి మన కాత్మ వికాశము, దివ్యజీవనానందము
గూర్చు శాషల ననంతముగా నెలకొల్పె ధన్యతన్॥

(4) జ్ఞానంబున్ హరిపాద భక్తి, దయ నిస్వార్థాంతరంగంబుతో.
దీనుల్ రోగులు కష్టజీవనులు. తృప్తింజెంద, సేవించి, నిత్యా
నందంబును, యోగ సాధనలు. దివ్యాత్మ స్వరూపాలుగా, నానా
జీవుల నెంచె సద్గురు చిదానందుండు. యోగీంద్రుడై

(5) మనమందున్ మకరంద ధార. వచనంబా నందనోద్యాన
చందన, మాహ్లాదకరంబు, భక్తి రసమాద్యానంద, సంధాయ
కంబని, శిష్యోత్తములెల్ల మెచ్చెదరు, దేవానందునిన్ గొల్చి
చక్కని ఆధ్యాత్మిక సిద్ధిసాధనకు, మార్గంబున్ ప్రభోదించగన్,

---

Turiya is the consiousness of unity bereft of all dualities.
—*Swami Sivananda*

(6) అనురాగంబును, భక్తి శాంతము మహాత్యాగంబు
వైరాగ్యమున్, గని శిష్యోత్తముగా గ్రహించిన శివానందార్య
లానంద, నందన మందునే, విహరించునట్లుతని పాదాబ్జత
సేవారతిన్ ఘనశాస్త్రార్థరహశ్య వేత్తయగు చిన్నస్వామికీర్తించెదన్

(7) బడిలోనన్ చదువెంతలేదు, చిరుత ప్రాయంబునన్
భీతి గొల్పెడు, శీతాద్రి విశాల, సానువులపై పెక్కేండ్లు
సద్భక్తి యొల్కెడు, దీక్షన్ గురుసేవజేయుచు, హృషీ
కేశంబునన్ మౌనియై కడుశ్రద్ధన్, పలుశాస్త్రముల్ చదివె
సంస్కారంబు దీపింపగన్.

(8) అకలంకష చిత్తవృత్తి, పరమాత్ముని గొల్చుచు, సర్వ
జీవ, తారకమగు, శక్తి యొక్కటె, పరాత్పరు డొక్కడె
యంచు, నమ్మి యూరక, మతభేదముల్, పెనుగులాటలు
కక్షలు పెంచకుండగన్, సకల మతాలసారము ప్రచారము చేతురు
దివ్యజీవనుల్॥

ఇట్లు
దివ్యజీవన సంఘం
విజయనగరము
తే. 28-2-1997



You should renounce, the moment real Vairagya dawns in you.
—*Swami Sivananda*

# వార్తావాహిని

## దివ్యజీవన సమన్వయ సంఘశాఖల వారిచే సాధనా సమావేశములు

శ్రీ స్వామి వెంకటేశానందగారి ఆధ్వర్యమున 1-1-97 నుండి ఈ క్రింది కార్యక్రమములను నిర్వహించ నుద్దేశించిరి.

| | | |
|---|---|---|
| ఆదివారం | ఓం నమోనారాయణాయ మంత్రము | 1 గంట |
| సోమవారం | ఓం నమశ్శివాయ | 1 గంట |
| | మహా మృత్యుంజయ మంత్రము | 108 సార్లు |
| మంగళవారం | హనుమాన్ చాలీసా | 6 సార్లు |
| బుధవారం | శ్రీ విష్ణు సహస్ర నామములు | 1సారి |
| | ఓం నమో భగవతే వాసుదేవాయ | 108 సార్లు |
| | ఓం నమో భగవతే శివానందాయ | 108 సార్లు |
| శుక్రవారం | గాయత్రీ మహామంత్రము | 108 సార్లు |
| శనివారం | గురు పాదుకాపూజ, భజన, సత్సంగము, భగవద్గీతా పారాయణము. | |

26-1-97 బుసికిడి గ్రామములో పూజ్యశ్రీ పడాల హరిదాసు మాష్టరుగారు, నెమలికొండ శాంతి ఆశ్రమము శ్రీ సదానంద స్వాములవారు పాల్గొనిరి. సుమారు 500 మందికి అన్నదానం జరిగినది.

9-2-97 బదగాం గ్రామములో : హరిదాసుగారు, ఘోరక్‌మాలీ హిందీ మాష్టరుగారు అన్నదానం, భగవద్గీత పుస్తకముల వితరణ జరిగెను.

2-3-97 అంకురు గ్రామం : శాంతి ఆశ్రమము సదానంద స్వాముల వారు పాల్గొనిరి. పై గ్రామముల వలెనే కార్యక్రమములు జరిగినవి. హరి కథా కాలక్షేపము గూడా జరిగెను.

ఈ విధంగా సింగుపురం అప్పలస్వామిగారు తెలియజేస్తున్నారు.

* * *

జనవరి 26, 27, 28 తేదీలలో రాయపూరులో దివ్యజీవన సభలు (**M.P. State level conference**) అత్యంత వైభవముగా జరిగినది. పరమపూజ్యశ్రీ స్వామి చిదానందులవారు 27, 28 తేదీలలో సభలకు అధ్యక్షత వహించి, 28వ తేదీన సభలకు పూర్ణాహుతి సలిపినారు.

28వ తేదీ సాయంత్రము పరమపూజ్యశ్రీ స్వామి దేవానందులవారు నందినీ నగరమునకు విచ్చేసి సాయంత్రము శ్రీ స్వామి శివానంద భజన హాలులో కొద్దిసేపు భజన చేసి భక్తులను ఆశీర్వదించినారు. 29వ తేదీన పూజ్య స్వామీజీవారి **Diamond Jubilee Year** సందర్భముగా, శ్రీవారికి సన్మానము జరిగినది. భక్తులందరూ శ్రీవారిని పూలమాలలతో సత్కరించి, శ్రీవారికి హారతి ఇచ్చి ప్రణమిల్లినారు. శ్రీవారికి దివ్యమైన శాలువాను, పండ్లు సమర్పించి 108 సార్లు శ్రీవారి ఆయురారోగ్య నిమిత్తమై మహా మృత్యుంజయ మంత్రమును జపించినారు.

పూజ్యశ్రీ స్వామివారు తమ అనుగ్రహ భాషణములో దివ్యజీవనమును గురించి, మానవజాతి కర్తవ్యమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీవారి భజనలు, కీర్తనలు అందరిని ఆనందముతో నింపివేసినది. సాయంత్రం శ్రీవారు భక్తులను ఆశీర్వదించి భిలాయి నగరులో జరుగు కార్యక్రమములకు వెళ్ళినారు. ఈ రెండు దినముల కార్యక్రమములు అత్యంత వైభవముగా జరిగినది. అత్యంత పవిత్ర హృదయులు, పూజ్యులు అయిన స్వామివారి కరుణ అందరి భక్తులకు ఆనందము చేకూర్చినది. ఇట్లు వి. కె. మూర్తి గారు తెలియజేస్తున్నారు.

* * *

డెంకాడ : 6-3-97 శివరాత్రి ఉదయము తెల్లవారుఝామున నగర సంకీర్తన, పగలు ధ్యాన నియమములను పాటించిరి. రాత్రి 10 గంటలకు

---

Philosophical Truth is not revealed to the weak.

—*Swami Sivananda*

భజనపాటలు, కీర్తనలు స్త్రీలు చక్కని శైలిలో జరిపిరి. శ్రీ కూరుకొండ రాజుగారు లింగోద్భవము శ్రీ చోడవరపు శ్రీరాములుగారు రుద్రాక్షల గురించి, అక్షింతల కృష్ణమూర్తిగారు దేహము, దేహధారి చేయవలసిన విధుల గురించి వివరించిరి. శ్రీ శిరుగుడు అప్పలరాములుగారు దాశరథి శతక పద్యములు ఇతర భక్తిపద్యములను గానముచేసిరి. 5 గంటలకు భక్తులందరు సంకీర్తన చేసుకుంటూ సమీపమున ప్రవహించుచున్న 'చంపావతి' స్నానమునకు వెళ్ళిరి. నదీతీరమున భజనచేసి, మరల సంకీర్తనతో ప్రారంభించిన ప్రదేశమునకు వచ్చి నైవేద్య సమర్పణ, మంగళహారతి తరువాత ప్రసాద వితరణ జరిగినది. డెంకాడ ప్రజలలో నూతనోత్సాహము వెల్లివిరిసినది. ఇట్లు డెంకాడ శ్రీ గురుదేవానంద భక్త సమాజము అధ్యక్షులు శ్రీ చేకూరు కొండబాబుగారు తెలియజేస్తున్నారు.

* * *

రాజేరు :- 8-3-1997వ తేదీన పూజ్యశ్రీ దేవానందస్వాములవారి క్యాంపు రాజేరులో గొల్లు గంగునాయుడిగారి గృహం రామమందిరంలో సీతారామలక్ష్మణ, హనుమంతుని విగ్రహముల ప్రతిష్ట కంచిరెడ్డిపాలెం రాయవరపు కృష్ణ నూతన గృహములో సంకీర్తన, దేవుపల్లి గ్రామం వెళ్ళి, శివాలయం, కాపువీధిలో యున్న రామమందిరం దర్శించి, తదుపరి, బజారులో రామకోవెల దగ్గరనుండి వందలాది భక్తులతో నగరసంకీర్తన చేసుకుంటూ శ్రీపైడితల్లెమ్మవారి గుడివద్దకు వెళ్ళి సంకీర్తన మాత్రమే జేపి, నగరసంకీర్తనము ముగించిరి.

శ్రీ సింగంపల్లి సూర్యనారాయణగారి గృహమువద్ద ప్రార్థనలుచేపి శ్రీ గురుదేవ సమాజ నెలవారి సంత్సంగం అధ్యక్షత వహించిరి. శ్రీ పాశల సన్యాసినాయుడు గారు, శ్రీ వద్రెె రామనాయుడుగారు, శ్రీ చేత్రోలు నరసింహమూర్తిగారు, శ్రీ చేకూరి కొండ బాబుగారు, శ్రీ గొల్లు గంగునాయుడుగారు దేవుపల్లి హెల్తు అసిస్టెంటు డాక్టరు గారు, ఆ సభలో పాల్గొనిరి. శ్రీ జాగరపు సింహాచలంగారు, రాజేరులో జరిగిన బ్రహ్మజ్ఞాన యజ్ఞమునకు వచ్చిన విరాళ వివరములను తెలియజేసిరి శ్రీ గులిపల్లి కృష్ణగారు

యీ నెలలోవచ్చిన విరాళములగురించి తెలియజేసిరి. 9-3-97న దేవుపల్లి గ్రామములో స్వాములవారు హాజరైన యీ సందర్భంలో అత్యధిక భక్తులు పాల్గొనిరి. కార్యక్రమమునకు విచ్చేసినవారికి దేవుపల్లి భక్తులు చక్కటి విందు జేసిరి.

*   *   *

లింగుపురం :- 7-4-97న శ్రీ స్వామివెంకటేశానంద దివ్యజీవన సంఘసాధనా సమావేశము జరిపిరి. ఈ సందర్భములో జరిగిన కార్యక్రమములలో శ్రీ పడాల హరిదాసు మాష్టరుగారు దేవీమఠం మహంతుగా గోరక్షమాలి హిందీమాష్టరుగారు మొదలైనవారు ప్రసంగించారు

*   *   *

డెంకాడ :- 13-4-97 సత్సంగ కార్యక్రమము జరిగెను. జపము, ధ్యానములు జరుపబడెను. సంకీర్తన, మహామంత్రము, హారతితో కార్యక్రమము సమాప్తము జరిగినది. అన్నసంతర్పణకూడ విరివిగా జరిగినది.

*   *   *

నీలావతి గ్రామము :- 16-4-97 వేకువఝామున నగర సంకీర్తన తరువాత రామాలయములో శ్రీ సీతారామకళ్యాణము గ్రామపురోహితుని ద్వారా జరుపుకుంటిమి. ఉదయం 8-30 గంటలనుండి గం॥ 10-30 వరకు సంకీర్తన జరిగినది. ప్రసాద వితరణ జరిగినది, గ్రామస్థులందరు పాల్గొనిరి, శ్రీ గుల్లిపల్లి కృష్ణ తెలియజేస్తున్నారు

*   *   *

మరువాడ :- శ్రీరామనవమి ఉగాదినాడు ప్రారంభించి 16వ తేదీవరకు జరుపబడెను.

*   *   *

రాజేరు :- ఉగాది లగాయితు 16-4-97 శ్రీరామనవమి ఉత్సవములు జరుపబడెను. శ్రీ కొలచిన సుబ్రమణ్యం వేదపండితులు శాస్త్రోక్తముగా కళ్యాణం జరిపించిరి, శ్రీ కొల్లి అచ్చమనాయుడు, శ్రీమతి పైడితల్లమ్మదంపతులు పూజలో కూర్చుండిరి. భజన సంకీర్తనలు, నృత్యం చేస్తూ విరివిగా ఊరేగింపు. అన్నదానము జరిపిరి. శ్రీ గంగునాయుడుగారు తెలియజేస్తున్నారు.

*   *   *

---

**Philosophy deals with man, God, Brahman and univesse. Philosophy signifies love of wisdom** —***Swami Sivananda***

కొత్తపేట :- చైత్ర శుద్ధ పాడ్యమినుండి 16-4-97 వరకు శ్రీరామనవమి నవరాత్రులు జరుపబడెను. ప్రతిదినము నగరసంకీర్తన, గురువారం ఉదయం 7 గం॥ల వరకు అఖండ నామసంకీర్తన జరిగెను. శ్రీ రెడ్డి అప్పలనాయుడు, శ్రీమతి కన్నతల్లి గార్లచే పురోహితులు శ్రీ దూర్వాసుల జగన్నాధశాస్త్రిగారు సీతారామకళ్యాణము జరిపించిరి, కార్యక్రమములో భక్తులు విరివిగా పాల్గొనిరి. ప్రసాద వితరణ జరిగెను. 22-4-97 పూర్ణిమ దినమున నగర సంకీర్తన అనంతరము శ్రీమతి రొంగలి భవానీ గారి గృహమునందు ఆ దంపతులచేత శ్రీ శివకోట సత్యనారాయణగారు, పురుష సూక్త, శ్రీసూక్త సహితముగా సద్గురు పాదుకాపూజ జరుపబడి, పూజ్యశ్రీ దేవానంద స్వాములవారి ఆధ్యాత్మిక ప్రబోధమునుండి "నమ్మిచెడునట్టి వారలేనాడు లేరు" అను వ్యాసం చదువబడెను. వచ్చిన భక్తులకు అన్నప్రసాద వితరణ గావించబడెను. 8-30 గం॥ నుండి 10-30 సంకీర్తన జరిగెను. శ్రీ రాజాన గంగారావు తెలియ జేస్తున్నారు.

* * *

మనుబోలు : శ్రీరాములవారి తిరునాళ్ళు జరిగినవి, 8 రోజులు ఉభయం చేసిరి. 9 వ రోజున ఉచ్చూరు లచ్చయ్య పెండ్లి సందర్భముగా ఉభయ జరిపించాలి. వసంతోత్సవము జరిగినది. సుధాకరయ్య, సునీతమ్మ వాళ్ళు బాగుగానే జరిపించి - షామియానాలు, ఊరేగింపుకు ట్రాక్టర్లు మొదలగునవి వినియోగించి వైభవముగా జరిపించిరని రమణమ్మగారు వజ్రమ్మ గారు తెలియజేస్తున్నారు.

* * * *

బ్రాహ్మణతర్లా : 27-4-97 న శ్రీకాకుళం జిల్లా దివ్యజీవనసంఘముల మహాసభ బ్రాహ్మణతర్లలో జరుపబడినది. కాశీబుగ్గ, పలాసా, దిమిలాడ సంఘాల ప్రతినిధులు భక్తులు బ్రాహ్మణతర్లా వారు పాల్గొనిరి. ఉదయం 5-30 నుంచి నగర సంకీర్తన, ధ్యానం, గీతాపారాయణం, విష్ణు సహస్రనామ పారాయణ జరిపిరి. శ్రీ షిర్డిసాయిబాబా మహిళా సంఘము వారు కూడా పాల్గొనిరి. 11 గం. లకు పాదుకాపూజ, సాయంకాలం 3 గం. నుండి గం. 5-30 ని॥ల వరకు ఉపన్యాసములు జరిగెను.

మహాసభలో పాల్గొనిన భక్తులకు ఉదయం అల్పాహారం, మధ్యాహ్నం నారాయణ సేవ పిండివంటలతో శ్రీ శాసనపురి కామేశ్వరరావు దంపతులు ఆదరణతో నిర్వహించిరి.

నాటి సాయంకాలము సభకు, శ్రీరామయోగి సభకు అధ్యక్షత వహించిరి. పూజ్యశ్రీ కూర్మానంద స్వాములవారు (జి. ఆర్. పురం ఆశ్రమం) శ్రీ చింతాడ సూర్యనారాయణగారు, పూజ్యశ్రీ సదానందస్వాముల వారు (నెమలికొండ) శ్రీ భూమానంద స్వాములవారు (మహాదేవపురం) శ్రీ పొగిరి కూర్మనాయుడుగారు పూజ్యశ్రీ స్వామి వెంకటేశానందస్వాముల వారు శ్రీ ఎల్. పద్మనాభస్వామిగారు, శ్రీ మధుసూధనరావుగారు, శ్రీ ఎన్ సత్యనారాయణశాస్త్రిగారు, శ్రీ టి. రామారావుగారి వందన సమర్పణతో సభ ముగించబడెను. ఇట్లు శ్రీ ఎన్. సత్యనారాయణ శాస్త్రిగారు తెలియ జేస్తున్నారు.



---

God reveals Himself in different ways at different stages of evolution. —*Swami Sivananda*

## పూజ్యశ్రీ దేవానంద చిన్నస్వాముల వారి రచనలు

### స్వతంత్ర రచనలు

- అధ్యాత్మిక ప్రబోధము
- అధ్యాత్మిక ప్రపాఠములు
- ధ్యాన సాధన
- భగవత్ప్రీతికరములైన ఎనిమిది పుష్పములు

### అనువదించిన గ్రంథములు



- మానసిక శక్తి
- పీయూషము
- అమృత గీత
- దివ్యజీవన సోపానములు
- యోగసారము
- శివానంద ప్రబోధము
- జ్యోతి - శక్తి - జ్ఞానము
- సత్సంగము - స్వాధ్యాయము
- దివ్యామృతము
- అధ్యాత్మిక నిధి
- గురుశిష్యులు
- హిమాలయ జ్యోతి
- కర్మయోగము
- నీతి వాక్యములు
- జీవన తత్త్వము
- అరంభసాధకులకు వేదాంతము
- భక్తి యోగము
- శివానంద లేఖలు
- జ్ఞాన యోగము
- గాయత్రి సాధన.

DESIGNED & PRINTED AT : SRI RATNA PRINTERS,
MUTHANGIVARI STREET, RAJAHMUNDRY. (A.P.) PHONE : 76345